# 'మతము'

## రామతీర్థ ఉపన్యాసములు

అయిదవ సంపుటం



947


అనువాదం:

స్వామి కేశవతీర్థ

శ్రీరామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల.

" అనుభవ వేదాన్త మేమిటో తెలుప :—
ముందంజవేయుచు ముందుకేగుచును
చేయు నభ్యుదయమౌ కృషియౌనుగాని
స్తంభించి క్రుళ్లు జడత్వంబుగాదు;
నిరత కర్మానంద మయతయేగాని
చీకాకునిడు బానిసత్వంబుగాదు.
నిశ్చలంబగు మానసిక శాంతిగాని
సంశయ వ్రణబాధ కాదహోకాదు.
నిర్మాణమేగాని, భేదనకాదు;
సక్రమంబైన సంస్కరణంబుగాని—
సాంప్రదాయాచార బంధనకాదు;
దృఢతర సత్యానుభూతియేగాని
చిలకపల్కులు గావు నమ్మమీమాట,
వాస్తవంబైన కవిత్వంబుగాని,
నమ్మరానట్టి పుక్కిటి కథల్ గావు,
ప్రామాణికంబగు తర్కంబుగాని
చచ్చిన గ్రంథకర్తల ప్రమాణముల !
సచివ ! సజీవమౌ జ్ఞానంబుగాని
వట్టి నిర్జీవ తార్కాణముల్ గావు; "
అనుభవ వేదాన్తమును నిల్పుకొనుము !

# అనుక్రమణిక



ఓం

# శ్రీ రామతీర్థ పరమహంస

●

రాయబహదూర్ లాలా బైజీనాథ్, బి. ఏ.

(భారత మహాసంస్కృతి గ్రంథము.)

●

“ ......... నేనతి సన్నిహితంగా ఎరిగినటువంటి, కలిసి పని చేసినటువంటి మూడవ మహాత్ముడు, పంజాబును తన జన్మచే పవిత్రపరచిన శ్రీ రామతీర్థస్వామి. ఇలాంటి మహాత్ములు, పరమ పవిత్రులు, ఎప్పుడో అసాధారణావకాశము లలో గంభీరమైన బ్రహ్మజ్ఞానమునకు ఆదర్శంగా మానవుల మధ్య సాక్షాత్కరిస్తారు. కేవల దారిద్ర్యంలో పుట్టి, పంజాబు లోని గుజరన్వాలా జిల్లాలోని ఒక ప్రాచీనాచార బ్రాహ్మణ కుటుంబంలో ఉదయించి, ఇరవై-ఇరవైఒక్క సం॥ల వయస్సులో పంజాబు విశ్వవిద్యాలయంలో సుప్రసిద్ధి వహించి, గణిత శాస్త్రంలో యం. ఏ. పదవి అలంకరించారు స్వామి. తర్వాత ఆయన లాహోరు ఫోర్మన్ క్రిస్టియన్ కాలేజీలో అధ్యాప కుడుగా పని చేశారు. కానీ, అచిరకాలంలోనే ‘తత్త్వమసి’— అన్న ఉపనిషత్ప్రవచన సత్యదర్శనానికి ఉద్యోగాన్ని వదలి వేసి, ప్రాపంచికమైన సర్వసంబంధాలు పరిత్యజించారు. చేతిలో ఒక్క ఉపనిషత్ గ్రంథముతో, వన మృగ పక్షిసంఘాలు, హిమాలయ నిర్మలగంగాజలాలు సహవాసులుకాగా, శీతోష్ణ

బాధలను, అరణ్యాపాయాలను ధైర్యసాహసాలతో సహిస్తూ, ఈ యువకుడు సంవత్సరాల తరబడి జీవిత సమస్యల మీద గాఢ ధ్యాననిమగ్నుడై సంచరించాడు. ఒకసారి కైలాసపర్వతాలకు నిర్గమిస్తూ, ఇంకొకసారి కాశ్మీరములోని అమరనాథానికి పయనిస్తూ, ఒకసారి యమునోత్రికి, మరొక సమయంలో గంగామూలమైన గంగోత్రికి పయనిస్తూ, కొన్నాళ్లు నదీతీరముల యందు ధ్యానమగ్నుడై, రోజులకు రోజులు అలాగే కూర్చుంటూ, తన అన్వేషణావస్తువు దొరకని పరిస్థితుల్లో, తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పూర్ణంగా మరచిపోయి, తీవ్ర విరహావేశంతో ఒక్కొక్కప్పుడు నదిలో దూకుతూ, స్వామి బ్రహ్మాన్వేషణ చేశాడు. చివరకు ధ్యానయోగంచేత తన అన్వేషిత పరమ వస్తువును ఇరువైతొమ్మిదో యేట దర్శించాడు. భారతవర్ష సేవకు సంసిద్ధుడై, తర్వాత ఆయన ప్రజల మధ్యకు వచ్చాడు. సమస్త జాతులకు, వేలకువేలమంది ప్రజలకు తన దివ్యసందేశాలను ఉపన్యసించాడు. తన మనోవాక్కాయ నైర్మల్యము, మనోహర వ్యక్తిత్వము చేతనే ప్రజలను తనలోకి ఆకర్షించుకొన్నాడు. దేహసుఖభావన అనేది పూర్ణంగా మరచిపోయి, తనకు లభ్యమైన ఏదో నిరాడంబరాహారాన్ని భుజించేవాడు. తన జీవిత ముఖ్యావసరాలకు కావలసిన దాన్ని తప్ప ఎక్కువ యే వస్తువు వుంచుకుండేవాడు కాదు స్వామి. డబ్బుగాని, వస్త్రాలుగాని, ఇంక యే వస్తువులనుగాని తన కెవరైనా బహూకరించినపుడు తక్షణమే ఇతరులకు ఇచ్చేసేవాడు. తనను ప్రేమించే భక్తులచే యివ్వబడిన రుచ్యాహారాలను నిరాకరించే

వాడు. సత్యజీవితాన్ని వాంఛించేవాళ్ళకు నిరాడంబర జీవితము,
ఉన్నత భావన అవసరమని స్వామి కారణం చెప్పేవాడు.

ఆయనకు ఆధిక్యతా భావన లేదు. గర్వప్రవర్తన లేదు.
నేను గొప్పవాణ్ణి అనే స్మృతే లేదు. స్వామి సన్నిధికి
వచ్చిన ప్రతివ్యక్తి ఆయన చిరునవ్వుల వెన్నెలలో ముగ్ధుడై
తన దుఃఖమంతా, మనోవ్యథనంతా తక్షణమే మరచి, ఆనంద
పడేవాడు. ఆయనకు ఎంత గాఢమైన విద్యా ప్రేమ వున్న
దంటే — పాశ్చాత్య మతతత్త్వ వాఙ్మయ సముద్రమంతా
ఏకొద్ది కాలంలోనో ఆపోశించాడు. వుపనిషదృషుల, వ్యాస,
కృష్ణ శంకర బుద్ధాదుల సిద్ధాంతములు ఆయనకు షేమ్స
తబ్రిజ్ (ShamesTabrez) మౌలానా రుమీల ( Maula-
na Rum) సిద్ధాంతాలవలె అరచేతిలో వుండేవి. కాంట్,
షోపెన్ హార్, ఫిచిట్ ( Fichte ) హెగల్ మొద
లయిన వాళ్ళు కబీరు నానక్ లవలె ఆయనకు సన్నిహితులు.
స్వామియొక్క ముఖ్యాంశములన్నీ వురుదు కవిత్వంలో వున్న
ప్పటికి, ఆయన గీతాలు ఇతర సుప్రసిద్ధ వేదాంత శ్లోకాలవలె
భారతీయుల్లో ఎక్కువ పరివ్యాపించినవి. 1902 లో జపాను
నుంచి అమెరికాకు పోతున్నప్పుడు ఆయనను మేము దర్శిం
చాము. అక్కడవున్న ఒక్క రెండుసంవత్సరాల స్వల్పకాలంలోనే
స్వామి అనేకమంది విద్యాజ్ఞాన సంపన్నులను ఆకర్షించాడు.
అమెరికాలోని గ్రేట్ పసిఫిక్ రైలురోడ్డు మానేజరు, స్వామికి
పుల్ మాన్ కార్ ఇచ్చే సందర్భంలో 'ఆయన మందహాసాలు
అనివార్యములయినవి' అని నిర్వచించాడు. అమెరికాలో తన

అభిమానులిచ్చే ఆతిధ్య పూజాసత్కారాలతో తృప్తిపొందక వాటికతీతుడై భారతదేశ సముద్ధరణానికై పనిచేశాడు. ఆయన నిరంతర కృషిని గురించి ప్రబోధించాడు "మనముందర వున్న సమస్య దరిద్రప్రజానీకాన్ని,రక్షించే, సేవించే సత్క్రమ యజ్ఞాన్ని నిర్వర్తించటం. దాని ఫలితాన్ని నిష్ప్రయోజనం కాకుండా నిర్వర్తించటం, ప్రతి భారతీయుడు తనకంటే, కులములో సంపదలో జ్ఞానములో శక్తిలో తక్కువగావున్న సోదర ప్రజలకు తాను కన్నబిడ్డలవలె సహాయం చేయాలె. లాభంమీద దృష్టిలేకుండా తల్లియొక్క పరమోత్కృష్టమయిన అవ్యాజానురాగంతో సోదరప్రజలకు ఆత్మాహారం యిస్తారుగాక. వుత్సాహము, జ్ఞానము, ప్రేమ అందరికి పంచిపెడతారుగాక. ఇదే నిజమైన నిష్కామ యజ్ఞం."

ఆయన తన సహజస్వభావాన్ని వ్యక్తీకరిస్తూ యిల్లా చెప్పాడు.—

కావాలె — సంస్కర్తలు.
ఇతరులనుకాదు, తమ్ముతామే సంస్కరించినవాండ్లు.
విశ్వవిద్యాలయ పట్టభద్రులుకాదు—
తమ ఆత్మవిజయంపొందిన పట్టభద్రులు.
వయస్సు :- దివ్యానందయవ్వనం.
జీతం :- బ్రహ్మత్వం.
త్వరగా దరఖాస్తులు పంపుకోండి—
యాచనలతో ప్రార్థనలతో కాదు.

ఆధికార రూపకమైన నిశ్చయమైన సంకల్పంతో.
ఎవరికి— జగదీశ్వరునకు, నీ ఆత్మకు."

పాశ్చాత్యభూమిలో ఒక రెండు సంవత్సరాలు మాత్రం నివసించి స్వామి భారతభూమికి తిరిగివచ్చాడు. కాని ఎవరైనా సరే యితర వ్యక్తి యిరవై సంవత్సరాల్లోనైనా గ్రహించలేని దాని అనుష్ఠాన జీవితజ్ఞానంతో తిరిగి వచ్చాడు. ఈ జ్ఞానాన్ని తన దేశీయులముందు రచనల్లో, ఉపన్యాసాల్లో స్వేచ్ఛగా పెట్టాడు. ఆయన వ్రాసినటువంటి, చెప్పినటువంటి ప్రతి విషయములో ప్రాచ్యదేశపు గాఢమైన వేదాంతవిజ్ఞానము, పాశ్చాత్య దేశపు అనుభవరూపకమైన భౌతిక కృషి కలిసి ముద్రితములై వున్నవి. పరిష్కరించవలసిన భారతసమస్య, "మితిమించిన జన బాహుళ్యంతో కూడిన అనుభవజ్ఞాన దారిద్ర్యము." ఈ అనుభవజ్ఞాన శూన్యతలోనే కాయకష్టాన్ని నిర్లక్ష్యించటము, అసహజములైన కుల జాతివిభాగ భేదములు, పరదేశయాత్రా నిరాకరణ, బాల్యవివాహము, స్త్రీలపైన బలాత్కారముగ నెట్టిన మానసికమైన, దైహికమైన అంధకారము యిమిడి వున్నవి. "మన పూర్వీకుల సాంప్రదాయమును మనము వదలి పనిచేయలేము. దానిని పూర్ణంగా వదలిన సంఘము నశిస్తుంది. దాన్ని పూర్ణంగా పాటించినా సంఘము నశిస్తుంది... అల్పభావాలతో వున్న పెద్దలకంటె, పెద్ద భావాలతో వున్న చిన్నవాళ్ళవల్లనే దేశం బలపడుతుంది.......చాలా కొద్దిరాబడి, దానికితోడు ఏటేటా పెరిగిపోతున్న కుటుంబంతోపాటు అర్థంలేని క్రూరాచారాలకు దాసులై వృథాగాచేసే వ్యయాలు - ఈవిధంగా

ప్రతి భారతీయ గృహము జాతి మొత్తానికి ఉదాహరణగా వున్నది... జనాభా సమస్య పరిష్కృతం కాకుండా వదలబడితే జాతీయైక్యతను గురించి, చిసమిష్టిసహకారాన్ని గురించి చేసే ప్రసంగాలన్నీ శవాలంకారాలే." పరదేశ యాత్రలచేత మతము, జాతి భ్రష్టమవుతుందనే భావనను పరిత్యజించటం లోనే పురుశనుసమార్గం ఇమిడియున్నది. 'నపుత్రస్య గతి ర్నాస్తి' అనే సిద్ధాంతాన్ని వదలిపెట్టాలి. వివాహము పవిత్ర బాంధవ్యంగా మాత్రమే యుండాలి. అనర్హులైన, నిష్ప్రయోజకులైన, విషక్రిమి సమానులను దేశంలో కోటానుకోట్లు అధికంచేయటానికి కాదు ఈ వివాహ సంబంధం. "అసిధారా వ్రత రూపకమైన పవిత్రతను సంపాదించు... పవిత్రత లేకుండా వీరత్వం ఉండదు, పవిత్రత లేకుండా ఐక్యత వుండదు. పవిత్రత లేకుండా శాంతి వుండదు" విద్యారంగంలో మనముందరవున్న పరమోత్కృష్టమయిన విధి — ఎక్కువ అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయకళాపారిశ్రామిక విజ్ఞానాన్ని ఆర్జించటానికి, దరిద్ర ప్రజానీకాన్ని స్త్రీలను పంపి, విద్య నేర్పించి, ఆ వుపయుక్త జ్ఞానాన్ని భారతదేశంలో వ్యాపింపచేయడమై యున్నది, "విశ్వాసజ్యోతిని, ప్రజ్వలన జ్ఞానకాంతిని నీ హృదయంలో ఆరక వెలిగేటట్లు చేయకుండా నీవు ఒక్క అడుగైనా ముందుకు వేయలేవు... ప్రగల్భ పరిస్థితులు దాటి అగాధమైన అంతస్థితిలో జీవించటం, నీ జీవితపు లోతులను స్పృశించటం, ప్రకృతిలోను, నీలోను ఏకమైవున్న

పరమ సత్యాన్ని దర్శించి అనుభవించటము, 'తత్త్వమసి' అన్నదాని సజీవరూపమై భాసించడం— ఇదే జీవితం. ఇదే అమృతత్వం." ఏ మతాచార్యుడుగాని, ఏ సంఘసంస్కర్తగాని ఈ మహామహునికంటే అతి విస్పష్టంగా సమస్యను, దాని పరిష్కృతిని నిర్వచించలేదు. ఆ మహాత్ముని ప్రబోధాలలోని సత్యాన్ని గుర్తించినవాళ్లు భారతదేశంలో చాలా కొద్దిమంది అనడమే చాలా విచారకరము. కొద్దికాలం ప్రజలమధ్య పని చేసిన తర్వాత స్వామి తన మామూలు తపోధ్యానాదులకై హిమాలయారణ్యాలకు నిర్గమించారు. ఒకనాడు టెహ్రీ సమీపంలోని గంగానదిలో స్నానం చేస్తూ తన ముప్పైమూడో యేట దేహపరిత్యాగం చేశారు.

స్వామివారి ప్రబోధ సారాంశం - ప్రాచ్య ఆధ్యాత్మిక జ్ఞానంతో జపాను అమెరికాల భౌతిక విజ్ఞానాన్ని మేళవించడము; "ఆత్మను కప్పిపుచ్చుటం కాదు. తనచేతులార తన ఆత్మనాశన కార్యంలో నిరంతర మగ్నులగుటం కాదు. ప్రజలయోగక్షేమాన్ని రవంతకూడా పట్టించుకోకుండావుండటం కాదు. నిగ్రహంలేకుండా వివేచనలేకుండా కేవల పశుదృష్టితో చేసే ప్రజాబాహుళ్య సృష్టిగాదు. అజ్ఞానంలో బానిసత్వంలో మునిగి పడే తృప్తిగాదు, మానసిక పరిశ్రమలేని జడత్వంగాదు. గతించిన పూర్వవిషయాలను వూరక పొగడుతూ, వర్తమానభవిష్యత్తులను నిర్లక్షించటం గాదు. కాని, పూర్వపు బరువు వేస్తున్న వస్త్రాచ్ఛాదనాలను తీసివేయడమై యున్నది. అజ్ఞాన బానిసత్వాన్ని పటాపంచలు చేయడమై యున్నది." ఈ మహాఋషి

పుంగవుని మహత్తర సందేశమిదే! ఆయన శరీరం గతించినా, ఆ మహాత్ముని పరిచయం గతించలేదు. సంవత్సరానికి సంవత్సరం గడచిన కొద్దీ అది నెమ్మది నెమ్మదిగా, దృఢంగా మన యువకప్రపంచంలో మాత్రమే వ్యాపించటం కాకుండా, ఒకప్పు డాయన సిద్ధాంతాలను అపహాస్యంగా చూచిన సాధువర్గంలో కూడా పరివ్యాపిస్తున్నది... ... ... ...



౬౦.

# మనవి!

ఈ గ్రంథం రామతీర్థస్వామివారి సంపూర్ణోపన్యాసాల లోని 'మతహృదయము' అనే అయిదోసంపుటం. అనుకోని తలంపుగా, క్లిష్టపరిస్థితులను భేదించుకొని ఈ గ్రంథం ప్రకటిత మైంది. రామానుగ్రహమిది! ప్రచండమైన భేదాసూయాగ్నిలో దగ్ధమై పోతున్న మానవలోకానికిది అమృతవర్షం!

అయ్యో—భయంకరమైన యీ రక్తపాతానికి కారణమేమిటి? ఈ పరస్పరానుమానరోగానికి మూలమేమిటి? సమస్త జగచ్ఛోభకానికి హేతువేమిటి? కారణం సత్యమతశూన్యత! మతమంటే ఆ యా ప్రవక్తలచేత ప్రబోధితములైన, కొన్ని కొన్ని బాహ్యచిహ్నాలతోకూడిన ఒక కర్మకాండగా తేలికగా సామాన్యులనుకుంటారు. అదికాదు - మతమంటే 'మానవుడా నీవు పశువ్వుకావు, భగవంతుడివి' అని నిన్ను బ్రహ్మత్వంలోకి తీసుకపోయేదే మతం. సమస్త దుఃఖానికి కారణమైన యీ వైరుధ్యంలో, ఒకే పరమసత్యం భాసిస్తున్నదని అభేదతత్వ శిఖరాలకు కొనిపోయేదే మతం. తరంగసంకులమైన, ఈ బాహ్యజీవన సముద్రోపరిభాగంనుంచి, అభేదశాంతినిలయమైన జీవితపులోతుల స్పృశింపజేసేదే మతం. అన్నిమతాలలోని అంతర్మతం యిదే. ఈ సత్యమతంలో మానవుడు ప్రవేశించంది — ఏనాటికీ శాంతి అనేది కుందేటి కొమ్మే.

ఈ సత్యమే భారతదేశానికి ప్రాణం. అయ్యో! ఆ పవిత్ర మతాన్ని దురర్థం చేసుకొని, ఒక మారణహోమంగా తయారు చేసుకోవడం - సకల జగచ్చైతన్య కారణమైన సూర్యకాంతిని, లోకంమాడిపోడానికి నిర్మితమన్నట్లు భావించడమే. ఈ దుఃఖానికి కారణం మతంకాదు. మతరాహిత్యమే - కాదా మతవేష మతరాహిత్యతే అంటున్నది భారతహృదయం.

ఉపనిషత్ప్రబోధితమైన, సర్వమహర్షి ప్రబోధితమైన, ఆ ఏకైక మతాన్ని, ఆ పరమసత్యాన్ని, లోకకల్యాణానికి స్వామి ఈ ఉపన్యాసాలలో మహాద్భుత నవ్యరూపంలో నిర్ఘోషించాడు! కాదు సత్యమతమే; స్వామియై నిర్ఘోషించింది. ఓ క్రైస్తవులారా! మహమ్మదీయులారా! ఓ హిందువులారా! వివిధ జాతుల్లారా! ప్రియులారా! రామబోధితమైన ఈ పరమ సత్యమతాన్ని గ్రహించండి. మీరు ప్రేమస్వరూపులైన భగవంతులుగా మారుతారు. మీ కత్తులు మహర్షుల యోగ దండాలవుతవి. మీ కపాలమాలలు జపమాలలవుతవి. మీ క్రోధాగ్నులు యజ్ఞాగ్నులవుతవి. మీ రణక్షేత్రాలు నైమశారణ్యాలవుతవి. మీరక్తనదులు, గంగా యమునలవుతవి. మీ ప్రపంచం స్వర్గమవుతుంది.

త్వరలో, స్వామి పరిపూర్ణ వేదాన్తవాఙ్మయమంతా ప్రకటించాలని ప్రయత్నిస్తున్నాము. త్యాగహృదయులైన శ్రీమంతులు, అనాధపిండరులవలె ముందుకువచ్చి, ఈ మహత్తర లోకకల్యాణరామోద్యమానికి చేయూత యిస్తారుగాక!

తమ ధనిక భావకళంకాన్ని త్యాగదీప్తులతో పారద్రోలి ధన్యులవుతారుగాక !

ఈ కార్యానికి ఎలాగో దోసిళ్లుపెట్టి సహాయపడిన మిత్రుడు శ్రీ గుదె అప్పయ్యకు నేను నిరంతరకృతజ్ఞుణ్ణి. ఈ గ్రంథం యింత త్వరలో ప్రకటితం కావడానికి మూలకారకులై, మా భావిమహోద్యమకర్మకు సముత్సాహావకాశాలు చూపిన శ్రీ అభ్యుదయ ముద్రణాలయాధిపతులకు, తత్కార్మికులకు - ఇలాంటి సన్మిత్రులతో పరిచయంచేసి, మా కార్యభారాన్ని పూలనావగాచేసిన అభ్యుదయోద్యమ ప్రారంభకులగు శ్రీ పిచ్చయ్యగారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతాపూర్వకాభివాదములర్పిస్తున్నాను.

నా యీ రామసేవాకార్యానికి, ఆధ్యాత్మికంగా సహాయం చేస్తున్న తీర్థపాదులైన శ్రీ శ్రీ పేరంటపల్లి బాలానందస్వామివారికి, ఉపనిషద్విహారాధీశ్వరులైన శ్రీ శ్రీ రాజేశ్వరానంద స్వాములవారికి, ప్రణవానందాశ్రమాధి పతులగు శ్రీ ప్రణవానంద స్వాములవారికి, శ్రీ కైలాసాశ్రమ నిత్యానంద చైతన్య స్వాములకు, భక్తిపూర్వక వినతులు.

ఈ సంపుటంలోని అరణ్యప్రసంగాల్లో 1 నుండి 7 వరకు అనువాదకార్యంలో అనల్ప సహాయంచేసిన శ్రీ కుందుర్తి ఆంజనేయులు బి. ఏకు, తమసలహాలతో అన్నివిధాల తోడ్పడుతున్న ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసులను, ఈ ఆనందసమయంలో పేర్కొని తృప్తివహిస్తాను.

శ్రీరామ తీర్థులవారి సత్యజ్ఞాన సందేశజ్యోతి, సర్వ దుఃఖ కారణమైన అహంకారాంధకారాన్ని పటాపంచలుజేసి, అఖండ విశ్వైక్యానంద తేజోసముద్రంలో మనలను లీనం చేసుందిగాక ! శ్రీ రామానుగ్రహంచేత, ఈ అస్థిపంజర స్వరూపుడనైన వ్యక్తినినేను అనే భావన నశించి, ఈ సమ స్తమూ నేననే సత్యస్థితికి అధిగమిస్తాముగాక ! 'ఆత్మవత్సర్వ భూతాని' అన్న పరమ ప్రేమలో మగ్నులమవుతాముగాక ! 'సర్వం విష్ణుమయం జగత్' అన్న ఆర్యసందేశం అనుభవ గోచర మవుతుందిగాక !

శ్రీరామతీర్థ సేవాశ్రమం,<br>
పిడుగురాల,<br>
5--10—47.

ఓం తత్సత్,

కేశవతీర్థస్వామి.



ఓం.

# మతము



(మద్రాసులో శాంతి ఆశ్రమంలో ఇచ్చిన ఉపన్యాసం.)

ఒకణ్ణి, తిరిగి తన స్వస్థానంలో, ఆనందప్రవాదంలో కట్టి వేసేది మతం. (Religion-Re, back, Ligare, to bind)

ప్రశ్న:— మూలం ఏది? దేని ఆజ్ఞచేత మనస్సు ఆలోస్తున్నది? కండ్లు చూస్తున్నవి? ప్రకృతి జీవిస్తున్నది?

ఉత్తరం:— మూలం బ్రహ్మము. మనస్సు దాన్ని ఆలోచించలేదు. దాన్ని కండ్లు చూడలేవు. ఆ పరబ్రహ్మ ఇంద్రియాతీతమైంది. దాని శక్తివల్లనే సర్వేంద్రియాలు పని చేస్తున్నవి. అది భావనాతీతమైంది. మనస్సూ, వాక్కూ, అక్కడనుంచి వెనక్కు తిరుగుతున్నవి.

పట్టకారు ఏ వస్తువైనా పట్టుకుంటుంది. కానీ దాన్నే పట్టుకొన్నవేళ్ళ నేవిధంగా పట్టుకుంటుంది? ఆలాగే మనస్సు, మేధస్సు, తమకు మూలమైన, మహాదుర్జ్ఞేయమైన పరబ్రహ్మను తెలుసుకోలేవు.

వేదాంతంచేత వన్నెకెక్కిన, మూఢ శాస్త్రాలనుంచి విడతీయబడ్డ మతం— అతిముఖ్యమైన ఒక నిగూఢయోగం. ఆ నిగూఢయోగంవల్ల, మనస్సు లేక బుద్ధి స్వస్థానానికి తిరిగి వెళ్లి, అక్కడ అతినిగూఢమైన పరమాత్మలో లీనమవుతుంది.

క్రైస్తవ భక్తులుగాని, మహమ్మదీయ భక్తులుగాని ప్రార్థనా సమయాల్లో చేతులు పైకెత్తుతారు. దానివల్ల పైన అందరానటువంటి, అతీతమైన పరమాత్మను చేరడానికి తాము ప్రయత్నిస్తున్నామని వాళ్లు అవ్యక్తంగా సూచిస్తున్నారు. హిందువుడు భక్తిపరవశుడైనప్పుడు, సమాధిస్థితుడైనప్పుడు నైజంగా కండ్లు మూసుకుంటాడు. దానివల్ల లోపల ఉన్నటువంటి, అగోచరమైనటువంటి, బాహ్యాభ్యంతరపరిపూర్ణమైన పరమాత్మలో అతని మనస్సు మగ్నమయిందని స్పష్టంగా తెలుస్తున్నది.

ఒక ప్రత్యేక మతంకాదు— ఇస్లాము, హిందూమతం, క్రైస్తవమతం మొదలైన ఈ సర్వమతాల్లో అంతర్గతమైఉన్న ఏకైకమతు ఖండితంగా చెప్పుతున్నది— ఆ వర్ణనాతీతమైన దుర్జ్ఞేయ బ్రహ్మానుభూతినే! ఆ స్థితిలో సకల కుల వర్ణ జాతి భేదాలు, సకల మూఢవిశ్వాసాలు, సిద్ధాంతాలు, శరీరమూ, మనసూ, దేశ కాలాలూ, కారణాలు' తర్కం, ఈ ప్రపంచమూ, తక్కిన ఊహాప్రపంచాలూ ఆ అనిర్వచనీయతత్వంలోకి కొట్టుకపోతున్నవి. ఇదంతా భ్రమగా ఉందా? ఎన్నటికీ భ్రమ గాదు.

ఎవరైన నిజమైన మతానుభవంగల వ్యక్తిని తన తన్మయత (సమాధి) స్థితిని స్మృతికి దెచ్చుకోని - అప్పుడు తనను గురించి గానీ, ప్రపంచాన్ని గురించిగాని, అందాకా ఎందుకు భగవంతుని గురించైనా ఏదైనా భావన పుడుతుందేమో చెప్పమనండి. నిజమైన బ్రహ్మజ్ఞానంలో, 'నాది-నీది' అనేది లేదు- కర్త అనేది కర్మ అనేది పేరుకుగూడా అక్కడ ఉండదు.

పైన సూచితమైన గమ్యస్థానానికి తీసుకపోయే ప్రసక్రమ ప్రయత్నమైనా మత సంబంధమైనదే.

ఏమిటో తెలేని ఆ విచిత్రఫలాన్ని గురించి ఆశించ వల సిన అవసరమేమిటని అడగవచ్చు. దీనికి ప్రత్యుత్తరం చెప్ప డానికి ముందు మానవాకర్షణలకు ముఖ్యాశయాలైన - జ్ఞానర వీరత్వము, ప్రేమా సుఖమూ ఎలా సిద్ధిస్తున్నవో మనం విచారిద్దాము.

1. జ్ఞానాన్ని గురించిన సాధారణాభిప్రాయం ఇది: బైటనుంచి అంటే గ్రంథాలు, బోధకులు మొదలైనవాటి ద్వారా సంపాదించిన విషయాలు జ్ఞానమని సాధారణాభి ప్రాయం. ఎప్పటి కాలానికో సంబంధించిన ప్రాచీన భాషా గ్రంథ పాండిత్యం, బుర్రనిండ కుక్కుకుంటే, అతడు గొప్ప విద్యాధికుడుగా పరిగణింప బడతాడు. పూర్వ విజ్ఞానం తృణీక రించ కూడదనే విషయం నిజమే. వాటిని జాగ్రత్తగా పఠించ వలసిన అవసరంకూడా ఉన్నది. మానవుడు సర్వ బాహ్య విషయాలను విడచి, తన లోపలవున్న అనంతత్వానికి అభిముఖు డైనప్పుడే నిజమైన విద్య ప్రారంభమవుతుంది. అప్పుడతడు ఆదిజ్ఞానముయొక్క నైజమూలము లేకో ప్రజ్వల నవ్యభావ స్రవంతి అవుతాడు. న్యూటను మొదలైన సత్యాన్వేషులు అనేక ఉపయోగకరమైన పరిశోధనలు బహిర్గతం చేశారు. వారడకు ఎవరు నేర్పారు? అంతకుముందు పరిశోధకులందరినీ త్రోసి వేయ గలిగిన ఆ విజ్ఞానమంతా వాండ్లు ఏగ్రంథాలనుండి నేర్చుకున్నారు? నిజంగా మానవ హితకారుల విద్యామహా

మకు కారణం, వాండ్లు తెలేకుండానే సత్యాత్మకు సన్ని
హితులు కావడమే. ఆ సత్యాత్మ సన్నిహితత్వంచేతనే విన
బడంది వినబడుతుంది. తెలియబడంది తెలుస్తుంది. భావింప
రానిది భావింపబడుతుంది. మనస్సు ధ్యాన మగ్నమైనప్పుడే,
(ఏకాగ్రమైనప్పుడే) ఒకనిలోనుండి తేజస్సు జ్వలిస్తుంది. అంటే
మానవుడు ఎప్పుడు అహంకారాన్ని పోగొట్టుకుంటాడో,
ఎప్పుడు తన శరీరమూ, మనస్సూ మొదలైనవి ఉన్నట్లే కన
పడవో, ప్రపంచమూ, సర్వమూ మహా దుర్జ్ఞేయమైన పర
బ్రహ్మలో లీనమైన ఒకస్థితి ఎప్పుడు కలుగుతుందో,
అప్పుడు మాత్రమే సత్యాలు వర్షిస్తాయి. పరిశోధనలు
ఫలిస్తాయి. విజ్ఞానవాహిని ప్రవహిస్తుంది. ప్రకృతి రహస్యాలు
విడివడుతాయి. కాబట్టి, సర్వసత్యాలు, పరిశోధనలు, కవితా
కల్పనలు, సిద్ధాంతాలు, ఇలాంటివన్నీ పైనచెప్పిన ఒక
విధమైన సర్వోత్కృష్ట 'యోగం' లేక 'మతం'లో నుంచి
బహిర్గతాలైనవే, ఒకసారి కవి అలాంటి అతీతస్థితిలో ఉండ
డంచేత, ఉన్నత భావాలు, దివ్యాశయాలు, అతనిలోనుంచి
తప్పక ప్రవహించి తీరాలె. గణిత శాస్త్రజ్ఞుడు లేక తత్త్వ
వేత్త తన అహంకృతిని విడిచిపెట్టిన మాత్రంచేత, అతి కష్టతర
మైన సమస్యలు అద్భుతంగా అతడు పరిష్కరించితీరాలె.
సమస్యా పరిష్కారానంతరం, లేక పరిశోధన అయిపోయిన
తర్వాత, 'అహం'కారం ఆ కీర్తి తనకు దక్కాలంటుంది.
అయితే, ఈ స్వార్థాహంకారం ఎంతకాలం వుంటుందో
అందాకా ఏ పరిశోధనా ఫలించదు. ఆ 'అహం'కారం పరిత్య

జింపబడి, పైన పేర్కొనబడిన మతభావన ఉదయించినపుడు విజయ విజ్ఞానాలు వెలువడ సాగుతవి.

2. యుద్ధరంగంలోని ఒకవీరుణ్ణి చూద్దాం. అతడు అపరిమిత మహాశక్తిచేత ఉన్మత్తుడైనాడు. వేలకొలది శత్రువులున్నా అతనికి కనబడ్డంలేదు. అతని స్వంతదేహమే అతనికి ఉన్నట్లు కనబడ్డంలేదు. ఇంక అతనికి శరీరమూకాదు. మనస్సూకాదు. ప్రపంచమనేది లేనేలేదు. శక్తులు విజృంభించినవి. అతని శరీరం మీద రోమరోమమూ, శరీర మనోసర్వప్రపంచాలకు వెనుకవున్న అతని మహాసర్వవ్యాపక బ్రహ్మైక్యతనుగర్జిస్తున్నది. చూచేవాండ్లకు ఆ అజేయధైర్యం, వీరావేశం - దృశ్యప్రపంచంలోనికి తళుక్కున మెరిసిన దుర్జ్ఞేయ బ్రహ్మతేజంగా కనబడుతుంది. అయితే అతని అజేయధైర్యం అవ్యక్తంగా మతమే. అంటే తెరలవెనుక ఉన్న మహాశక్తిలో మగ్నంగావడమే.

3. 'ప్రేమ' అన్న పదం ఎంతప్రియమయింది. ప్రతివ్యక్తీ ఒక ప్రేమికుణ్ణి ప్రేమించాలి అన్న ఒక సామెతఉంది. శుద్ధమైన హిందువుడికి అనేకవిషయాల్లో ప్రేమే (భక్తి) శరణ్యం. దివ్యప్రేమ (భక్తి)కోసం, సంతోషపూర్వకంగా సర్వస్వం పరిత్యాగంచేసే మహాత్ములు కొందరున్నారు. ఆ ప్రేమ స్రవంతి యొక్క మాతృకను తెలుసుకోడానికి ప్రయత్నిద్దాము.

చైతన్య మహాప్రభువు, బనియన్ (Bunyan)ల వంటి ఆదర్శ భక్తాగ్రేసరులు అసాధారణ పారవశ్యానికి లేక ధ్యానానంద తన్మయతలకు సుప్రసిద్ధివహించారు. మానావమానాలకు,

ప్రపంచానికి అతీతమై, అహంకార పంజరాన్ని విడిచి ఆదివ్య ప్రేమ మహాస్థితిని అధిగమించిందని చెప్పనక్కరలేదు. విషయవస్తువులమీద ప్రసరించిన ప్రేమానుభూతి పొందినవాండ్లు కూడామహోన్నత ప్రేమ, 'ప్రేమికుడు - ప్రేమింపబడేవస్తువు' అనేభావనకు అతీతమైవుంటుందని ఋజువు చేస్తారు. పైఅర్థానుసరణంగా, ప్రేమ— 'మతం' ఒకటి అనడం నిర్వివాదం.

4. పరవశత అన్న పదమే (ecstasy —e, out and sto, to stand) ఆనందము అది ఏ ఏ పరిస్థితుల్లో అనుభూతమైనా సరే శరీర మనో ప్రపంచాలకు అతీతంగా ఉంటుందని తెలుపుచున్నది. ఒకని స్వానుభావాన్ని బట్టిచూస్తే, ఎవరైనా స్వేచ్ఛానుసారం, క్షణికంగానైనా సర్వద్వైతభావాలనుండి ఆనందైక్యతను అనుభవించగలడు. కోరేవ్యక్తి, కోరబడేవస్తువు ఒకే శాశ్వతానందలో కలసిపోతున్నవి. ప్రత్యక్షమైన ఆ ఆనంద తత్త్వమే మతం.

ఎప్పుడైతే బుద్ధి, దానితోపాటు సర్వదృశ్యజగత్తూ, దుర్జ్ఞేయాతీత బ్రహ్మలో లీనమవుతుందో, అప్పుడే సర్వజీవిత సాఫల్యాలు శిద్ధిస్తవని, యీ పర్యవేక్షణాలు సుస్పష్టంగా ఋజువు చేస్తున్నవి,

అయితే ఇది, ఒకడు నిఘంటువును సంప్రతించినట్లు లేక ఈతగాడు సముద్రంలోమునిగి, కొంతసేపటికి రత్నాలతో బైటికి వచ్చినట్లు, విశ్వసారంలో ఒక మునక వేయడము.

విషయానందాల సారంకూడామతమే. కానీ వాటిలో ఉన్న 'మతాన్ని' తెలుసుకొనేవిధానం, మురికి తూముగుండా

రాజదర్బారును చూచినట్లుంటుంది. అవి తుళుక్కుమని మెరిసే మెఱుపుతీగలాంటివి. ఆ మెరుపుతీగెలు, విశాలసూర్య కాంతితో ప్రకృతిలో పోలికఉన్నా, మంచికంటే చెడేఎక్కువ చేస్తున్నవి. ఇంకా సరిగా చెప్పాలంటే - అది స్వర్గంనుంచి ప్రొమిథియస్ లాగా నిప్పు సంగ్రహించడం లాంటిది.

మహావైభవోపేతమైన దర్బారును, సరియైనసింహద్వారం గూడా పోవడానికి వీల్లేదా ? అర్థరాత్రి యందలి మెరుపును నిత్యమైన దినకాంతిగా చేసుకోగూడదా ? ఇలాంటి సహజ వాంఛలోనే మతావశ్యకత ఉన్నట్లు దానిసామాన్యార్థంలో తెలుస్తుంది. ఈఫలితానికి పూర్ణసాహస పూర్వకమైన సమరం ఉత్తమమైంది. మరి - మతావశ్యకతను తృణీకరించే వాండ్లు తమ్ముతామే నిర్లక్ష్యించి ఆత్మహత్యా దోషంచేస్తున్నారు.

సకల తత్వ విజ్ఞానశాస్త్రప్రయత్నాలు వాచామగోచరమైన పరబ్రహ్మ దెగ్గరకు పోలేక నిస్సహాయస్థితిలో అపజయం పొందాయి. కాలమూ, దేశమూ, కారణమూ బాహ్యదృష్టితో చూచినా, మానసికదృష్టితో చూచినా వాటి ప్రకృతిని పరిశోధించడానికి చేసే ప్రయత్నాలన్నిటినీ నిరోధిస్తవి. పదార్థము (Matter) యొక్క, చలనము (Motion) యొక్క, శక్తి (Energy) యొక్క ఫలితప్రకృతి (Ultimate nature) అన్వేషణాచిత్తానికి అసాధ్యమైన కష్టాలు కలిగిస్తుంది. పరమాణు సిద్ధాంతం (Atomic theory) అనేక అసంగతాలతో కూడి ఉన్నది. బొస్కొవిష్ సిద్ధాంతం (Boscovich's theory of centres of Force) చివరకు నిరుపయోగం. ప్రాపంచిక

మైన నిర్హేతుకసిద్ధాంతాలన్నీ కాస్తో కూస్తో, తమ ముఖాల మీద మూఢత్వపుముద్ర వేసుకొన్నవే. ఒక తత్త్వసిద్ధాంతం ఇంకొకదాన్ని ఖండిస్తుంది. ఇంక రెండోదో— కొంచెమైన మొదటిదాన్ని తనవంతు వచ్చినప్పుడు అభినుతించదు. దీన్నిబట్టి ప్రకృతి ఆంతర్యం మనస్సుకెప్పుడూ అగ్రాహ్యం, మానవుడి బుద్ధికి విశ్వపులోతులు తెలుసుకోవడం అసాధ్యమని కనబడు తున్నది.

అయితే, మనం అంతర్బ్రహ్మాన్వేషణంతా అందనిపండని మూసవలసిందేనా? మన శక్తిని లౌకికమైన రైళ్ళూ, టెలిగ్రాఫులూ, తుపాకిమందులూ మొదలైనవాటిని కనిపెట్టడానికి ఉపయోగిద్దామా? అలాంటి ఆటబొమ్మలుకూడా శాంతినివ్వలేవు. ప్రతి నూతన పరిశోధనాఫలితం వెంట పరుగెత్తుతున్న ఈ తృష్ణ ఐహిక వాంఛలలోని నిష్ప్రయోజనతను దృఢంగా ప్రకటిస్తున్నది.

ఈ ఆలోచనలు మనలను పూర్ణనిరాశారణ్యంలో వదలిపెడతవి. అయితే— 'నిరాశపడవాకు' అని ఉపనిషత్తులు నిర్వచిస్తున్నవి. మహాశాంత్యాశను చంపవద్దు. సత్యాన్ని మూర్ఖత్వంతో నీవెంతకంష్టమూసుకొని తిరస్కరించినా ఎప్పుడైనా, ఐకాంతికానంద సమయాల్లో "దృశ్యమానమైన ఈ ప్రపంచం ఎక్కడనుంచి వచ్చింది? నేను ఎందుకుపుట్టాను? ఈ భూమ్యాకాశాలూ వాటిఅర్థమేమిటి?" అనేప్రశ్నలు నీలో ఉద్గతమవుతాయి.

ఈ కఠినసమస్య, తత్త్వ( Philosophy )విజ్ఞానశాస్త్రాల (Science) ద్వారా, లేక రాగంవల్లా, పరిష్కృతం కాక పోయినా, అవస్యం సమాధానత పొందితీరాలె అని వేదం నిర్వచిస్తున్నది. ఈప్రశ్నే అనిర్వచనీయమాయా (Insoluble ridle) చ్ఛాదితమైయుండి, తాను పరిష్కరిద్దామనుకున్న వర్ణనాతీతమైన మాయలోనే ఒకభాగం అవుతున్నది.

గ్రద్ద తానుఎగిరేమేఱ దాటి పైకిపోలేనిమాదిరి ఆలోచనలు తమహద్దులుదాటిపోలేవు. ఎంతవరకైతేప్రశ్నించేవాడు. ప్రశ్నింపబడేవిషయాలు ఉంటాయో, అక్కడ మాయాకుడ్య బంధాలు ఉన్నవి. అప్పుడుదృశ్యాలకు అతీతంగాపోలేడు. విశిష్టమైన సంస్కృతిచేత (విద్య) గమ్యస్థానంచేరవచ్చు. గమ్యస్థానంచేరినతర్వాత ప్రశ్నోత్తరాలురెండూ అదృశ్యమైపోతవి. విషయసుఖాలు, మమత! రాగాదులతోకూడిన అస్వతంత్ర మార్గంనుండి వేదాన్తం స్వతంత్రంగా యీగమ్యస్థానానికి దారి తీస్తుంది. అలాంటి దర్శనమగ్నుడైనవాడు, మనోబుద్ధ్యతీతమైన పరబ్రహ్మమే అవుతున్నాడు. ఆ బ్రహ్మానుభూతియొక్క లేశాన్ని పొందిన మానవుడుకూడా, భయాందోళనలకు అతీతుడై నిలుస్తున్నాడు. ఈ జ్ఞానము, లేక 'మతము' యొక్క సద్యోఫలితం అచంచల ఆత్మబలం! ఇందుకే మతం వాంఛనీయం.

ఓం ! ఓం !! ఓం !!!



ఓం.

# విమర్శన — విశ్వప్రేమ

(భారత ప్రజానీకానికి - సర్వవిశ్వానికి ఒక సందేశం)

ఏదైనా విజయవంతమైన ఉద్యమం బయలుదేరినప్పుడల్లా, హిందూదేశంలో పాక్షికతత్వం చెలరేగి, నాయకుల యొక్క అంధకార ప్రవర్తనవైపు ప్రజాదృష్టిని త్రిప్పుతుంది. ఆవిధంగా పుట్టినమొగ్గ పురిటిలోనే మాడిపోతుంది. కానీ ఎవరిలో చెడ్డలేదు ? (వివేకానందస్వాములవారి బ్రహ్మాండమైన బోధలు, ఆయన కార్యవిధానాలు, ఆయనకున్న ఆహార పానీయాదులవల్ల తక్కువ చేయబడినవి. కాశీలోని కృష్ణానంద స్వామి, ఆయన బహిర్వర్తనవల్ల తక్కువ చేయబడ్డాడు. నిజానికి తద్బహిర్వర్తన ఆయనకేమీ అంటదు.)

సాధారణ ధర్మోద్యమము, ధర్మమహోత్సవ పరిషత్తులు, తదుద్యమనాయకుల వ్యక్తిగత ప్రవర్తనలను నెపంగా తీసుకొని కొందరు, వాటిని ఉపసంహరించాలని ప్రయత్నిస్తున్నారు.

ఒకరోజు రాముడు ఒకపాలమ్మే పిల్లవాడిని చూచాడు. అతడొకయింట్లోకి పాలసీసాలను తీసుకుపోతున్నాడు. జారి ఒకపాలసీసా క్రిందపడి పగిలింది. అతనికి కోపంవచ్చి మిగిలిన సీసాలనుకూడా బజారులోపారేశాడు.

ప్రజలు పరస్పరం యిట్లే ప్రవర్తిస్తున్నారు. మన స్నేహితుడిలో ఏవిషయంలో నైనా నలుసంతలోపం కనపడిందా, అతనిలో ఎన్నిసుగుణాలుంటేనేమి ? అవన్నీమనం తుడిచివేస్తాము.

'జలశాస్త్రం' (Hydrostatics) లో మొత్తపు ఒత్తిడి (total pressure) ఫలితపు వత్తిడి (Resultant pressure) ని గురించి మనం చదువుతాము. ఒక శరీరం మీద మొత్తపువత్తిడి అనంతంగా ఉండవచ్చు కానీ ఫలితపువత్తిడి శూన్యం. పరస్పర స్పర్థలచేత భారతదేశంలోని అసంఖ్యాక శక్తులు సమగ్రఫలితాన్ని పొందడంలేదు. ఇదివిచారకరంకాదా? కారణం ఏమిటి ? ఒకసంఘం ఇంకోసంఘపు లోపాలమీద దృష్టి ఉంచడమే. ఈ విధంగా ఐకమత్యం ఉండనేరదు. ఈ పరస్పరానుమానములమీద ఆధారపడడమే చివరకు దోషంలేనిచోట దోషాన్ని కల్పించడం అవుతున్నది. "ఒకడిని దొంగ అనిపిలువు. అతడు దొంగిలిస్తాడు." అనేవాక్యం నిర్వివాదమైన సత్యం.

సమానమైన ఏకత్వంలేదా ? మనతోటివాండ్లలో సద్గుణాలులేవా ? భారతదేశంలోని శాఖోపశాఖలకు ఐకమత్యబంధంలేదా ? పవిత్రతపేరటగానీ, అపవిత్రతపేరటగానీ, భగవంతుని గూఢచారుల మనుకొని దేశహితానికి తోడుపడే వ్యక్తి రహస్యజీవితాన్ని శంకించి శోధించడానికి, మనకు అధికారమేముంది ? అతని వ్యక్తిగతప్రవర్తన అతనికీ భగవంతునికి సంబంధించింది. మనకేమి సంబంధం? మనం ఇతరులను విమర్శం

చడంలో వ్యయంచేసే శక్తే, మన ఆదర్శాలకర్థంగా మనంజీవిం చడానికి ఎంతో ప్రయోజనకారి అవుతుంది. మనం బలవంతం చేత ఎవ్వడిలోనైనా రవ్వంతైనా నీతిని అభివృద్ధి పరచగలమా లేక ప్రపంచాన్ని సంతోషపెట్టడానికి బాహ్యామర్యాదలతో బాహ్యాచారవేషాలతో పొగడ్తల నాశించేప్రవర్తన పవిత్ర మైనదేనా ? అది పవిత్రమని భ్రమపడవాకు; అది బలహీనత. ముండ్లున్నవని గులాబీని వదలం. ఒక మిఠాయివర్తకుడు తౌడు దినిజీవిస్తుంటాడు. ఆనెపంమీద, అతడుచేసిన మిఠాయీలు తినడం మానము. ఒకడు తానుతినే పదార్థాన్నిబట్టి పవిత్రుడు కాడు. అతనిలోనుండి బైటికి వచ్చేదాన్నిబట్టే ఆవిషయంనిర్ణ యింపబడుతుంది. వివేకానంద స్వామి ఏమితింటేనేమి ? ఏమి త్రాగితేనేమి? ఆయనలోనుండి సద్బోధలు వస్తున్నంతకాలం,ఆయ నలోకి ఏమిపోతున్నా మనం చింతించ నవసరంలేదు. మన మొకరి ఆదేశాలను, ప్రబోధాలను, వాటి స్వాధిక్యతనుబట్టే స్వీకరించాలెగాని, బోధకుడి వ్యక్తిత్వ గౌరవాన్నిబట్టి స్వీకరిం చగూడదు. రేఖాగణిత శాస్త్రానికి, యూక్లిడ్ (Euclid) వ్యక్తిత్వానికి సంబంధం ఏముంది ? చిత్రకారుడు వికారంగా ఉన్నాడని, అతడు గీసిన సుందరమైన చిత్రాన్ని మనం తృణీక రిస్తామా ? సర్ ఫ్రాంసిస్ బేకన్ (Bacon) లంచాలు తీసుకు న్నాడని,ఆతని 'అనుసంగిక తర్కము'ను (Inductive Logic) నిరాకరిస్తామా ? ఇది ఇరవయ్యోశతాబ్దం; వివేకవంతులం గావడానికి తగినసమయం. వ్యక్తిత్వాలతో, ప్రబోధాలు

కలుపకుండా ఉంటామునుగాక ! మురికిగుంటలో పుట్టిందని మనం సుందరమైన పద్మాన్ని వదలు తామా ?

హిందూదేశ దారిద్ర్యానికి అతిముఖ్యకారణం ; కసవు పదార్థాన్ని పరిహరించడం. చచ్చిపోయిన జంతువుల ఎము కలు స్పృశించడానికి భయపడడం, చెత్తఅనీ కుళ్లుకంపని వాటిని తృణీకరించడం. ఈ నీచవస్తువులను సద్వినియోగం చెయ్యడంచేతనే పాశ్చాత్యఖండాలు ఐశ్వర్యవంతాలైనవి. మురికి ఎరువులోనుంచికాదా సుందరపుష్పవనాలు అభివృద్ధి కావడం ? నల్లటిపొగ, అంతకంటే నల్లటి రాక్షసిబొగ్గు కలసే కదా, అమెరికా యూరపుదేశాలలోని వివిధ పరిశ్రమల కాధారమైన యంత్రశక్తిగా మారుతున్నది.

నీచమైన కోతులను అద్భుతమైన సేనగా చెయ్యడం లోనే శ్రీరాముని గొప్పదనం వున్నది. పవిత్రులతో, పుణ్య వంతులతో శాంతంగా ఎవరు జీవించలేరు ? అయితే, ఎవని విశాల దయామాతృహృదయం, పాపులనూ, నీచులనుకూడా కౌగలించుకుంటుందో ఆతడే మహాత్ముడు.

ఆత్మ మార్తాండుని, వంటయింటి మూఢాచారాలనే ధూళిధూసర మేఘాలచేత కప్పిపుచ్చి, దానివల్ల ఆధ్యాత్మిక మైన, శారీరకమైన పతనం తెచ్చుకోవద్దు. అనంతమైన అమర మైన ఆత్మను విదేశీయుల చారు మొదలైనవి మైలపరుస్తవని చెప్పే వంటయింటి మతం నిజంగా విచారకరం. పీలికలైన చినిగిపోయిన కులమనే వస్త్రాలనుతీసి పారెయ్యి. ఒక్కసారి అంతర్ముఖుడవుగా ! ఎవరు నీవు ? అనంతం ! అమృతం !

అమరమైన విశ్వాత్మే నీయాత్మ! ఈ ప్రపంచసంకులానికి కారణం, నిజంగా ఆత్మ సమత్వాన్ని మరిచిపోవడమే.

తెలివితక్కువ దురాగ్రహ నీతివిశారదులు, తమ యిరుగు పొరుగువారి వ్యక్తిగత శీలాన్ని విమర్శించడంలో, ఖండించడంలో ప్రవాహాపరిభాగంలో ఉన్న నురుగును తీసివేయడానికే ప్రయత్నిస్తారుగాని, దాని కంతటికీ మూల కారణమైన, అడుగునఉన్న అసమానత్వాన్ని నిర్మూలించ డానికి ప్రయత్నించరు. పతితులను సముద్ధరించడానికి నీవెవరు? నిన్ను నీవు సంరక్షించుకున్నావా ?

స్వజీవిత రక్షణ చేసుకోదలచినవాడు, స్వజీవిత పరి త్యాగం చెయ్యాలె తెలుసా ? అయితే నీవు పరిత్యాగివేనా ? జీవిత పరిత్యాగివేనా ? లే ! రక్షకుడవుగా !

బుద్ధుడు ఒక వేశ్యాగృహంలో తరుచుగా అతిథి. క్రీస్తు 'అగౌరవనీయురాలైన' మేరీ మాగ్డలిను (Mary Magdalene) స్నేహం చేయుడానికి సిగ్గుపడలేదు. ఓ గౌరవానర్హమైన గౌరవమా ! మనం ఒకరితప్పులు ఒకరం ఎంచుకున్నంత వరకూ, దేశంలో ఐకమత్యం, ప్రేమ వుండదు. విజయంకర మైన జీవనకళారహస్యం, మాతృహృదయాన్ని వికసింప జేయడమే. ఆ పవిత్ర మాతృహృదయం అందరినీ సమంగా ప్రేమిస్తుంది. నిజమైన విద్యకు అర్థం, భగవన్నేత్రాలతో సర్వ విశ్వాన్ని దర్శించ గల్గడమే.

ప్రతివాడూ, సర్వావస్థలను దాటక తప్పదు. స్థూల శరీరవిషయంలో ఏవిధంగా శైశవ, బాల్య, యౌవన, కౌమార

వృద్ధాప్యాది అవస్థలు కలుగుతున్నవో, అదేమాదిరి నైతిక, ఆధ్యాత్మిక విషయాల్లోకూడా, ఈ అవస్థలన్నీ అత్యవసరంగా దాటవలసిందే. పాపులని పిలువబడే వారందరూ నా శిశువులు! నైతిక శిశువులు! కానీ, ప్రతి శిశువులో ఒక సహజ సౌందర్యం ఉట్టిపడడం లేదా? పతితులని నీవు భ్రమించి పిలిచే వాండ్లు యింకా 'నిద్ర లేవలేదు'. వాండ్లు కళాశాలలో చేరిన కొత్త విద్యార్థులు. నీవుకూడా ఒకప్పుడు ఆదశలో ఉన్నావు కదా!

కొంతమంది 'విశ్వప్రేమ'ను గురించి వాగ్వర్షాలు కురిపిస్తారు. కానీ, ఎదుటివాండ్లలో తప్పులు ఎన్నడమే వారిపని. "మనం పాపాన్ని నిరసించవచ్చు. కానీ పాపిని ప్రేమించాలి' అనే సిద్ధాంతంతో తమ ప్రవర్తన సమర్థిస్తారు.

ఓ ప్రియజనులారా; మీరు ఒక వస్తువులో చెడు చూచినంతకాలం మీరు దాన్ని ఎన్నడూ ప్రేమించలేరు. ప్రేమ అంటే సౌందర్యదర్శనం.

చీకటితో పోట్లాడడంవల్ల చీకటిపోదు. చీకటి గదిలోకి రాళ్ళు విసరి, తలుపులు బల్లలు, కుర్చీలు, విరగగొట్టి, సిరాబుడ్లు చెంబులు కూలద్రోసి, ఎంతసేపు యుద్ధంచేసినా, ఆచీకటి పోతుందా? దీపం తీసుకరాండి; చీకటి ఉండదు. అందుచేత వ్యతిరేక విమర్శనవల్ల, నిరుత్సాహ పరచడంవల్ల, విషయాలు చక్కబడవు. అనుకూలత, ఉత్సాహము, ఆశ, ప్రేమ యివే కార్యసాధనాలు. మురుగుకుండ్లలోని బురదంతా తీసి వీధుల్లో చల్లితే, లాభమేమిటి? ఏమీ లాభంలేదు. అదేవిధంగా

యితర్ల తప్పులు విమర్శించడంవల్ల మంచి జరుగదు. ఆ మురికి మీద, ప్రశాంత పవిత్ర శుభ్రజలాలు ప్రవహింప జెయ్యండి. మురికంతా కొట్టుకపోతుంది. అక్బరు ఒక గీతగీసి, దాన్ని ఎటూ తాకకుండా, చెరపకుండా చిన్నది చేయుమని మేధావి అయిన 'బీర్బల్'ను అడిగాడు. 'బీర్బల్' అగ్బరు గీతకు క్రింద సమానాంతరంగా అంతకంటే పొడుగ్గా ఒక గీటుగీసి, దాన్ని చిన్నది చేశాడు. జ్ఞానమంటే యిది. అంతకంటే పొడుగుగీత గీయడమే జ్ఞానం. 'బీర్బల్' ఏవిధంగా అగ్బరును అతని గీత చిన్నదయిందని ఒప్పించాడో, అదేవిధంగా నీవు హృదయ పూర్వకంగా ఏమి తెలియజేయదలచావో, దాన్ని ప్రజలు హృద్గతంగా అనుభవింప చెయ్యడమే ఉత్తమ విమర్శన. "ఇదేమిటి, కమలం సింధూర వృక్షం ఎందుకుగాదు ?" అనే మాదిరి ఉంది మానవుల విమర్శనాసంరంభం. మనం ఎందులో ఉన్న సౌందర్యాన్ని అందులో చూస్తాముగాక. "చెడునుగురించి అరవ్వాకు; మంచియొక్క సౌందర్యాలను గానంచెయ్యి." నేను సకల జీవితానుభూతులనే ద్రాక్షపండ్లనుంచి, మధువును పిండుతాను.

ప్రియమైన విమర్శకుడా ! నిన్ను నేను ప్రేమిస్తాను. నీవు విమర్శించేవాణ్ణిగూడా నిన్ను ప్రేమించినంత ప్రేమిస్తాను.

పోరాటం,—జీవితసమరంలో గెల్చేది ఏమిటి ? ప్రేమ.

ఏజాతులు హృదయాలను సమ్మిళితం చేస్తాయో, మేధస్సులను ఏకంచేస్తాయో, చేతులుకలిపి కర్మరంగంలో పని చేస్తాయో, అవి సంఖ్యకు కొద్దెయినా లక్షోప లక్షలుగా

వున్న, భిన్నభిన్న ప్రతికూలశక్తులను విచ్ఛేదించి విజయం పొందుతాయి.

పోరాటం మూడు విధాలు:— 1. విజాతితో, 2. స్వజాతితో, 3. ప్రకృతితో.

ఈర్ష్య,పరస్పరవిరోధమూ,పాక్షికతత్వమూ మొదలైన వాటిచే, స్వజాతి (స్వకీయుల) తో పోరాడుతూ మనశక్తిని దుర్వ్యయము చేయడానికి బదులు, స్వీయులతో ఐకమత్యము చేకూర్చుకుంటే, పరుల(విజాతి)తో చేసే పోరాటంలో విజయం కలుగుతుంది.

"నిరంకుశత్వం యొక్క సర్వ స్వరూపాలకు ప్రారంభం కరుణ" అనే వచనం సత్యం.

విజాతి (విరోధుల) పట్ల గూడా మనం ప్రేమ చూప గలిగితే, ప్రకృతియుద్ధంలో మనకు విజయం తప్పదు. పంచ భూతాలను జయించడం సులభమవుతుంది. ప్రకృతిని జయించడమంటే, 'అఖిల విశ్వాన్ని పరిపాలించే శక్తిని నేను' అనే సత్యాన్ని గ్రహించడమే!

విమర్శనాభావం ప్రపంచంలో ఎందుచేత ఎక్కువగా ఉన్నది?

విమర్శన ప్రతికూలమైనదిగా కనబడుతుంది. కానీ, విమర్శన ఆత్మరక్షణార్థమైందే. ఒక అభ్యాసం లేక అలవాటు పోవాలంటే, మొదట దాని అనర్థాన్ని వెల్లడించే సునిశిత విమర్శన జరగాలె. ఇతర్లలో ఆ దురభ్యాసం ఉన్నప్పుడు, అది మనకుగూడా సంక్రమిస్తుందనే భయంతో మనం వారి సంప

ర్యాన్ని వదలగోరుతాము. ఒక నూతనాభ్యాససృష్టి, నూతన నాభిప్రాయ నిర్మాణము, పూర్వపద్ధతిని విభేదిస్తూ బయలు దేరుతుంది. ప్రపంచంలో అభివృద్ధికి తావున్నంతవరకూ, విమర్శన తారతమ్యత ఉంటుంది. విమర్శనా తారతమ్యతకాదు ఉండకూడదంది. వానిని మూలనాశనం చెయ్యడానికి సాధ్యం కాదు. ఆ ఆ సంబంధసంఘజనంలో వ్యక్తిద్వేషాన్ని పురికొల్పే విమర్శనలోని విషాన్ని మనం తీసివెయ్యాలె. మనలో, ఇతర్లలో పాపాన్ని సృష్టిస్తున్న ఆ ఖండనార్హమైన 'అహం'కృతినే మనం పారగొట్టాలె. అప్పుడు సర్వబాధానివృత్తి కలిగి శాంతి లభిస్తుంది. రసాయనశాస్త్రజ్ఞుడు శాంతంగా, నిష్పాక్షికంగా వివిధ పదార్థపరీక్ష చేసినట్లు; వృక్షశాస్త్రవేత్త వివిధతరగతుల వృక్షాలను పరిశోధించిన మాదిరి, మనం మన చుట్టూ ఉన్న ప్రజల కర్మలను, వారి భావాలను ప్రశాంతదృష్టితో చూడగల్గుతాము. సూర్యుడు సాక్షీభూతంగా, గులాబీలను, మొక్కలను, తోటలనూ, స్త్రీ పురుష మృగసమూహాలనూ, చీమలనూ, మేఘాలనూ, సమస్తాన్ని ఏ విధంగా చూస్తూ, సహాయం చేస్తూ ఉన్నాడో, అలా మనం ఉండగలుతాము.

ప్లేగునుండి మనం తప్పించుకోవాలంటే, ఆరోగ్యవిధులను సక్రమంగా అనుసరించడం తప్ప వేరే మార్గం లేదు. విదేశ రాజకీయాలనుండి రక్షింపబడడానికి ఏకైకమార్గం— ఆధ్యాత్మికధర్మాన్ని, పరస్పర ప్రేమధర్మాన్ని ఆచరించడమే.

యదార్థత్యాగంవల్ల మనం నిర్భాగ్యులం గావడం ఎంత సులభమో, ఐశ్వర్యవంతులం గావడం అంత సులభమే. 'యజ్ఞం

పాపాన్ని పరిహరిస్తుంది' అనే ఆ శుభవంతమైన పూర్వకాలపు వాక్యం యిప్పటికీ నిజమే. యజ్ఞమంటే నోరు లేని జీవజంతువులను బలిదీయడం కాదు. కక్షలు, కులవైషమ్యాలు, అసూయ, ప్రేమబలిపీఠంమీద బలిచేయడమే. దానివల్ల స్వర్గం ప్రపంచంలోకి దిగివస్తుంది.

## విమర్శింపబడిన మానవుడికి.

విమర్శ నీకు ఒక త్రాసువంటిది. కత్తిరించడంవల్ల పూల కంచెలు మరింత శోభాయమానం అయినట్లు, విమర్శవల్ల మనం ప్రకాశిస్తాం. విమర్శ అనే కత్తెర నీమీద ప్రయోగింపబడినప్పుడు నీలో కలిగే భావాలను ఒక్కసారి పరీక్షించుకో: అప్పుడు నీలో అల్పభావాలకు ఆస్పదం కలుగవచ్చు; అయితే నీవక్కడే జాగ్రత్త తీసుకోవాలె. పర్వతపంక్తులమధ్య వంకరటింకరగా ప్రవహిస్తూ, అజ్ఞాతసాగరంలోకి పోతున్న ప్రవాహమధ్యంలో పోయేపడవను నడిపేనావికుడికి, మెళుకువ ఎక్కువ ఉండడం సహజం కదా! నావ ఒక్కొక రాతికి తగిలినప్పుడల్లా నావికుడికి చురుకుదనం కావాలె. ఆ దెబ్బ ఉపయోగకరం కాకపోతే, వాడు దాన్ని కాపాడలేడు. మనం బాధ అనుకొనేది మనకు అత్యవసరమైన ఉపద్రవచిహ్నము (Danger Signal) అని గుర్తించాలె. మానవుల కలాంటివి జీవితయాత్రలో అత్యవసరమైనవి.

మిత్రుల దగ్గరనుంచీ, శత్రుల దగ్గరనుంచీ వచ్చేటటువంటి బాధాకరమైన విమర్శ— నిన్ను బ్రహ్మజ్ఞానంలోకి మేలుకొల్పే ఒక గొంతుమీదకూర్చున్న దెయ్యం. నీవు మేలొన్న

తర్వాత ఎక్కడఉందా స్వప్నభూతం? అది యింకలేదు. ప్రేమ ధర్మానువర్తులమైన నిమిషంలోనే అన్ని నష్టాలు, అన్నికష్టాలు మనకు అనుకూల లాభప్రదాలవుతవి. పాపము 'సింద్రిల్లా' (Cindrella) కాలిజోడు పోగొట్టుకొంది. ఆమె అమాయకత తిరిగి పాదరక్షను తెచ్చింది. దానితోపాటు ఆ జోడుకు జీవితాంతం వరకు, రాజు అనుచరుడయ్యాడు.

మనం విశ్వైక్యత పొందినప్పుడు, ఏ మోసాలు మనలను సమీపించలేవు. దీపం లేనప్పుడే దొంగలు యింట్లో జొరబడతారు. ప్రజానాయకత్వం వహించడానికి సమర్థుడైన ధీశాలి తన సహాయకుల బుద్ధిహీనతను, అనుచరుల అవిశ్వాసాన్ని, మానవుల కృతఘ్నతను ప్రజలు అభినందించక పోవడాన్ని పరిగణించడు. ఇలాంటి విషయాలు జీవితమహాక్రీడలో ఎప్పుడూ ఉండితీరుతవి. వాటిని ఎదుర్కొని, భయపడకుండా, వాటిని నిర్జించడమే మన శక్తికి ప్రబల తార్కాణం. అనవసర సంఘర్షణ, వృథా మనఃక్లేశం తొలిగిపోతే జగత్తులో మనం సాధించలేంది ఏముంటుంది?

ఓ ప్రేమ ! నా ప్రేమ ! మధురస్వరూప !
ఎన్నియో యుగములకీనాడునీవు
నాకయిద్వారంబు తెఱచినావహహా !
శత్రుమిత్రులవెనుకాల డాగుచును,
నిందాస్తుతుల కానరాకుండనిలచి
భోగగర్వములందు మటుమాయమౌచు,

కష్టాలకడగండ్లలో మూాయబడుచు
ఒకసారిజీవిత క్లిష్టశోధనల
చూపులకందరా కుండపోవుచును,
లాభనష్టములలో ! మరువగాబడుచు
ఓప్రేమ ! నాప్రేమ ! మధురస్వరూప !
ఎన్నియో యుగములకీనాడునీవు
నాకయిద్వారంబు తెఱచినావహహా !

*　　*　　*

ఘనసమాఘాతముల్, కలతలు వెతలు
సుఖదుఃఖములు, నవ్వులేడ్పుల నేటి
అద్భుతంబగు రసాయనికసంయోగ
మున,నూత్న విద్యుత్సాహాయంబు చేత,
ఒకశుద్ధమొనరించు క్రియచేత నొక్క
ఘనపృథఃకరణంబు వల్లనీనాడు,
రాగ వైషమ్యముల్ సంబంధగణము
మోహవిభ్రాంతుల నష్టివిదల్చి
నాయెదనుండియు తీయగాబడియె
నొకమహాప్రతిభా ప్రపూర్ణవజ్రంబు
అహాహా ! అద్భుతమైన చారిత్రమిద్ది !
ఓప్రేమ ! నాప్రేమ ! మధురస్వరూప !
ఎన్నియో యుగములకీనాడు నీవు
నాకయిద్వారంబు తెరచినావహహా !

*　　*　　*

నాహృదయంబను వజ్రంబునుండి
కాంతులుప్రసరించు సకలవస్తువుల,
ఆదివ్యకాంతులు అఖిలదిక్కులకు
నలుమూలలకుప్రాకు సుస్వేచ్ఛగాను.
ఎంత అద్భుతమైన కలఇద్దిచూడ !
ఓప్రేమ ! నాప్రేమ ! మధురస్వరూప !
ఎన్నియో యుగములకీనాడునీవు
నాకయిద్వారంబు తెరచినావహహా !

* * *

చురుకైన నిందాపహాస్య సంతతులు,
ఆధారములు, నిరాధారంబులెల్ల
శత్రుమిత్రులును, దుఃకాణగృహాలు,
నీవుదాగెడికుడ్యములు—ఇంకమీద
నీకాంతిప్రసరింప నవరోధపడవు
అన్నియు నిస్సహిరంగముసేయు.
ఓవజ్రరాజమా ! నా ఆత్మ !నీవు
దావాగ్ని వనచయంబుల గాల్చురీతి
సొమ్ములభరిణల, డబ్బుసంచులను,
ఇనుపపెట్టెలను కష్టప్రసంతతిని,
తలుపుల, తాళాల, మందసంబులను,
బహుగర్హితములగు సర్వాస్తిపాస్థు
లొక్కసారిగనీవు బూదిసేసెదవు
ఓసత్యమా ! పరిశుద్ధదివ్యాగ్ని !

ఓ ఆత్మ ! సర్వభక్షక ! నిజంబుగను.
ఓ ప్రేమ ! ఓ ప్రేమ ! మధురస్వరూప !
ఎన్ని యో యుగములకీనాడు నీవు
నాకయిద్వారంబు తెరచినావహహా !

## – నిర్మల దృష్టి –

పశిపిల్లలు ప్రతిదాన్ని స్థూలరూపంతో చూస్తారు. మబ్బు ఉరిమితే, ఆకాశంలో ఎవరో మనిషి అరిచాడని చెప్పు కుంటారు. అదేతీరున, ఈగడ్డాలు మీసాలువచ్చిన పిల్లలు కూడా ప్రతివిషయాన్ని స్థూలరూపంతో చూస్తారు. ఎక్కడైనా తప్పు జరుగుతుంటే, ప్రేమధర్మంతో దాన్ని సరిజేయకుండా, వ్యక్తులతో అనవసర వివాదాలకు దిగడం, చెడ్డవార్త వచ్చిందని తంతితీగను తెగగొట్టినట్లుంటుంది.

ఆస్ట్రేలియాలో ఉన్న నీగ్రోలు, తమ మంత్రాలవల్లనే వానలు కురుస్తవని నమ్ముతారు. ఒక ప్రఖ్యాతవ్యక్తి యిలా వ్రాశాడు. "మేము ప్రయాణం చేస్తున్నప్పుడు పెద్దపెద్ద తుఫానులు వచ్చాయి. వాటినిచూచి, మాతో ఉన్న నీగ్రోలు (వర్షానికి కారకులైన కొత్త నీగ్రోలు ఎవరో వచ్చారని) కోపావేశితులయ్యేవాళ్లు" తను యిరుగుపొరుగు వాండ్లలోని దోషాలుచూచి ఆగ్రహపడి గంతులువేసే వాండ్లనుకూడా, యీ అజ్ఞానాంధకారమే బాధిస్తున్నది. వర్షంకురుస్తుంది ; దాని వెనుకవుంది అవ్యక్త ప్రకృతిధర్మం తప్ప ఇంకేముంది. పుష్పం వికసిస్తుంది ఇక్కడకూడా ఆ అవ్యక్త ప్రకృతి ధర్మప్రకటన తప్ప ఏమీ లేదు. అదేవిధంగా 'జూడస్'కు తెలేక పోవచ్చు;

కానీ అతని కపట చుంబనంలో ప్రేమధర్మమే సమగ్రశక్తితో పనిచేస్తున్నది. ఆకపటపుముద్దు తర్వాత వెంటనే జరిగిన సంఘటనే లేకపోతే, క్రీస్తును ఇంతవరకూ ఎవరు గుర్తించు కుంటారు ?

తన్ను భావిలో నెట్టి క్షమాపణ కోరుతున్న సోదరులతో దివ్యుడైన జోసెఫ్ (Joseph) అంటాడు : " మీరుకాదు నన్ను నూయిలో నెట్టింది. ఆ ప్రేమ స్వరూపుడైన భగవంతుడే ! నన్ను యీజిప్టులో గొప్పచేయడానికి నాస్వంత సోదరులకంటే ఎక్కువ ప్రేమికులు లేరుకాబట్టి, యీ పనికి మిమ్మల్నే నియోగించాడు. "

సర్వజగత్తు క్షణికంగా, చంచలంగా, భంగురంగా కనబడుతున్నది. కనుక నేను నిత్యమనీ, యిదమిద్ధమనీ ఏవస్తువును గురించి నిరూపించలేనప్పుడు, నేనేమని విమర్శిస్తాను ? మన మొక మెరుపుతీగ వెలుతురులో, వేగంగా పరుగెత్తే రైలు బండినిగానీ, మేఘాన్నిగానీ చూస్తాము. కానీ, అదిమనకు కదలనట్లే కనిపిస్తుంది. అది నడవడంలేదని మనం అనుకుంటాము. కానీ దాన్ని గురించి యింకకొంచెం తెలుసుకుంటే నిజంతెలుతుంది. అదేమాదిరి, మానవులు మాయాచంచల తేజంలో వస్తువులు చూస్తారు. దానివల్ల ఇది నిత్యమని, ఇది వ్యక్తమని నిరూపిస్తున్నారు. దీన్నే ప్రపంచజ్ఞానమంటారు. పరమసత్యమనే అనంతాంతరాత్మ అనే మధ్యందిన మార్తాండ తేజంలో వస్తువులనుచూడు ; అప్పుడు అనంతశాంతివి నీవే !

మానవుల వాదాలు, తర్కాలు ఎప్పుడూ నిష్ఫలాలే. వాదాలతో భేదాలు పోగొట్ట ప్రయత్నించడంవల్ల అసంతృప్తి, విరోధం పెరగడం దేనికి? కట్టడం ప్రారంభించడానికి ముందు పునాది సరిగాలేదు. మొదట హృదయాన్ని జయించు. తరువాత హేతువుతో ఒప్పించు. వాదం నిరాశ చేసుకొన్నచోట ప్రేమ విజయంపొందవచ్చు. కథలో ప్రయాణికుడి కోటును, గాలి తీసివేయలేక పోయింది, వేడి తీసివేసింది:

ప్రజలు, తమ సిద్ధాంతం మతం ఒప్పించాలని ఆతురత చూపుతున్నారు. ఆత్మైక్యతకు వాంఛ్ల వేచిఉండరు. వివేకమంటే సర్వదృశ్యస్వరూపాలకు, దృశ్యవైఖరులకు అతీతంగా ఉండడమే. ఇది ప్రేమవల్లే కలుగుతుంది. నీవు సర్వైక్యానుభూతి పొందంరి, నీకు సర్వజ్ఞత్వం కలగను. మననంకంటే, లీనంగావడమే ప్రాముఖ్యం. ప్రేమ ధర్మాన్ని భేదిస్తే - అదే ధర్మపరిపూర్ణత అవుతున్నది. ప్రేమతప్ప ఇంకొకటి ధర్మభంగం చేస్తే, అది దుర్మతావేశమూ, విప్లవం అవుతున్నది. ప్రేమ ఒక్కటే దైవ ధర్మం. ఇతరధర్మాలు సుశిక్షిత చోరత్వమే. ధర్మశృంఖలాలను త్రెంచివేసేహక్కు ప్రేమకు మాత్రమే ఉంది. ప్రేమవల్ల అధికారం పొందడం దైవత్వం. ధర్మంద్వారా అధికారం పొందడం అక్రమం.

భారత రాజకీయవేత్తలారా! మీరెంతప్పటికి, విమర్శలతో, ద్వేషాన్ని రేపే అభియోగాలతో, కాలం గడుపుతున్నారు. కాని పరిస్థితులు రోజుకు రోజుకు విషమిస్తున్నవి. ఇప్పటికైనా మనం ధర్మపథాన్ని అనుసరిస్తాముగాక! పరపక్షం

వాండ్లు తప్పుచేశారని, తిరిగి ప్రత్యామ్నాయంగా చెడు చేయడంవల్ల ఒకతప్పుకు రెండు తప్పులౌతున్నవి. కాని విషయం స్పష్టతపడదు. ఒక పిల్లవాడు తన్ను గౌరవించాడని, ఒక పెద్ద మనిషి గద్దిస్తూ, " 'బుద్ధిహీనుడా' ! ఎందుకలా చెడుగా ప్రవర్తించావు ? " అన్నాడు. అప్పుడు పిల్లవాడన్నాడు. " అయ్యా ; మీరన్నట్లు నేను 'మూర్ఖుడను' కనుక, పెంకెతనం చూపించాను. మీరు బుద్ధివంతులుగదా, మీ బుద్ధికి తగినట్లు ప్రవర్తించండి. "

విద్యుచ్ఛక్తిగల ఒక వస్తువును మరొక వస్తువు దెగ్గరకు తెస్తే, యీ రెండవ వస్తువుకూడా విద్యుచ్ఛక్తి పొందుతుంది. కానీ, యీ రెండవ దానిలో ఉన్న విద్యుచ్ఛక్తి మొదటిదానిలో ఉన్న విద్యుచ్ఛక్తికి కేవలం వ్యతిరేకమయిందిగా ఉంటుంది. (అవే ధనఋణ విద్యుత్తులు) కానీ, యీ రెండు వస్తువులు పరస్పరం తాకినపుడు ఒకే రకమైన విద్యుచ్ఛక్తి రెండవ దాంట్లో ప్రవేశిస్తుంది. అదేమాదిరి కులాభిమానం, జాత్యభిమానం అనే తెరలు హృదయాలను కలవనియ్యనప్పుడు, నీవు కారణంవల్ల తర్కంవల్ల విషయాలను స్థిరపరచ దలచినప్పుడు, నీవు అపాయానికి గురిఅవుతావు, ఫలితం నీవు అనుకున్నదానికి కేవలం వ్యతిరేకంగా ఉంటుంది. నీవొక మానవుణ్ణి తెలుసుకోవాలంటే, ముందర నీవతన్ని ప్రేమించాలి. 'కారణం' నిరాశ పొందినచోట ప్రేమవిజయం పొందవచ్చు.

ఈ మతాలూ, మతవిధానాలు, అన్నిటినీ ప్రజలు రక్షరేకుల్లాగా మెళ్ళో కట్టుకున్నారు. సర్వైశ్వర్యాలు వాటి

వల్లే కలుగుతవని ఆశిస్తుంటారు. ఇంతకు మనం పొందే అల్ప శిద్ధికి యీ రక్తరేకులకు సంబంధం ఏమీలేదు. మనం మన మానవత్వ విమోచనం చేసి, యీ ప్రియమైన వూర్ఖ్యసాంప్రదాయాలకు అతీతులమవుదాంగాక! ఈ నామరూపాలనే ఆట వస్తువులు పట్టుకొని ఎన్నాళ్ళు మనం ప్రేలాడడం?

నీవు ప్రియంగా పెంచుకొన్న అసూయా క్రోధాలను, ఆస్తిపాస్తులను, సర్వసంగాలను క్రమంగా వదలి పెట్టాలి. నీదనుకొనే వస్తుజాలమంతా నిన్నే వశం చేసుకొంటున్నది. నీవు ఇతర్లను బాధింపకుండా ఉన్నప్పుడే, ఇతర్లు నిన్ను బాధించలేరు. నిన్ను నీవు మొదట బంధించుకోకుండా, ఇతర వాణ్ణి నీవు బంధించలేవు. ఆనందవిజయనిధి ఈ బాధాకరమైన చోరత్వంలో దాచిపెట్టబడింది, రాముడికి ప్రియమైన భగవన్నామం 'హరి' అనేది. దానిఅర్థం దొంగ. హేమనోహరహరీ! "ఓహో! నేను శత్రువునే ప్రేమిస్తే, అతడు నన్ను మింగేస్తాడు" అని కొందరు అనవచ్చు. "మీరు భ్రమిస్తున్నారు. నిజంగా ఎప్పుడైనా మీరు దీన్ని అనుభవంలో పెట్టి చూచారా?" అంటాడు రాముడు.

అన్ని జీవిత కవాటాలమీద "లాగండి" అని వ్రాసి ఉంటే, మీరు తప్పుచదివి 'త్రోయ'టానికి ప్రారంభిస్తారు. అలాంటప్పుడు తలుపెట్లా తెరుచుకుంటుంది? 'త్రోయడ'మంటే వాదించడం; 'లాగడం' అంటే ప్రేమవల్ల నీఆత్మలోకి తీసుకోవడం. హృదయం దైవోద్రేక మహాసభామంటపంలోకి పోయే ద్వారం, మనస్సు దిడ్డిదారి. ప్రేమ ఉద్రేక పరుస్తుంది,

మనస్సు వికసింపచేస్తుంది. మొదట శరీరం, తర్వాత వస్త్రాల విధంగా మొదట భావాలు, తదనుసరణంగా ధ్యానం ఉంటుంది. ఒక వ్యక్తిలో భావాలు మార్పు - అతని సర్వ చింతనాపద్ధతి తలక్రిందులవుతుంది.

జీవితమంటే ఏమిటి? అది ఒక విఘ్న పరంపర— అంటారు. జీవితో పరిభాగంలో వసించే మానవులకు అది అలాగేవుంటుంది. ప్రేమజీవనుల కది ఆలాంటిదికాదు. వాచాలురు, బాహ్యావేషధారులు, శిగ్గులేని హాస్యాస్పద గౌరవ పిశాచ బానిసలు మొదలైనవాండ్ల సాంగత్యంకంటే మించిన విషంలేద నేమాట నిజమే. కానీ, ప్రేమ స్వరూపుడైన భగవంతుడు వసించినచోట ఎలాంటి దుర్మార్గులు చేరలేరు. వాండ్ల సాంగత్యానికి మనం భయపడనవసరంలేదు. అపుడు ప్రకృతి, న్యాయచట్టాలు నిన్నేమీ చెయ్యలేవు. అవినీకు సేవకులు.

పంజాబుదేశపు 'ఘానిమత్' (ghanimat) అనే అతని తన "గ్రంథంలో (Ngirangi Ishq) యిలా చెప్తాడు. అజీజ్ అనే అతని ఒక బీదఉపాధ్యాయుడు! తన శిష్యుల్లో 'షాహద్' అనే అతన్ని గాఢంగా ప్రేమించాడు. ప్రేమోన్మత్తుడైనాడు. ఆ 'అజీజ్' పిల్లల కాపీ పుస్తకాలు దిద్దేటప్పుడు ప్రేమోన్మత్తుడై, అక్షరాల తరగతి షాహద్ కాపీ పుస్తకంలో అతని వంకర టింకర వ్రాతనే, అనుసరించాడట. ఆ శిష్యుడి వంకర అక్షరాల్లో, అతనికి వంకర కనబడలేదు. ఆహా! ఎలాంటిసత్యం! ప్రేమరహితమైన నేత్రాలకే దోషాలన్నీ కనబడతాయి. ప్రేమ స్వరూపుడైన భగవంతుడు మన

హృదయాల్లో ప్రవేశించినప్పుడు, కాలం యుగమొక క్షణంగా దొర్లిపోతుంది.

## సత్యశీలము.

పవిత్రతపేరట, ప్రేమ స్వరూపియైన భగవంతునిమీద కత్తి ఎత్తేవాండ్లు కొందరున్నారు. ప్రేమలేకుండా పవిత్రత ఎలాఉంటుంది! కొందరు ప్రేమచే చచ్చిపోతారు. కొందరు ఈర్ష్యచే మరణిస్తారు. ఈ ప్రపంచంలో అపవిత్రతకు బానిసలైన వారు కావలసినంతమంది ఉన్నారు. కానీ, తమ దౌర్బల్యంపైన నీతి అనే కవచం కప్పుకొని పవిత్రతకు బానిసలైనవారే వీండ్ల కన్నా ఎక్కువ అపాయకారులు. సత్యవ్రతనిష్ఠుడవుకా; ఆత్మ వంచకుడవుకావద్దు. నీస్వానుభవాన్ని జీవించు. నీస్వానుభవం కంటే మించిన గురువులేదు.

తన స్వానుభవంద్వారాగాక, ఏ మానవుడూ పవిత్ర హృదయుడుకాలేడు. అప్రధానమైన బాహ్యపవిత్రతకు ప్రాముఖ్యత యివ్వడం, స్త్రీ పురుషద్వేషం చూపడం, సత్య పవిత్రతకు—ఆత్మజ్ఞానానికి నిన్ను దూరంచేస్తుంది. కానీ, స్త్రీ పురుష మర్యాదే పూర్ణంగావిడిచి పురుష చిహ్నన్నే కోల్పోవడం సత్యపథానికి దూరంగా పోవడమే.

కృత్రిమ నీతిప్రచారకులు, ప్రజలను కొంచెం ఒంటరిగా వదిలితే, ప్రజలు తమ ఆయురారోగ్యాల కోసం స్నానాది క్రియలు స్వయంగా చేసుకొన్నట్లు అతిసులభంగా, సహజంగా, మానసిక, శారీరక పారిశుద్ధ్యం గూడా అలవరచుకుంటారు. విషయవాసనలను గురించి ఊరక చెప్పడం, పవిత్ర మానవ

స్వభావంలో లేనిదాన్ని తెచ్చిపెట్టినట్లే. నీ శక్తిని ఉత్తమాశయాభిముఖం చెయ్యి. దుర్విషయచింతనకు నీకు అవకాశమే ఉండదు.

ప్రజలు ఎవరికి వారు స్వయంగా విచారణ చేసుకునేటట్లు శిక్షణ యివ్వడానికి బదులు, వాండ్లను మానసికదరిద్రులను చేసే బోధనాలయాలున్నవి. కేవలం సూక్తులవల్ల నైతిక దారిద్ర్యం ఏర్పడింది. అమాయకులయిన పసిపిల్లల నెత్తిమీద మతనమ్మకాలు రుద్దడం చేత ఆధ్యాత్మిక దారిద్ర్యం ఏర్పడ్డది. ఆధ్యాత్మిక శూన్యత, అన్యమతద్వేషం యీ రెండూ ఒకే రోగానికి నామాంతరాలు; అవస్థాభేదాలు.

అన్ని నదులు ఒకే సముద్రంలో కలుస్తాయి. అన్ని ప్రేమలు ఆ పరమప్రేమలోకే ప్రవహిస్తాయి. భగవంతుని హృదయంలో సౌందర్యం ఉదయించింది. పరబ్రహ్మ నాభిస్థానంలోనుంచి యీ కమలం ఉత్పన్నమవుతుంది. ఎవరు సౌందర్యాన్ని ప్రేమిస్తారో, వారు ఆ జలశాయి అయిన పరమపురుషుని (నారాయణుని) ఆశ్రయించాలె. నిజంగా సౌందర్యమే హృదయస్థానం. హృదయాహారమే సౌందర్యం. సౌందర్యస్మృతి లేని హృదయం హత్యకు, స్వామిద్రోహానికి, అనేక దుర్విషయాలకు మాత్రమే ఉపయోగిస్తుంది. అయితే సౌందర్యం ఎక్కడ వుంది? నల్లకలువలతో సమానంగా వెలిగే నేత్రయుగ్మంలో ఉందా? గులాబిపూల కోమలంతో వెలిగే బుగ్గలలో ఉందా? కోకిల మధురస్వనంలో ఉందా? మనోహర ప్రకృతిసీమల్లో ఉందా? లేక చిత్రకళల్లో ఉందా? నిజమే

అక్కడ సౌందర్యం ఉంది. అయితే దాని పరిధి అంతటితో ఆగిపోవడం లేదు. ప్రకృతిసీమలు, ఉద్యానవనాలు, ఉత్తమ స్నేహాలు, తియ్యటి మాటలు, యిలాంటి బాహ్యవిషయాల మీద ఎవని ఆనందం ఆధారపడుతుందో, నిజంగా అతడు దుర దృష్టవంతుడు.

ఎవని ఆత్మవికాసం అతని చుట్టూ ఉన్న వస్తుజాలం మీద సౌందర్యం వెదజల్లుతుందో, ఎవనినుండి దివ్యప్రేమ తప్ప యితరమైంది ఉద్గతం కాదో అతడే ముక్తుడు. చైతన్య మహాప్రభు సన్నిధానంలో, బందిపోటుదొంగల్లో, తాగుబోతుల్లోకూడా గుప్తమై ఉన్న దివ్యస్వభావం బహిర్గతమైంది. ప్రాచీన కాలంనుండీ చేస్తున్న తన యాత్రా పరిభ్రమణంలో సూర్యదేవుడు వెలుతురుతప్ప యింకొకదాన్ని చూడలేదు.

ముక్తపురుషుని ప్రేమశక్తిచేత అడవి మృగాలుకూడా సాధుత్వం దాలుస్తవనే ప్రేమప్రకృతిని గురించి వివరించే ఆ యోగదర్శన సూత్రం అబద్ధమా? సర్వమతాంతఃస్వర్గం, ఈ సజీవప్రేమ కాకపోతే, అది ఒక స్వప్నంగా ఉండిపోనా?

## పవిత్రత అంటే ఏమిటి?

అహంకార మమకారాలు, నాది నేను అనే స్వల్పజ్ఞత్వ భావాలు, వ్యక్త్యాత్వభావాలు మొదలయిన వాటికి అతీతంగా మన దివ్యత్వాన్ని నిల్పుకోవడమే పవిత్రత. బాహ్యవిషయాలకు బానిసకాకుండా వుండడమే పరిపూర్ణపవిత్రత. ప్రాపంచిక సుఖాలకుగానీ, దుఃఖాలకుగానీ, లాభాలకుగానీ, నష్టాలకుగానీ, కలిమికిగానీ, లేమికిగానీ, మోహాది బంధాలకు

గాని, సంఘర్షణలకుగానీ, ఆకర్షణలకుగానీ చిక్కవడక వాటి కతీతంగా ఉండడమే పవిత్రత; ఇదే ఆత్మజ్ఞానం; అభేదభావం. పవిత్రులే ప్రకృతిని అనుభవించగలరు. అద్దంలో తన ముఖాన్ని తానుచూచుకొని ఆనందించే విలాసవతిలాగా-పవిత్రులు నామ రూపాలలో, ప్రకృతిలో, సుందర దృశ్యాలలో, సర్వవిశ్వంలో తన అంతఃస్వర్గరాజ్యాన్నే దర్శించి ఆనందిస్తారు. నీవు ప్రేమించ లేనిదాన్నికూడా యదార్థపవిత్రులు ప్రేమిస్తారు. అయితే ఆ ప్రేమ దైవోద్రిక్తప్రేమగాని, దైన్యాకరమైన సక్తతకాదు; వట్టి వాగార్భాటం కాదు. యదార్థ పవిత్రతే యదార్థ ప్రేమ. యదార్థప్రేమయే యదార్థపవిత్రత. ఒక్కొక్కప్పుడు నైతిక దార్బల్యం పవిత్రతగా, సక్తత-ప్రేమగా భ్రమచేత పరిగ ణింపబడుతుంది.

నీవొక వస్తువునకు సక్తుడవైనప్పుడు నీవు దాని సౌంద ర్యాన్ని అనుభవించలేవు. సక్తిలేని ప్రకృతిప్రేమికుడు ఒక తోటను చూచి ఆనందించిన విధంగా, ఆ తోట యజమాని తదానందాన్ని అనుభవించగలడా? అతని చంచల సంపదే అతని యాతురతకు, అస్థిమితత్వానికి, జాగరూకతకు మూలం. ఈ పవిత్రత లేక ప్రేమ (విశ్వైక్యభావన) మనకు కావలసింది. అప్పుడు వాటంతటవే ఇతరవస్తువులన్నీ మనదెగ్గరకు నడిచివస్తవి.

## అది ఎట్లా లభిస్తుంది?

నీ ప్రస్తుత పరిస్థితి నీవు పునీతం చేసుకో. అది ఏలాంటి స్థితిలో ఉన్నాసరే బ్రహ్మజ్ఞానం దానంతటదే కలుగుతుంది; ఎక్కడో దూరంగావుందని నీ వాత్మజ్ఞానంకోసం, పరుగెత్త

నవసరంలేదు. నీ ప్రస్తుతస్థితి నీవు సముద్ధరించుకో ? శిశువు, తన శైశవావసకు తగిన ఆటలు పాటలు, చేష్టలూ ప్రదర్శించిన తర్వాతనే, ఆ అవస్థను దాటడం - పెద్దవాడుగావడం జరుగు తున్నది, అంతేగాని, పెద్దపిల్లలను అనుకరించడంవల్ల కాదు కదా.

సౌందర్యం అంటే ఏమిటి ?

త్యాగం, అహంకారవినాశనం ! నిజంగా, సత్యంగా నేను, నాది అనే వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోడంలోనే, అమృతత్వ సిద్ధి వుంది. కొన్ని వస్తువులకు అసహ్యాకరమైన నల్లటి రంగు ఎందుకు ఏర్పడ్డదో మీకు తెలుసా ? సూర్యకిరణాల నుండి వచ్చే రంగు లన్నింటినీ, అవి దిగమ్రింగుతవి. అన్ని రంగులనూ అవి తమలో యిముడ్చుకోవడమే కాని, ఒక్క రంగైనా తిరిగి త్యాగం చెయ్యవు. కాని తెల్లటి వస్తువులన్నీ సూర్యుడివల్ల తాము గ్రహించిన రంగులన్నింటినీ, తిరిగి స్వేచ్ఛగా, అమాయకంగా ఇచ్చివేస్తున్నవి. అందుకనే అవి, తేజోవంతంగా, పరిశుద్ధంగా ఉంటవి. ఆకర్షణ గురుత్వ శక్తులకు కేంద్రస్థానమైన సూర్యుడు; దివ్యతేజస్సును ప్రాణావసరాలైన ఉష్ణదీప్తులను సకల దిక్కులకూ నిరంతరం వెదజల్లుతున్నాడు.

శిశువులు మనోహరంగా ఉంటారు. కారణం-వాండ్లు స్తంభితాహంకార పంజరంలో చిక్కుకోలేదు. ఆత్మార్పణం, నిస్వార్థభక్తి ఎవరి యందుంటుందో, వాండ్లు అప్రయత్నంగా మనలను ముగ్ధులను చేస్తారు. సమ్మోహింప చేస్తారు. ప్రేమ

స్వరూపుని అందరూ ప్రేమిస్తారు. ఓ శుష్క సిద్ధాంత ప్రలాపమా! అనవసర తత్వతర్కజాలమా! ఇంక శెలవు. నాకు తెలుసు సౌందర్యమే ప్రేమ; ప్రేమే సౌందర్యం. ఈ రెండిటికీ నామాంతరం సన్యాసం. ఇంగ్లాండు దేశపు సన్యాసి (ఇ. కార్పెంటరు) వాక్యాలివి: "సంపూర్ణంగా నిన్ను నీవు మరిచిపోతేనేగాని, నీకు ఆనందం కలుగజాలదు. కాని యీ విషయంలో అసంపూర్ణ పద్ధతి పనికిరాదు. ఏమాత్రం కించిత్స్వార్థలేశమున్నా, అది పాడుచేస్తుంది. ఇది కష్టమైన విషయమే. కానీ ఇంతకన్నా ఇంకోమార్గం లేదని నేను నిస్సంశయంగా చెపుతాను."

ఓ బ్రతికియున్న మానవుడా! ప్రేమే నీవై జీవించడం మంచిది. బుద్ధుళ్ళు, క్రీస్తులు, స్వాములు మొదలైన యింకా యితర గతాదర్శాల అసంపూర్ణ ఉదాహరణలతో ఆచ్ఛాదితుడవు కావాకు. "మానవుని సంకల్పం ముందర చరిత్ర వణికిపోతుంది. అలాంటివాడు ఒకడైనా చాలు." కాలానికి, కారణానికి నీవు భయపడవాకు. ప్రేమవై జీవించు, సర్వధర్మాలు నీలో సంగమిస్తవి. నీ ఆత్మశ్రుతిలో ఫ్రుంకు; కాలం నిన్ను అనుసరిస్తుంది.

ఆహా! చిన్న గడియారపు ముండ్లు! అవి సర్వ ప్రపంచాన్ని తమ గుప్పెట్లో పెట్టుకొని ఎలా పాలిస్తున్నవి! అమృతుడు' నిత్యుడైన మానవుడు గడియారపు అంకెల స్వల్పావధికెంత బానిస ఐనాడు. దుర్విధి! ప్రకృతియొక్క ద్వంద్వరాహిత్యంలో నమ్మకంలేక, ఏకత్వ ధర్మం గుర్తింపలేక;

ప్రజలు భయపడుతున్నారు. ఎంత మతిభ్రంశం! ఇతర శరీరాల్లో వున్నది మరిఒకరని శంకించడమా! రాముడివద్ద ఎప్పుడూ గడియారం ఉండదు. ఐతే అతడెప్పుడూ వెనుకబడి యెరుగడు. కాలం ప్రేమను అనుసరిస్తోంది. సక్రమంగా మీరొక వాయుయంత్రాన్ని (Wind mill) స్థాపించండి. నాలుదిక్కులనుండి వచ్చే వాయువులు, స్వయంగా దానికి తోడవుతవి. అలాగే, ప్రకృతి నీకు స్వయంగా సహాయపడుతుంది. నీవు ప్రేమలో కేంద్రీకరింపబడ్డప్పుడు నీకు అన్ని అద్భుతాలు వశమౌతవి.

మనంచేసే ఆర్భాటాలకు, అర్థవిహీనమైన కారుణ్యాది గుణాలకు, మర్యాదలకు దేవతలు నవ్వుతారు. మనకు దూరంగావున్న పొరుగువాణ్ణి సంతోషపెట్టడానికి, మనకతి సన్నిహితమైన ఆత్మకే విరుద్ధంగా ప్రవర్తిస్తాము. ఇది ఎంత ఘోరాపరాధం? ఎంత కపటం? ఒక బిచ్చగత్తె, సంపన్నురాలింటికి అడుక్కోడానికి వచ్చింది. పాపం! ఆ భాగ్యవంతురాలు, బిక్షుకురాలి స్వేచ్ఛాజీవితానికి ఆశించింది. ఆ ముష్టిది పోయినతర్వాత, ఆమె తన భర్తదగ్గరకు వెళ్లి 'మా అమ్మ చనిపోయిందట. పోయి రమ్మంటారా?' అని అడిగింది. అత్తగారి ఆస్తి కొంత దొరుకుతుందనే ఆశతో భర్త ఆమెను పొమ్మన్నాడు. వెంటనే ఆమె ఒక రైలుటికెట్టు కొన్నది; ఒక దగ్గరస్టేషన్‌లో దిగింది. ఎన్నాళ్ళనుంచో బంధింపబడ్డ చిలుక, ఒక్కసారి పంజరంలోనుంచి తప్పించుకొన్న మాదిరి ఆమె ఒక అడివిలోకి పారిపోయింది. ఎన్నాళ్ళనుంచో ఉన్న

తన దుస్తరభారం తొలగిపోయినందుకు మహానంద పడింది. ఆ అడవి ప్రతిధ్వనించేటట్లు ఒక్కసారి పెద్దగా నవ్వింది. స్వేచ్ఛగా విహరించింది. ఆ చుట్టుపట్ల ఊళ్ళలో అన్నం తెచ్చుకొని, సుఖంగా తిన్నది. సూర్యుడు అస్తమించగానే, ఒక్కచెట్టు మొదట్లో హాయిగా నిద్రించింది. మరునాటి ఉదయం, ఆమె మళ్ళీ తన మహానంద స్వేచ్ఛావిహారం సాగించింది. విచిత్రం! ఎవరిదా కంఠధ్వని? ఆమె ఆశ్చర్యపడింది! నిన్నటి బిచ్చుకురాలితో తిరిగే ఆమె స్వంతభర్తే. అతడుకూడా ఆమెలాగే దుర్భర జీవితభారంతో వేసారి కొంతకాలం స్వేచ్ఛాజీవితాన్ని ఆశించాడు. ఇద్దరి మనస్సుల్లో, ఈ కోరిక ఉన్నప్పటికీ, పరస్పర అవిశ్వాసం వెలువడుతుందనే భయంతో, ఒకరి హృదయవేదన ఒకరు చెప్పుకోలేరు. మనం ఇతర్లను సంతోషపెట్టాలని పడే బాధలన్నీ ఇలాంటివే. ఆత్మవంచకుడవు కావాకు' దినాన్ని రాత్రి అనుసరించినట్లు, అందరూ నిన్ననుసరిస్తారు' నేడు అన్ని పాపాలకు మూలం, తన ఉద్దేశ్యాన్ని దాచుకోవడమే. ఇతర్ల మొగమాటంవల్ల బాధపడడం, క్రుంగిపోవడం-పరమాత్మయిన భగవంతుడికి వ్యతిరేకంగా చేసిన ఘోర ద్రోహం. ఎవడు తన పరమాత్మకు హితం చేస్తాడో, వాడొక్కడే ప్రపంచానికి జ్యోతి అవుతాడు. ఉత్కృష్టమైన వ్యక్తిత్వమే (Highest Individualism) ఉత్కృష్టమైన విశ్వమానవ ప్రేమ (Highest Altruism) దాన్ని విశ్వమానవ ప్రేమ అనడం నిజానికి తప్పుపేరే. పరోపకారం, పరోపకారం అని చేసే వాగాడంబరంవల్లమనం, మన స్వస్థాన కేంద్రంనుండి

జారిపోతాము. న్యూటన్ గురుత్వశక్తిని కనిపెట్టేసమయంలో పరోపకారాన్ని గూర్చి ఏమీ అనుకోలేదు. కానీ అతడు ప్రపంచానికి చేసిన మేలు గొప్పది. మనం సర్వమిథ్యానామాల నుండి విడిబడతాము గాక. "పిల్లవాడు ఒక కిటికీగుండా చూస్తూ, ఇంకో కిటికీగుండా చూస్తున్నానని చెప్పితే, కొరడాతో ఒకటి అంటించు" అంటాడు జాన్సన్.

## ప్రేమా ? ధర్మమా ?

రాముడు వట్టి ధర్మసిద్ధాంతాలు చెప్పడు. అనుభవ తర్కం కావాలంటాడు. 'ధర్మం (Law) దాన్ని అనుమతిస్తుంది'—అనే వాదం మీ రెక్కడ విన్నా అందులో మోసం ఉందని గ్రహించండి. ప్రేమలో జీవించేవాడు ధర్మాతీతత్వమే ధర్మంగా జీవిస్తాడు. ధార్మికమైన ధర్మసూత్రం ఒక ప్రేమ మాత్రమే. ప్రేమలో జీవించడమంటే, నిన్ను నీవు నమ్ముతూ బ్రతకడం. నేనే సత్యమైన ధర్మం. నాకు ధర్మాన్ని శాసించడం నానుండి ధర్మాన్ని విడతీయడమే. శిశువును గాలిపీల్చమని, పెరగమనీ, ఆడుకోమని, బ్రదకమనీ, ధర్మాలు శాశింపవచ్చునా ? అతని జీవితమే ధర్మంకాదా ? ఒక స్వేచ్ఛావిహంగంమాదిరి, శిశువు పాడుతుంటాడు; నవ్వుతుంటాడు; ముద్దుగా మాట్లాడుతుంటాడు. ఆ సమయంలో ఎవరైనావచ్చి 'అబ్బాయి ! పాడు, మాట్లాడు ఏదీ నవ్వు" అని అడుగుతారు. వెంటనే శిశువు తన క్రీడలు ఆపుతాడు. ఆ శిశువుయొక్క నైజక్రీడలు; వాటికి విరుద్ధమైన తత్త్వం ప్రవేశించగానే, అసహజాలై పోతున్నవి. ఎవడు ఆత్మవంచనలేని స్వేచ్ఛా

జీవితాన్ని, దివ్యతన్మయజీవితాన్ని గడుపుతాడో, వానితో ప్రపంచ ధర్మాలన్నీ ఏకీభవిస్తవి. అతనికి దేనిమీద ద్వేష ముండదు. అతడు దేనికీ విముఖుడుగాడు. అతడు దేనికీ భయపడడు.

రోగమేమిటి? ప్రేమ లేకపోవడం; నీడలవెంట పరుగెత్తడం; అపాయముయొక్క మిథ్యాస్వప్నాలకు రోదించడం. నిజంగా దేనికీ భయపడవలసిన అవసరంలేదు. పైనా క్రిందా, ముందూ వెనుక, దగ్గర దూరంలో, సర్వత్రా ఉన్నది ఒక్క పరమాత్మే. అదే నా ఆత్మ! నేనెవరికి భయపడాలె? పగలెంతో రాత్రికూడా అంత మంచిదే. సూర్యకాంతి ఎంత అవసరమో, తుఫానుకూడా అంత ముఖ్యమే. తరచు రాముడు అనేక రాత్రుళ్ళు ఒక్క నిముషమైనా నిద్రపోకుండా ఉంటాడు. అయినప్పటికీ, ఎట్టి విశ్రాంతీ కోరకుండా పగలంతా అతడు మామూలుగా గడుపుతాడు, నిద్రకొరకు పడే పరితాపం వల్లనే, అలసట కలుగుతున్నది. కాని నిద్రావిహీనతవల్ల అంత బాధ కలుగదు. ప్రేమదేవతా ప్రేరణచే మనం చేసేజాగరణలు, ఎంత ఆనంద ప్రదాలు! శరీరం అన్నంకోసం తపిస్తున్నప్పుడు, అన్నాన్ని ఆనందంగా స్వీకరిస్తుంది. కాని ఒకొక్కప్పుడు అన్నం అవసరంలేని పరిస్థితుల్లో, పైవిధంగానే ఉపవాసంకూడా సమాన సంతోష ప్రదమే. కన్నీటి తుఫానులు, సంతోషపు వెల్లువలు తెస్తాయి. ఎందుకంటే, ఆ తుఫానుకు ప్రేమ అధిష్ఠాన దేవత, మందహాస ప్రవాహాలు స్వేచ్ఛగా ప్రవహిస్తాయి. అందులోఉన్న ఆనందం, యీ

కన్నింటికి యానందానికంటే ఎక్కువా? తక్కువా? నేను దేన్ని ప్రతిఘటించాలె? సర్వమూ నా ఆత్మే అయినప్పుడు, నేను దేనినుండి పారిపోవడం? ఓహూ! ఎలాంటి ఉత్కృష్ట చిన్మయత! దివ్యోదాసీనత!

నాకు జ్వరం వచ్చినప్పుడు నేను భయపడను. నేను దాన్ని స్నేహితుడుగా ఆహ్వానిస్తాను. ఇంకోవిధంగా తెలుసు కోరాని సత్యాలు తెలుసుకోబడతాయి. అంతా ఆరోగ్యమే. మెళుకువ ఒకవిధమైన ఆరోగ్యం. నిద్ర ఆ ఆరోగ్యముయొక్క యింకొక స్వరూపం. ప్రశాంతత మనోహరమైంది; తీవ్రజ్వర తాపపు తుఫానులోగూడా దానికితగిన మనోజ్ఞత ఉంది. భగవంతుడిలోకంటే, మంచిలో నమ్మకముంచడమే నిజమైనమతం. అటువంటి తుఫాను ఇంతవరకు ఎప్పుడూ లేదు. కానీ, పరిశుద్ధుడైన, అమాయకుడైననాని చెవికది గంధర్వగానమే.

మేఘగర్జాధ్వనితో ఈ విషయం ప్రచురింపబడుగాక! "'నీ విధిచెయ్యి. నీవిది చెయ్యవద్దు' అనే నిర్బంధాలు, బాహ్య శాసనాలూ ఉన్నంతవరకు ఆధ్యాత్మికాభివృద్ధికి లేక నిజమైన పవిత్రతకు ఏమాత్రం తావుండదు" 'నీవు' అనే మధ్యమ పురుష ఆజ్ఞ మనలో సంకుచిత (పరిమిత) వ్యక్తిత్వాన్ని కలిగిస్తుంది. పరిమితం ఉన్నచోట ఆనందం లేదు; రాగద్వేషాల నుండి తప్పించుకోలేము. మోహాసూయా బంధాలనుండి విముక్తి కలుగదు. సంశయాలు, ఆకర్షణలనుండి విడిబడలేము.

తన ఏకశరీరసంబంధియైన మానవుడు ఆత్మైక్యస్మృతిలో ఉంటాడు. శరీరంలోని వివిధేంద్రియాల కర్మల్లో భేదం

చూడము— ఆ 'నేనే' చూస్తున్నది, వింటున్నది, నడిచేది, తదితర పనులు చేస్తున్నది. అదేమాదిరి ముక్త పురుషుడు విశ్వాత్మే తాననే జ్ఞానంతో సర్వప్రపంచాన్ని చూచుకుం టాడు. అప్పుడు ఒక శరీరంలో అన్నం అరగడం, వెంట్రుకలు పెరగడం మొదలైనవి నాటంతట అవి ఎలా జరుగుతున్నవో, భేదాలు ఎక్కడివక్కడ అణగిపోతవి. తన అనంతత్వాన్ని తెలుసుకోవడం వల్లనే, సర్వభేదభావాలను నిర్జించడంచేతనే, మనయొక్క సర్వైక్యతను సంభావించినందువల్లనే, నక్షత్రాలు, భూప్రదేశాలు, నదీనదాలు మొదలైనవన్నీ నావే; ప్రేమో న్మత్తుడనై 'నేనే' అని గ్రహించడం చేతనే మోహబాధాలకు మనమీది అధికారబలం తొలగిపోతుంది.

మహాసూర్యబింబం ప్రచండంగా వెలుగుతుంటే, చిన్న మిణుగురుపురుగు ఏమి కాంతి వెదజల్లుతుంది? నాకంతా సౌందర్యమే అయినప్పుడు, ఆ సౌందర్యమే నేనయినప్పుడు నేను దేనివెంట పరుగెత్తాలె? ఆకర్షింపగల ప్రతి వస్తువుతో ఐక్యమైన మానవుణ్ణి, ఈ సర్వప్రపంచ పదవీ సముదాయంలో అతణ్ణి మోహపెట్టగలిగింది ఏముంది?

ఎవడు పరమతేజాన్ని అసత్యాచ్ఛాదనం వెనుక దాచి పెట్ట దలుస్తాడో, తన్ను (ఎవరైనా సరే) భగవదేతరంగా తలచి ఆత్మహత్యానేరాన్ని చేస్తాడో, అతణ్ణి ఏ మోసం అప హరించదు?

'సత్కర్మ లేదహా! దుష్కర్మలేదు,
సద్భావములు దుష్టభావముల్ లేవు,

లేవు కీర్త్యపకీర్తు లేమియు లేవు,
సన్నుతి బెట్టెడు మృగములు లేవు
అహాహా! బ్రహ్మానంద దివ్యసాగరము
తప్ప యింకొక్కటి లేదహాహా! లేదు
అమరమైనట్టి దివ్యానందవనధి
ఆ యపారంబగు పరమతేజంబు
నాయందు నైతము రూపొందియుండ
నేనెవ్వరికి నమస్కారంబు సేతు?
ఎవరి ముఖంబును చూతును నేను?

## కర్మ - ప్రేమ

కష్టపడి పనిచేసే కార్మికుడి హృదయానికి ఆహారం పెట్టండి. ప్రేమప్రదానం చెయ్యండి. వారిని మీరు ప్రేమిస్తారా, తమ శరీరాహారాన్ని గూడా మిమ్ములను అడగకుండా వాళ్ళు పనిచేస్తారు. కార్మికుణ్ణి ప్రేమించు, కార్మికుడు నీపనిని ప్రేమిస్తాడు. ప్రేమ ప్రేరితమైన కష్టం, ఒక కష్టమా? కాదు— అది ఒక వినోదక్రీడ.

కళ అంటే ఏమిటి? మనం స్పృశించిన ప్రతిదాంట్లో సౌందర్యం వెలువరించడమే. భూ స్వర్గలోకాల్లో ఎక్కడైనా సరే సౌందర్యాన్ని ప్రసాదించేది ఏమిటి? ఏమిటా— ప్రేమ తప్ప ఇంకొకటేముంటుంది?

మన కర్మమీద ప్రేమతత్త్వకాంతి ప్రసరించినప్పుడు పరిశ్రమను కళామయం చేస్తుంది. పారిశ్రామిక కళలు ఉదయిస్తాయి. ఈ రోజుల్లో భారతదేశంలో పేరుపొందిన ఒక్క పారి

శ్రామిక కళగాని నైపుణ్యవంతమైన హస్తకౌశలంగానీ, భావగంభీరమైన చిత్రాలుగానీ కనపడకపోవడానికి కారణమేమిటి? కార్మికులమీద ప్రేమ లేకపోవడమే. పాపము! ఆ కాయకష్ట జీవులు హృదయాంతరాల్లోకి ఆహ్వానితులు కావడానికిబదులు వారి స్వంత గుడిసెల్లోనుంచే తరుమగొట్టబడ్డారు.

ఎక్కడ కాయకష్టము హేయంగా చూడబడుతుందో, అక్కడ ఫలితం స్తబ్ధత, క్షీణత, మృత్యువు. కళ ఆయాసకర మవుతుంది. కృషి ప్రేమింపబడినచోట చైతన్యత, తేజస్సూ ప్రవహిస్తుంది. అప్పుడు కర్మ కళావంతమవుతుంది. ఓ ప్రేమ దేవతా! ఎంత దుస్థితి వచ్చింది! ప్రేమ అనే పదం అపార్థం చేయబడింది. ప్రేమ అనేపదం వినడంతోనే, మన్మథవికార మనే భావమే ప్రతివానికి కలుగుతున్నది. ప్రేమ అంటేదివ్య జ్యోతి (భక్తి) అనే విషయాన్ని విస్మృతించారు! ఒకొక్కప్పుడు వాండ్లు దివ్యప్రేమ, భక్తి, ఉపాసన — వీటిని గురించి పెద్ద పెద్ద ఉపన్యాసా లిస్తుంటారు కానీ అనుభవ రూపంలో చూస్తే ఏవో కొన్ని సంస్కృతశ్లోకాలు బిగ్గరగా చదవడం, ఏవో కొన్నిమంత్రాలు జపించడం జరుగుతున్నది. వాటి అర్థమే వాండ్లకు తెలీదు కదా, యింక భావతన్మయత విషయం చెప్పాల్నా? మందులేని తుపాకిగుండ్లు! చైతన్యని సత్యత ప్త హృదయానికి కృత్రిమానుకరణమా ?

తరచు దేవాలయాల్లో పద్యాలు, కీర్తనలు కిన్నర కంఠాలతో పాడుతుంటారు. ఓప్రియాత్మా! ఒక్క పవిత్ర ప్రేమాశ్రుబిందువైనా లేదు!

ధన్య హిందుస్థానీయులారా! మీరు భగవంతుణ్ణి

వంచింపలేరు. "మేము పాపులము, దాసులము" అని ఎంత వాపోయినా మీకు ఈశ్వరప్రేమ లభ్యంకాదు. 'యద్భావం తద్భవతి'— మీరు తలచినట్లే మీరు కావలసి ఉంది. మీరు ఆవిధంగా ప్రార్థించితే, అనుల్లంఘనీయమైన కర్మశాసనం ప్రతీకారబుద్ధితో మిమ్మలను పాపులుగానే, దాసులుగానే చేస్తుంది. అది భక్తి కాదు.

ఓ నా మందభాగ్యులైన భాగ్యవంతులారా! ధవళోన్నత గోపుర దేవాలయాలు, మీరు నిర్మించిన శిలావిష్ణువులు, మీ హృదయతాపాన్ని పోగొట్టలేవు. మీరు బాధపడుతున్నది నాకు తెలుసు. మీ గర్వం దాన్ని ఒప్పుకోకపోవచ్చు. దేశంలోని దరిద్రనారాయణులను, కార్మిక విష్ణువులను సేవించండి! బీద హిందూస్థాన విద్యార్థులను, అవసరమైన కళలు నేర్చుకోడానికి అమెరికాకు పంపండి. తిరిగి వాంళ్లు ఇండియాకువచ్చి, వందలకొద్ది - కాదు వేలకొద్ది గంజిలేక మలమలమాడే ప్రజానీకాన్ని రక్షిస్తారు. వారికిసహాయం చేయడంవల్ల తమకు తాము సహాయం చేసుకుంటారు.

ఒకడు; నిజామీ రచితమైన 'లైలా-మజూనా' చదివి, ఆ పుస్తకంలో ఉన్న లైలా బొమ్మ చించాడు. దాన్ని గుండెకు హత్తుకుంటూ, మహాసంతోషంతో ముద్దుపెట్టుకుంటున్నాడు. ఎందుకు? "లైలామీద ప్రేమలో పడిపోయాను" అంటాడతను. బుద్ధిహీనుడా! పాపం మజూనా మధురహృదయాన్ని (ప్రేయసిని) అపహరించడం వల్లలాభమేమిటి? మజూనా యొక్క ఉజ్వలప్రేమ నీకుండవచ్చు. కానీ సజీవురాలైన స్త్రీనే నీ ప్రియురాలిగా చేసుకో!

భారత భక్త సమూహాల్లారా! మీరందరూ, గోపికలయొక్క, చైతన్యుని యొక్క మనోహరుని దొంగిలింప సంసిద్ధంగా ఉన్నారు. అయితే, మీలో ఎంతమందికి ఆగోపికా గౌరాంగులయొక్క ఉజ్వల పరిశుద్ధభక్తి ఉంది?

రాతి విగ్రహాల్లో మాత్రమే బంధించకుండా, ఛండాలుడిలో, దొంగలో, పాపిలో, అపరిచయుడిలో, సర్వుల్లో మీరు ఆ మనోహర గోపాలశాలుణ్ణి దివ్యప్రేమతో దర్శిస్తే, మీ రతనికి అత్యంత ప్రియులౌతారు.

భక్తి (ప్రేమ) అంటే అరవడంకాదు. అడుక్కోవడం కాదు. అది వర్ణనాతీతమైన సమత్వ భావన. తేజోమయమైన మాధుర్యం; దివ్యమైన స్వేచ్ఛ. భక్తిఅంటే సర్వంలో సర్వేశ్వర సందర్శనం చేయడం. కనుపించిన సర్వవస్తువుల్లో నిన్ను నీవు చూచుకోవడం; అంటే అంతా సౌందర్యమనీ, అది నేనేనని తెలుకోవడం. తత్త్వమసి! ఆ పరబ్రహ్మను నేనే!

'ఓ మనోహర! చోర! రారమ్మ త్వరగ
రార! ఓ ప్రియరార! ఎందుకుభయము
నా హృదాబ్జము నీది నీ యదినాది
సరియె—నీ వాసించి సల్లైన నిదిగో
నాదగు సర్వస్వమున్నీసుకొమ్మ
పరమేమిలేదు రారా! వేగ యిదిగో!
నీ కిష్టమైనచో నొక దెబ్బతోడ
ఈ దేహమును చిత్రవధ చేయవోయి!
ఈ శరీరము తీసుకోపొమ్ము - కాద

ఏమైన చేసుకో నీ యిచ్ఛ రీతి
కీర్తి ప్రతిష్ఠలు గైకొని పొమ్ము
పోవుచు తిరిగి చూడుము ఒక్కసారి
నిరపాయముగ నేను నిలిచి యుండెదను
సప్రాణముగ నేను సంచరించెదను !
శుభదినంబో ప్రియా ! శుభదినంబోయి !'

మహమ్మదీయులారా ! మీరు నన్ను ఖండించవచ్చు. కానీ నాహృదయం మీ మీది ప్రేమతో జ్వలిస్తుంటుంది క్రైస్తవులారా ! నన్ను మీరు అపార్థం చేసుకోవచ్చు ; మిమ్ములను నేను ప్రేమిస్తాను. పంచములారా ! పాకీ కులస్థులారా ! మీ కుళ్ళు గుడిసెల్లోకి, రోగకూపాల్లోకి ఎవరూ రారా ? ఇరుగో రాముడు మీతో సంసిద్ధం.

దొంగప్రేమ, అసత్యభావ ప్రకటన, ఆడంబర ప్రదర్శనాలు-భగవన్నిందే. విషయసంబంధమైన పొగతో కూడిఉన్నా, పరిశుద్ధ ప్రేమజ్యోతే కావాలె,

సాంప్రదాయం, ఛాందసాచారాలు, అనుకరణ, గౌరవాగౌరవాలకు దాస్యంచేయడం, యివన్నీ యువకుని హృదంతరంలో వెలిగే సత్యభావజ్యోతిని అణచివేసే చెత్త, బొగ్గులాంటివి. సత్వమా స్వాగతం! నీవే నా బంధువు స్నేహితుడివి. పియుడివి ప్రభువ్వు, ఈశ్వరుడివి ! నా ఆత్మవు !

ఓ రాజులారా ! శాసనాల్లారా ! సంఘాల్లారా ! మీ కాశీర్వాదాలు. కానీ రాముని వద్దనుండి ఎట్టి రాజీనామా తీసుకోడానికి మీ కధికారంలేదు. మా తర్జన భర్జ

నాలను, మీ అనుకూలతా ననుకూలతలను కట్టిపెట్టండి. నా ప్రభువైన నిరంకుశసత్యం, లెక్కలేని చక్రవర్తులు నిరంకుశాధీశ్వరులు మొదలైన వాండ్లందరికంటే అధికబలమైంది.

పెనామా రైలుమార్గాన్ని నిర్మించడంలో, అడుగడుక్కు ఒక్క మనిషి చచ్చిపోయాడని చెప్పుతారు. ఇదినిజమైనా కాక పోయినా,నిరంకుశసత్యం మానవ కపాలాలు పరచినమార్గంలో నడిచింది అనడంలో, లేశమైనా సంశయంలేదు. సత్యప్రభుపాద ఘట్టనల్లో ధన్యతపొందిన ఆ శిరస్సులు ఎంత అదృష్టంగలవి !

సత్యం లేనిచోట ప్రేమ ఉండదు. ప్రేమ, నిరంకుశ సత్యానికి ప్రతినిధి — లేదా సత్యమే ప్రతినిధి — చివరకు రెండూ ఒకటే.

“ భగవంతు డొకసారి భావంబులోన
అట శుద్ధమగు బహూకృతి గోరుకొనియె.
“ మంటలో నైతము పొగ గానబడియె.
ప్రేమ తోజోదీపితంబు లైనట్టి
భక్తుని నేత్రాలె వాంఛించె తుదకు,
మధురాతి మధుర గంభీరమైనట్టి
ప్రేమాగ్ని వెలుగొందు దివ్య నేత్రముల
కోణంబు లెచ్చోట కలియు నచ్చోట
స్వర్గమే సృష్టింపబడు చుండు నెపుడు,
ఆ దివ్యదృష్టికి హద్దులు లేవు.
ఆ నేత్రకోణముల్ సూర్య దీప్తములు.
నిష్కళంకంబులు నిరుప మానములు. ”

ఎమర్సన్

ఓ పర్వతోద్ఘూరిత నదీ సమూహాల్లారా ! గర్జించండి ! ఓ సముద్రమా ! గర్జించు ! వెలవెలబోయే నక్షత్రాలక్రింద చెలరేగు ! ఓ మరణాఘాతమా ! దిశాకుహరాలు చీకట్లుకమ్మే ట్లు ఆపుఘించు. అయితే ఓ ప్రేమదేవతా ! పర్వతారణ్యాల మీద, సముద్రంమీద, నల్లటి మృత్యుఘాతంమీద విద్యుద్వే గంతో స్వారి చేస్తున్నది నీవేనని నాకు తెలుసు. ఓ నిరంకుశ సత్యమా ! ఈ క్షుద్రావాయువులు, తరంగాలు నీవేటకుక్కలు. నివు శాశ్వతమైన వేటకాడివి.

సందె చీకట్లు క్రమ్మాయి. గలీలియోలో (galilee) ఒకనాడు క్రీస్తు శిష్యులు పడవను కర్రలతో నెట్టుతూ, తెడ్లతో నడుపుతూ, త్రాటితోలాగుతూ బాధపడుతున్నారు. ఎదురుగాలి అవడంచేత వారలా కష్టపడవలసి వచ్చింది. కాని క్రీస్తు కే కష్టమూ లేకపోయింది. నీటిమీద నడచిపోగలను అనే జ్ఞానం గల అలాంటి మానవుడు, తుఫాను, మధ్య ఎందుకు నిద్రపోలేడు ? ఓహో ! ఆనందం! నాప్రేమ వాయుతరంగాలను స్వారి చేస్తుంది.

జపానులో మూడువందల సంవత్సరాలనాటి కేదార వృక్షాలు, దేవదారువృక్షాలు, ఉల్లిమొక్కలంతవిగా ఉంచారు. వాటిబహిరభివృద్ధిని నిరోధించడం వల్లనేకాదు, లోపలి వ్రేళ్ళను త్రెంపడంవల్లకూడ వాటి నా విధంగా ఉంచారు. లోతుగా భూమిలో వాటి వ్రేళ్లు పాతుకోకుండా చేయడం చేత, నైజంగా అవి పైకి పెరగవు. అదేమాదిరి స్త్రీ పురుషుల నైజాభివృద్ధి, అసమాజప్రబోధకులచేత అణచి వేయబడింది.

తెలివితక్కువ నైతికవేత్తలారా! మతపిశాచాల్లారా! మీ శాసనాలు కట్టిపెట్టండి! యువకులను విధించడానికి మీ కెట్టి అధికారము లేదు. ప్రతివాడికి ఉన్న అధికారం సేవ చేయడమే. ప్రకృతి, దాని స్వేచ్ఛాప్రక్రియకు ఆటంకం కలక్క పోతే, ప్రమాదానికి లోనుగాదు. చిన్న పరమాణువునుండి, దివ్యమైన మానవజన్మవరకు జరిగిన పరిణామానికి తోడ్పడిన ధర్మం లేక భగవంతుడు సంపూర్ణ విశ్వాసార్హుడు.

మానవులు ఈర్ష్యతో పశుప్రేమ అని పిలిచే ఇంద్రియ వాంఛలను నిరోధించడంలో, జంతుజాలమే ఎక్కువక్రమము, పరిశుద్ధత, శీలమూ ఎందుకు చూపిస్తున్నవి? దాని విపుల కారణం— "మీరలా చెయ్యండి, మీరలా చెయ్యవద్దు"అనే శాసనాలు వాటికి లేకపోవడమే. సేవా, ప్రేమా అభివృద్ధికి మార్గాలు కానీ, శాసనాలు నిర్బంధాలు కావు.

మనం పూలెలా పూయించగలం? వాటిని ప్రేమించడం వల్ల. ఒక స్త్రీ, అకాలంలో సుందరమైన పుష్పాలు పూయించింది. వాటిని ఎలాపూయించావు? "నేను వాటిని ప్రేమించాను. వాటి విధానం అవ్వే చూచుకొన్నవి." ప్రేమ యొక్క ప్రసన్నోష్ణతే, పొదుగుతుంది. అది పరిశ్రమలను కళావంతం చేస్తుంది. మనకర్మలో సౌందర్యం ఉదయింప జేస్తుంది.

ప్రేమను మోహబంధాలచేత భంగంచేయవాకు. నీ భార్యా పిల్లలు, నీ అనురాగాలు పైకిపోకుండా అరికట్టే కంచెలు కాకూడదు. నీ ప్రేమ, నీ కుటుంబాన్ని కేంద్రంగా

చేసుకోని, ప్రపంచమంతా విస్తరించాలె. "నాకంటే ఎక్కువగా నేను నా కుటుంబాన్ని ప్రేమిస్తాను, నా కుంటుంబాని కంటే ఎక్కువగా నాదేశాన్ని ప్రేమిస్తాను, నా దేశానికంటే ఎక్కువగా సర్వప్రపంచాన్ని ప్రేమిస్తాను." అంటాడు జీన్‌పాల్‌రిచర్ ( Gean paul Riehter).

ఒక వీరుడు యుద్ధానికి పోతూ, తన ప్రియురాలితో ఇలా అన్నాడట— "ప్రియా! నా జాతిని యింత ఎక్కువగా ప్రేమించలేకపోతే, నిన్నసలు ప్రేమించలేక పోయేవాణ్ణి." ఈ మాటలెంత మనోజ్ఞముగా ఉన్నవి!

సత్యప్రేమ సూర్యునిలాగా ఆత్మను వికసింపజేస్తుంది. మోహం మంచులాగా ఆత్మను ముకుళింపజేస్తుంది, గడ్డ కట్టిస్తుంది.

మోసెస్ యొక్క ప్రధానధర్మం ఏమిటంటే— "నీకు ప్రేమకంటే యితర దైవం ఉండకూడ"దని. ఈ ప్రేమస్వరూపుడైన భగవంతుడికి కామమోహాలంటే అసూయ. వీటిని తన మహా సింహాసనంమీదికి ఎక్కనివ్వడు

ఒక స్త్రీ తన పుత్రవియోగాన్ని గురించి చెప్పింది. "నీవొక నీగ్రోపిల్లవాణ్ణి పెంచుకోని, నీ గర్భజనితునిలాగే చూచుకోగలవా" దానికి నీవు సిద్ధంగా ఉన్నావా?" అని రాముడడిగాడు. "ఊఁహు"అన్నది ఆమె అందుకనే నీవు బిడ్డను పోగొట్టుకున్నావు." సర్వాన్ని ఆలింగనం చేసే ప్రేమే దివ్యత్వంగాని, సర్వాన్ని పోద్రోలే మోహం దివ్యత్వం కాదు.

ఇతర్ల కృతఘ్నతను గురించి ప్రజలు చెబుతుంటారు. వాండ్లు తాముచేసిన స్వల్పాపకారానికి శాంపౌండు వడ్డీతో ప్రత్యుపకారం గోరే పైలాకులు. శాంతి! శాంతి! సంకుచిత హృదయుల్లారా! మీ సణుగుళ్లు చాలించండి! భగవంతుడి కుంది ఒక్క చెయ్యేకాదు. అన్నిచేతులూ ఆయనవే. అన్ని నేత్రాలు భగవంతుడి నేత్రాలు, అన్ని మనస్సులు పరమేశ్వరుడి మనస్సులే. నీ వొకరికి డబ్బిచ్చేటప్పుడు; నీవేచేతిలో ఆ డబ్బు పెట్టావో, ఆ చేతితోటే తిరిగి యివ్వాలని నిర్ణయిం చావా? అతడు రెండో చేతితో ఆ డబ్బు యివ్వవచ్చు. నీ బాకీ దారుడు చేతులుకాదు; ఆ చేతుల నుపయోగించే మనిషి.

అదే విధంగా, నీ వ్యాపారం భగవంతుడితో (ధర్మం) ఉందికాని, మిత్రులు, శత్రులు అని నీవనుకొనే కేవల రూపాలతో కాదు. భగవంతుడు తనఋణాన్ని ఎప్పుడు ఉంచుకోడు. ఏ నిస్స్వార్థకర్మకైన భగవంతుడు బాకీ పడతాడు. నీ దగ్గర తీసుకొన్న చేతితో, ఆయన నీకుతిరిగి చెల్లించకపోవచ్చు. కానీ, ఇంకొక చేతితో(వ్యక్తి)వడ్డీతో సహా నీకు చెల్లించవచ్చు.

ఓ సంశయాకులిత మానసుడా! విశ్వాస విహీనుడా! ఎందుకీభయం? ఎందుకీ ఆవేదన? సర్వబ్రహ్మండాన్ని పాలిస్తున్నది నీమధురాత్మే(దివ్యధర్మం)! నీమధురాత్మే! ఇంకెవరూ కాదు.

## విగ్రహారాధన అంటే ఏమిటి?

శత్రులనీ, మిత్రులనీ ఆకార వ్యక్తిత్వాలు, యదార్థత కల్పించి, అంతర్హితమైన అఖండసత్యాత్మనే, ధర్మాన్నే విస్మరించడం.

అరణ్యాలు, భూప్రదేశాలు, నదులు, సరోవరాలు, వినీలపర్వతాగ్రాలు మనకెందుకు ఉత్తేజాన్ని కలుగజేస్తవి? ఎందుకవి మనోహరంగా ఉంటవి? మనకెందుకవి తన్మయత్వం కలుగజేస్తవి? కారణమేమిటి? సంకుచితమైన వ్యక్తిత్వం వాటిలో లేదు. జనసమ్మర్దవీధుల్లో కానవచ్చే నటనాదృష్టులు మనకక్కడ కానరావు. ధన్య వృక్షకదంబాలు, నిర్మల జలాలు— తమ అవ్యక్త సాధుత్వంతో, కాదు— మాధుర్యంతో, ఏ సంకుచితస్వభావాన్నీ మనమీద ప్రయోగించవు.

గులాబితోటల్లో, సింధూరవృక్ష నికుంజాల్లో స్ఫురించే అవ్యక్త చైతన్య స్వరూపాన్నీ స్త్రీ పురుషజన సమూహాల్లో కూడా దర్శించి, ఈ సమస్త జగత్తును స్వర్గోద్యానంగా ఎవరు మారుస్తారో, వాండ్లు ధన్యులు.



# తీవ్ర పరిస్థితుల మధ్య శాంతి

ప్రతిరోజూ, ఈ అతివ్యయ ప్రకృతిచేత కోటానుకోట్ల ఖనిజాలు, మొక్కలు, జంతువులు, శోషిల్లుతున్నాయి. వృధా అయిపోతున్నవి. అయితేనేమి? అలాగ జరగనీ. ప్రకృతిలాగే రాముడుకూడా గంటగంటకు కోటానుకోట్ల జీవితాలను, భాగ్యరాసులను విరజిమ్మగలడు. వస్తువు ఎక్కడికి పోతుంది? అది ఎక్కడికి పోయినా, నాలోనే ఉంటుంది. పురాతన భారతవర్ష మహాసంపద భారతవర్షంలోనే ఉన్నప్పుడు నా ఎడమజేబులో ఉంది. ఆ సంపదే యిప్పుడు, ఇంగ్లాండుకు ప్రవహింప బడింది. అంటే నా కుడిజేబులో ఉన్నది. నేను మహాసముద్రాన్ని. ఆటు పోట్లు రెండూ నావే. అసహ్యించుకోవడంవల్ల, ప్రతీకారంవల్ల ఏమంచీ జరగదు. ప్రేమవల్ల జరుగుతుంది. "ప్రేమ అన్నిటినీ జయిస్తుంది" అన్న వచనం, ఏదో అనాలోచితంగా మాట్లాడిన వూకమాటగాదు. స్వంతం చేసుకోవడమంటే, అంతా ప్రోగుచేసి పూడ్చిపెట్టడం గాదు. నీవొక కర్పూరపు ముక్కనైనా, "ఓ కర్పూరమా! కర్పూరమా! నిలువిక్కడ - నీవు నాకు కావాలె"— అని ఆజ్ఞాపించు. నిలుస్తుందేమొ. నిలుపుకోలేవు. కానీ, ప్రేమచేత సర్వ ప్రపంచం "నాదే-నాదే" అన్న అనుభూతి పొందవచ్చు. ఒక్క ప్రేమచేత మాత్రమే, ధర్మసమ్మతాధికారం పొందగలం. మానవుడి స్వార్థాశయాలు దాన్ని న్యాయమని పిలి

చినా, తక్కిన స్వామ్యమంతా దొంగతనం, దోపిడి, భగవద్ధర్మ సూత్ర విచ్ఛేదనమే.

ఆ నిరంకుశుడైన 'తైమూర్ లేన్' పర్షియాదేశాన్ని జయించి, తన విజయోత్సవాన్ని తొంభైవేల మనుష్య కపాలాలతో కట్టినసౌధసిఖరంతో చేసుకున్నాడు. 'హాఫీజు' అనే కవిని అతని ప్రసిద్ధకావ్యంలోని ఈక్రిందివాక్యానికిగాను పిలిపించాడు.

Agar an Turk-i-Shirozi, etc.

"ఆ షిరాజ్ టర్కు నా హృదయాన్ని దోచుకుంటే, ఆ తీయని అపహారిణి ముఖంలోఉన్న చల్లని పుట్టుమచ్చకు నేను సమర్ఖండ్, బుఖారా నగరాలు ఇచ్చివేస్తాను."

"నా రెండు మహానగరాలను, నీ ప్రియురాలి కివ్వడానికి సాహసించింది నీవేనా ?" అని గర్జించాడు తైమూర్.

"అవునండీ! అలాంటి త్యాగాలవల్ల నాకేంపోతుంది?"- అన్నాడు ధైర్యశాలియైన కవి.

కవి సత్యం చెప్పలేదు. అసలీవిధంగా చెప్పవలసి ఉంది: ప్రేమకు సర్వార్పణంచేసి నేను, రెండులోకాలూ ఇచ్చేసేటంత మహాభాగ్యవంతుణ్ణయినాను. కానీ, ఓ నిరంకుశ నియంతా! నీవు భాగ్యకాంక్షలో కాలు పోగొట్టుకున్నావు. శాంతి పోగొట్టుకున్నావు. కానీ, నిన్ను సమాధిచెయ్యడానికి కూడా బెత్తెడు చోటులేదు. "మానవుడిభాగ్యం, అతను ఎంత భాగ్యాన్ని పంచిపెట్టగలడో దాన్నిబట్టే నిర్ణయింపబడుతుంది."

ప్రవక్తలకు, ప్రకృతి రహస్యవేత్తలకు, కళాభిజ్ఞులకు, తత్త్వలోకస్వాప్నికులకు ప్రాణం ఒకటే- ప్రేమ. అయితే

కొందరిలో అది ఎక్కువ కనిపించింది. శ్రీకృష్ణుడు, చైతన్యుడు, తులసీదాసు, షేక్స్పియర్, క్రీస్తు, రామకృష్ణ పరమహంస—వీళ్లంతా పరమప్రేమోన్మత్తులు.

విషయవాంఛా విముక్తమైన ప్రేమే ఆధ్యాత్మిక జ్ఞాన తేజము. పాపము! ప్రేమే తత్త్వమసి. చూచినదల్లా పరబ్రహ్మమే యన్న తమనిజమైన జ్ఞానరహస్యాన్ని ప్రజలకు తెలియజేసేటంత ధైర్యము, తేజము భీరువులైన ప్రవక్తలు స్థిరంగా కలిగిఉండలేరు. మానవులు గ్రహాల్లాగా తీవ్రోత్సాహంతో, సత్యసూర్యాభిముఖులై వెళ్లుతారు. ఈ ప్రేమ ప్రదర్శనంచేత, వాళ్లు దైవప్రేరిత ప్రవక్తలవుతున్నారు. కానీ, కొంతసేపటికి మధ్యాద్గామియైన (మధ్యనుండి తొలగిపోవుచున్న) శక్తిలేక ఆధ్యాత్మికమాంద్యము సూర్యుడికి దూరంగా అక్కడక్కడే చుట్టూ పరిభ్రమింపజేస్తుంది. భ్రాంతిబద్ధులజేసి, భిన్న భిన్న విశ్వాసాలనే గ్రహమండలాలకు కట్టివేస్తుంది. కొందరు కేంద్రసత్యానికి ఎంతో దూరంలోఉన్న మండలంలో పరిభ్రమిస్తుంటారు. మిగతావాళ్లు ఇంకాస్త దెగ్గర మండలంలో, అంతకంటే కొంచెం దెగ్గర మండలాల్లో ఉంటారు. ఈ మత సూర్యమండల విధానానికి రాముడు ఆనందిస్తాడు. కానీ, ఎవరు మిడుత విధంగా సమీపించి (ఉప) ఆ జ్యోతిలో తప్పకుండా (ని) పడిపోయి, సర్వస్వాన్ని కోల్పోతారు? (షత్). ఎవరు నీ నా భేదాన్ని, స్వార్థాన్ని, జీవితాన్ని ఆ మహా పరంజ్యోతిలో ఆహుతిచేస్తారు? ఆ ఉపనిషన్మహాజ్యోతిలో అర్పిస్తారు? (తత్త్వమసి) ఆ బ్రహ్మమే నీవు.

నాగరికులారా! మీ విజ్ఞానశాస్త్రాన్ని, కళలనూ, మేము అభినందిస్తాము. కానీ, మరీ వాటికి, ప్రాధాన్యం యివ్వొవద్దు. సర్వప్రపంచ విజ్ఞానాలూ, ప్రేమప్రభువు అనే సూర్యుని చుట్టూ, గ్రహాల్లాగా తిరుగవలసిందే.

భూగర్భశాస్త్రము మానవుడికి చాలాదూరమైన ఖనిజాలనుగురించి, రాళ్ళనుగురించి చెబుతుంది. వృక్షశాస్త్రం అంతకంటేకొంచెంగొప్పవిషయంచెపుతుంది. నక్షత్రశాస్త్రంఎక్కడో ఉన్నగ్రహాలసంగతి చెబుతుంది. శరీరశాస్త్రం మానవుడి ఎముకలసంగతీ, అస్థిపంజరం సంగతీ చెబుతుంది. మన స్తత్వ శాస్త్రం మనస్సునుగురించి వివిధ విషయాలు మాత్రమే చెబుతుంది. అయితే ప్రేమ, మానవుడిలోని పరమసత్యాన్ని గూర్చి, ప్రకృతిలోని పరమ సత్యాన్నిగూర్చి చెబుతుంది. ప్రేమ-కళ. శాస్త్రం కూడా. శాస్త్రపరిశోధనలన్నీ ప్రేమమహా సూర్యబింబంలోనుంచి ప్రేమాగ్ని లోనుంచి లేక అద్వైతానుభూతిలోనుంచి ఉద్గతమైన మిణుగురులే. తేజోణులేశములే.

చిన్నతనంలో ఫ్రాంక్లిన్ గాలిపటం ఎగరవేస్తున్నప్పుడు అతని తండ్రి బెంజమెన్ దూరంలోనుంచి మన్యగాడున్న అయస్కాంతపుసూదిని కనిపెడుతున్నాడు. ప్రతిమలాగా కదలడంలేదు అతని దేహం. అతని దేహానికీ-అతని నిల్చిఉన్న భూమికీ; ఏమన్నా భేదం. కనిపిస్తున్నదా? అతని చుట్టూఉన్న ప్రకృతిలో అతను ఒకటైపోలేదా? అతనొక రాయిలాగాఉన్నాడు. అతని గుండెలచప్పుడు, మహా ప్రకృతియొక్క గుండెలచప్పుడుతో శృతిగల్పుతూవుంది. ప్రకృతిరహస్యాలతనిరహస్యాలవుతున్నవి.

ఆకాశవిద్యుత్తు భూవిద్యుదణువుతో ఏకమవుతున్నది. బహిస్తేజం, అంతస్తేజంతో ఏకమై పోతున్నది.

ప్రేమ లేక అద్వైతం (ఏకత్వం) ఇద్దరి వ్యక్తులమధ్య ఉన్నప్పుడు భేదభ్రాంతి నశిస్తుంది. పరస్పర భావాలు ఏకీభవిస్తవి. వాడి భావమే వీనిది. వీని భావమే వానిదవుతుంది. ఒకరి హృదయగతభావాలు ఒకరికి తెలుస్తవి. సూక్ష్మదృష్టి సుస్థిర సత్యమవుతుంది. పరిస్ఫుటమైన ఋజువు మనకు తేలుతుంది.

"మాలలో ఒకేదారానికిపూలన్నీ గుచ్చబడినట్లు, నేననే దారానికే ప్రపంచం మొత్తం గుచ్చబడింది.

దేనిని ప్రేమింతువది యౌదునీవు
పరమాత్మ ప్రేమింప పరమాత్మ వౌదు
వదిగాక ధూళిని ప్రేమింతువేని
ధూళియేయౌదుపరమ సత్యంబు

ఓహో! మన హృదయాన్నే మనం భుజిస్తే ఎంత బాగుంటుంది! ఎంత మధురభోజనం! దివ్యభోజనం! అంత రుచి దేనికీలేదు. రాముడికి పాలు యీ హృదయాహారానికి ఒక్కొక్కప్పుడు మంచి వ్యంజన మవుతుంది.

ఆకాశమున చంద్రుడున్నాడు పైన,
ఆ చంద్రు జనులెల్ల చూచుచున్నారు.
నేను గ్రోలెదను నీ భూప్రకాశమును
మహాదుత్సవము, గుముల్ గూడిరి జనులు
కాంతి మూలంబైన నీకొరకేను
వేచియున్నాను నే వేచియున్నాను.

వైద్యులువద్దు, భిషగ్వరుల్ వద్దు,
తియ్యగా నున్నది నాకు నా బాధ.

ఓ పౌరులార! ఓనగరంబులార!
శెలవిదే, శెలవిదే, శెలవిదే, శెలవు!
చూపులకందని అతి మాహాత్మ్యస్పష్ట
స్వర్గ శృంగములార! స్వాగతంబోహో!
ఆచారములు! గుణాగుణ తతులార!
సాంప్రదాయములార! ఓ విధులార!
ఓ శాంతి! యుద్ధమా! ఓ హితాహితులు!
బాంధవులార! ఓ బంధంబులార!
ఓ ఆస్తి! కామమా! ఓ మంచి చెడుగ
శెలవిదే కాలమా! శెలవిదే స్థలమ!
శెలవిదే లోకమా! ఓరాత్రి! పగల!

నాప్రేమె పూలు, సంగీతంబు, కాంతి
నాప్రేమె రాత్రి, నాప్రేమయే పగలు
చీకటి, వెలుతురు సర్వంబు నాలో
కరిగిపోయినద హహో! కరిగిపోయినది.

ఎంత అద్భుతశాంతి! ఆనంద మహాహా!
వదలుడీ నన్ను నాప్రేమ నొంటరిగ,
శెలవిదే, శెలవిదే, శెలవిదే, శెలవు.

సిగ్గుతో పెండ్లికూతురు ప్రేమవివశ
ప్రియమున కందించియు కరపల్లవంబు
తల్లిదండ్రులకు బాంధవబృందములకు

అక్క-చెల్లెండ్లకు చెలికత్తెలకును
"వెళ్ళివచ్చెద"నని పలికిన యపుడు
పులకీకృతంబగు తనువెల్ల సఖుడ!
కంఠంబు గద్గద శబ్దంబునొందు

* * * *

స్వాగతంబో ప్రియా! స్వాగతంబోయి:
ఈ ప్రపంచమునకు వెలుగువు నీవు
భగవంతు శుభదృష్టియే, మాకు హితము
కాని, గుర్తుంచుకో యిది తుదియనుచు;
పులకీకృతంబగు తనువెల్ల సఖుడ!
కంఠము గద్గద శబ్దంబునొంద.

వివిధమైన వస్తువులు పెద్దవీ, చిన్నవీ, అందమైనవీ; అసహ్యమైనవీ— ఇవన్నీకూడా ప్రేమను నిరూపించే చిత్రవిచిత్ర లిపే. ప్రేమచిహ్నాలే; నా ఆత్మను గురించి తెలిపే అక్షరాలే; ప్రేమస్వరూపియైన పరమేశ్వరునియొక్క మనోహరచిత్రాలే; మధురాతిమధురమైన పరమాత్మ ధరించిన మనోజ్ఞ వస్త్రాలంకారాలే.

ఓహో! ఎంత చక్క-గా ఉందీ సౌందర్య సముద్రం! ఎంత చక్క-గా ఉందీ ప్రేమసముద్రం! ప్రియుడికి ప్రియురాలి నల్లని ముంగురులుకూడా ఆమె తేజోమయమైన ముఖంలాగే అందంగా ఉంటాయి. రాముడికి రాత్రి ఎంత మనోజ్ఞమయిందో పగలుకూడా అంత మనోజ్ఞమయిందే. బ్రతుకులాగే చావు

కూడా సుఖిస్తుంది. జ్వరమూ, ఆరోగ్యమూ ఒకటే. శత్రు మిత్రులిద్దరూ నాకు సమానప్రియులే.

ఎవని ఆస్తి దొంగిలింపబడిందో, అతనెంత ధన్యుడు! భార్యచేత వదిలిపెట్టబడినవాడు, తదనుభవంవల్ల సర్వైక్య పరమ ప్రేమానుభూతికి వచ్చినట్లయితే అంతకంటే మూడు రెట్లు ధన్యుడు. మహమ్మదీయ సంప్రదాయం ఇలా చెప్పు తున్నది: "అబ్రహాంకు ఒకసారి సముద్రయానం చెయ్యాలని కోరిక పుట్టింది. కైజరు లేక నెప్ట్యూన్ నౌకానాయకుడుగా ఉంటానని విన్నవించుకున్నాడు. మొదటిలో అబ్రహాం ఆలో చించకుండా అంగీకరించాడు. కానీ, తర్వాత ఆలోచించుకొని కైజరును క్షమాపణ అడిగి, ఇలా అన్నాడు. "అన్నా! నన్ను క్షమించు. నా నౌకకు నాయకుడు అక్కర లేదు. ప్రేమ స్వరూపియైన భగవంతుడి హస్తమే నా నావను నడుపుతుంది. నీవు సముద్రప్రభువువైతే తెడ్లు తీసుకో, అది క్షేమదాయకం. నీవు నావను నడిపితే, నీమీద నేను ఆధారపడితే, భగవంతుడి మీద నేను ఆధారపడినట్లు కాదు. నాకూ, భగవంతుడికి మధ్య నీవు నిల్చోవద్దు. నా సహోదరుడైన కైజరు హృదయం మీదకంటే, భగవంతుని వక్షస్థలంమీద నిశ్చింతగా విశ్రమిం చడమే నాకు మహా సంతోషం."

నిర్భయుడైన విరహప్రేమికుడిలా అంటాడు:—

"నిన్ను ప్రార్థిస్తున్నాను. ఓ విద్యుల్లతికా! నీవు మెరి సిపో. ఉరుమా! నీవు గర్జించు. ఝంఝామారుతమా! నీ ఇష్టం వచ్చినట్లు నీవు విజృంభించు. ఓ తుఫానా! స్వేచ్ఛగా రేగిపో.

ఓ, వాయువుల్లారా! ఆరవండి. మీకు నమస్కారాలు, మీకు నమస్కారాలు. ఓ ధన్యమైన ఉరుమా! ఒక్క క్షణం నన్ను కౌగలించుకోవాలని కోమలప్రేమను నీవు భయపెడుతున్నావు. జీవితంలో చేదైనవే ఎంత అనంత మధురంగా ఉన్నవి! ఈ జీవిత విషాదానుభూతుల నే ద్రాక్షపండ్లనుంచి మధురాతిమధురమైన ప్రేమదేవ విరహామధువును మనం పిండుకోవచ్చు!

"ఓ ప్రభూ! నా జీవితము తీసుకొమ్ము
నీకంకితము చేసుకోవోయి ప్రియుడ!
నా హృదాబ్జము తీసుకోవోయి సఖుడ!
నీ ప్రేమలో దాని ముంచెత్తుకొనుము
నా నేత్రముల తీసుకొని వానినింక
పరవశోన్మత్త పూర్ణము సేయవయ్య.
నా చేతులను తీసుకొని నాథ! వాని
మధురమగా నీ సత్యరూపంబులోన
మగ్నంబు చేయువే మత్ప్రభూ! దేవ!"

ప్రియమైన పాఠకుడా! నీకు ఎన్నడైనా ప్రేమలోపడిన కాదు— నిస్వార్థప్రేమలో ఉద్ధరితుడవైన, ప్రేమకు సర్వార్పణం చేసిన మహాస్థితిలో ఉండగలిగిన అదృష్టం లభించిందా? అప్పుడు ఇలాంటి పరిస్థితులను నీ వభినందిస్తావు.

"మృదులమగా నా చర్మమును తీసుకొనియు
నా హృదయంబులో నరములతోడ
చెప్పుల గుట్టించుకోవోయి దేవ!
నీ పదాంభోజములఁ ముద్దాడు కొరకు

తపియించు నా యధరంబులమీద
నడిచిపో ఒకసారి హే జగన్నాథ!
నీ పాద దాసానదాసుగా నన్ను
గ్రహియింపుమో ప్రభూ! గ్రహియింపు మీశ!"

ప్రేమ ధన్యత పొందించలేని, సౌందర్యవంతం చెయ్య లేని ధర్మమేముంది ప్రపంచంలో?

"ప్రభుజీ మైఁ చరన్‌కీ దాసీ"

ప్రేమ ఉన్నచోట ఉచ్చ నీచాలు లేవు, ఎక్కువ తక్కువల్లేవు. ప్రేమతత్త్వం ప్రసరిస్తే, అతి కఠినకార్యం కూడా, స్వర్గసుఖవంతమవుతుంది. స్వార్థమో, ఎంత గొప్పస్థితినైనా అతి భారవంతంగా, దుర్భరాయాస పూరితంగా చేస్తుంది. నీ జీవితం ఎలాంటి పరిస్థితిలో ఉన్నా ప్రేమ దాన్ని మధురం చేస్తుంది. సర్వకష్టాలకు, తుఫానులకు, బాధలకు పరితాపాలకు మూలం ఇది నాది అనుకొనే అహంకృతే. ప్రేమించినప్పుడు వేదనానరకం ఎక్కడఉంది? మన కష్టాలూ బాధలన్నీ ప్రేమ దేవత మనలను లేపి, తన కౌగలింతల్లోకి తీసుకోవడానికి చేసే తొందరలే. మధురమైన ప్రేమ సుమా-యీ కుదిలిస్తున్నది, కదలిస్తున్నది, వీపుమీద తట్టుతున్నది. భగవంతుడు, మధుర మూర్తి హరి, తన అఖండ ప్రేమను కురిపిస్తూ నిన్ను లేపు తున్నాడు.

ఇక లెమ్ము ఇక లెమ్ము ఆ నిస్వసించు
ఎత్తయిన తాళవృక్షముల గలగలలు
విన్నావ? నా హృదయాబ్జమేయిట్లు

నిస్వసించుచునున్న దీవృక్ష తతుల
నీ యధరంబులు ప్రత్యుత్తరంబు
దయసేయు నేమో యటంచు నాయెడద
నీ నేత్రములలోనికిం దొంగి చూచు
ఇంక లే నిద్ర లే ! ఓ మధుప్రేమ !
ఇటుచూడు తలయొగ్గితిని నీ పదముల
లేప్రియా ! నిద్ర లే, నిద్ర లేయింక
విప్పిచెప్పుము నాకు నీ హృదయంబు
నిద్ర లే, నిద్ర లే, నిద్ర లేయింక !
ఆ మహోన్నత హిమాగ్రంబులననుమ
వాని పెంపుకు విసుగేలేదో యేమొ !
నాలోన మండుచున్నట్టి ప్రేమాగ్ని
నా హిమాలయమైన నార్పగా గలదె !
నా హృదంతర వాంఛ తీర్పగా లెమ్మి !
ఇవియె భాగీరథీ దివ్యోదకములు
పొరలి పొంగుచు పారుచున్నవి కాని
ఈ యగాధ నదీప్రవాహంబుకంటె
యోతైనదీ హృదయోద్వేగ నదము,
ఇంక లే ! ఇంక లే ! ఇంక లే లెమ్మి !

## అకారణ భయం

ఒక దమ్మిడీ లేని పిల్లవాడతడు
పోగొట్టుకొన చింత నేమియు లేదు
కాని ఆతనిప్రక్క దొంగలున్నార

లనుచు విన్నంతనే భయమొందినాడు,
పరుగెత్తినాడు విహ్వాలచిత్తుడగుచు
తప్పించుకొన కొండలే ప్రాకినాడు,
పెద్ద గుంటలలోన జారిపడ్డాడు
దేహము గాయాలతో గాసిజెందె
గజగజ వణికి భయాక్రాంతుడయ్యె
కాని ఇదంత వృధాభయంబౌర !
పోగొట్టుకొన వానికడనేమి గలదు ?
ఓ ప్రపంచక మానవుడ ! యదార్థముగ
నీనురవస్థయు, నీ యవివేక
భయమిా విధంబుగానున్నది సుమ్మి !
ఓ భయ భ్రాంతుడా ! ఏల నీభయము ?
'తెలుసుకో నిన్నునీవే' యిదిచాలు
దొంగలున్నారని భయపడవద్దు.
లేలెమ్మ, నిద్రలే, తెలుసుకోనిన్ను !
నిన్నంటగల అపాయం బేమికలదు !
నీ భావమే నిన్ను భయపెట్టుచుండె
తత్త్వమసి ! తత్త్వమసి ! తత్త్వమసి లెమ్మ !

*　　　*　　　*

## అనుభవ జ్ఞానం

సానుభూతి లేకుండా ఎవడు ఒక ఫర్లాంగు నడుస్తాడో, వాడు ప్రేతవస్త్రాలు కప్పుకొని తన స్మశానానికి తనే నడుస్తున్నట్లు.

జ్ఞానమూ, పాండిత్యం ఒకటే అనుకోబడుతున్నప్పటికీ ఒకటికాదు. పాండిత్యం వెనుకకు దిరిగి గతంలోకి చూస్తుంది. జ్ఞానం ముందుకు చూస్తుంది—భవిష్యత్తులోకి.

తరువాత ఏమిజెయ్యాలో తెలుసుకోవడమే విజ్ఞానం. దాన్ని ఆచరణలో పెట్టడమే సుశీలము.

ఆచరణారహితజ్ఞానం వృధాదేహశ్రమ. సంకల్పం క్రియగా, విజ్ఞానం కళగా, జ్ఞానం శక్తిగా మారిన మాదిరి, వివేకం సుశీలంగా మారుతుంది. భావం క్రియారూపం దాల్చ లేనప్పుడు, అక్కడే మానసికాజీర్ణవ్యాధి, నైతిక మలబంధ రోగం బయలుదేరుతుంది. భావాలుమాత్రం ఉండి, కాళ్ళులేని మానవులు, మానసికసంబంధపు జెర్రులుతప్ప ఇంకేమీ గారు.

ఒక అమెరికాదేశపు చతుర రచయిత ఇలా అంటు న్నాడు:—

"నేను మానవులను గురించి ఆలోచించాను. మా మేన మామ అంటుండేవాడు:- 'జనులు తాము ప్రార్థించినవిధంగా ఆచరించకపోతే ఆ ప్రార్థనలుదేనికి?'— అని. 'ఒక విషయాన్ని కావాలంటూ ఊరక పని చెయ్యకుండా కండ్లవెంట బొటబొట నీళ్ళుగారిస్తే ఏమి ప్రయోజనం. ఏడుపువల్ల పని అవుతుందా?' అనిమా మేనమామ చెప్పినదాన్ని నేనెంతో ఆలోచించాను."

బాహ్యాపరిస్థితులకు సరియైన బాధ్యతతో క్షేమశక్తి కలిగి ఉండడమే స్వస్థతకు మూలం. భావానుగుణంగా కర్మ చేయలేకపోవడమే అస్వస్థతాస్వరూపం. "మారు లేక నశించు" ఇదే ప్రకృతియొక్క కఠినశాసనం. ముందుకు పోతున్న కాలా

లతో కలసి నడుపు. అప్పుడే నీవు జీవితసంగ్రామంలో బ్రతక గల్గుతావు. (భారతీయులారా! గుర్తుంచుకోండి.)

అనుభవ జ్ఞానసారమంతా కృష్ణ ప్రవచితమైన యీ సూక్ష్మరక్షణాసందేశంలో ఇమిడి ఉన్నది— "కర్మ చెయ్యడం వరకే నీ వంతు. దాని లాభంతోగాని, ఫలితంతోగాని నీకు సంబంధం లేదు. కర్మఫలితానికి నీవు బద్ధుడవు కావద్దు. లేదా జడత్వానికి దాసుడవౌతావు."

యోగస్థః కురు కర్మాణి, సఙ్గం త్యక్త్వా ధనఞ్జయః
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే.

సమరం చెయ్యి. అది నీ ధర్మం. నిజమైనవీరుడు కర్మను ప్రేమిస్తాడు. అందుకే ప్రేమికు డెప్పుడూ తన మధుర హృదయాన్ని మొద్దుగా చేసుకోడు. రంగంలో చనిపోతావా ఒక వేళ, స్వర్గానికే లేక సత్యానికే నీవు శోభ దెస్తావు. విజయమే చేకూరుతుందా, అప్పుడుకూడా నిజశక్తిని, సత్యాన్ని నీద్వారా ప్రదీపింపచేస్తావు. యథార్థంగా నీవు సంగ్రామంలో నశించే యీ దేహానివి గావు; విజయంకరమైన ఆసత్యమే అయి ఉన్నావు. నీవు నిరంతర విజయమూర్తివే. సత్యాత్మవై, జీవిత శక్తివై ప్రదీపించు.

"హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసేమహామ్,
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయాకృత నిశ్చయః.
సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి.

యదార్థ విషయనిర్ణయం, ఆధ్యాత్మికాభివృద్ధినిబట్టి ఉంటుంది. బాహ్యమైన లాభనష్టాలమీద ఆధారపడిఉండదు. ఓటమి ఎంత శోభావంతమైందో విజయంకూడా అంతే.

"ఓ సంతోషమయుడవైన వీరుడా! నీవీ ప్రపంచమనే క్రీడారంగంలో ఉన్నావు. జయించు - జయించు"

మానవుడి బలం, అతడు ఎన్నెన్ని శోధనలు పొందితే అంత ఎక్కువగా ఉందని ఋజువుపడుతుంది.

"ధాత్రి మృదుత్వమెల్లను కర్కశముగ
మార్చెడు ప్రతికూలమెల్ల రానిమ్ము,
వచ్చెడి ప్రతిబాధ 'కూర్చుండవద్దు'
మరియు నిల్చుండగా వలదింక నడుపు
మనుచు నాజ్ఞాపించుచున్నదో సఖుడ!
సుఖములు, మితిమించు కష్టాలెరాని
శ్రమియింపుమా బాధ లెక్కింపవలదు,
నేర్చుకో, సుస్థిర ధీరుండ వగుము
అతి వేదనలపై నసూయ జూపకుము

నిర్మాణంలేని నిర్మాణము

సదాచార విధానాలు, బూటకపు ప్రసంగాలు అవతలికి నెట్టి అంతరాంతరానుభూతి మీదనే ఆధారపడి చూస్తే మనకొక విషయం కనబడుతుంది. ఈ పెద్దపెద్ద సలహాలూ నీతి సూత్రాలూ, ప్రమాణిక విధులూ, 'ఇది చెయ్యి - ఇది చెయ్యవాకు' అనే శాసనాలూ, ఆజ్ఞాపనలూ, తెలిసిగాని తెలియకగాని తన స్వయం దివ్యత్వంలో సుస్థిరుడుగాని మానవుని

భగవదభిముఖుని చేయలేవు. ఇవన్నీ- ఒక శవాన్ని విద్యుచ్ఛక్తి యోగంచేత - కాస్త కాళ్లూ చేతులు కదిలించిన మాదిరివే, తాత్కాలిక కృత్రిమ సంచలనమే.

"ఏదైనా సరే, బలవంతంగా ఉపయోగింపబడింది ఎప్పటికీ బలవంతమైంది కాదు."

ప్రేమే, గృహనిర్మాణం చెయ్యకపోతే, చేసినవాడి పని అంతా వృథాశ్రమే. "మేధశ్శక్తియొక్క అద్భుతాలే కర్మలోని అద్భుతాలుగా ఉండియున్నవి" అనేమాట నిజము. ఇతర్ల దృష్టిలో అది మహా కష్టపుపని అనుకోబడింది; మేధశ్శక్తికది మంచి వినోదక్రీడగా వుంటుంది.

నేను చేస్తున్నానని లేక అహంకార భావంతో పని చేయడంకంటే ఆ నిర్జీవమైన నిస్సారమైన కర్మను వదలడం మంచిది. కర్మ దానంతటదే నీ ఆత్మలోనుంచి ప్రవహించక పోతే, నీవు పట్టబలవంతానలాగే పని పైపై కనీళ్లుతుడవడమే. స్వార్థాహంకారంతో గుంజబడుతున్న ఇలాంటి నిస్సారమైన జడకర్మనే శంకరుడు బంధంగా వర్ణించాడు.

బజారులో ఒక పిల్లవాడు కులాసాగా ఈలవేస్తున్నాడు. పోలీసులు ఆ పిల్లవాణ్ణి ఈల వెయ్యవద్దన్నారు. పిల్లవాడిలా అన్నాడు, "నేను ఈల వేస్తున్నానా? లేదు ఈల దానంతటదే పాడుకొంటున్నది."

ఒక కృష్ణపక్షినో పావురాన్నో చూడండి. ఒక మహోన్నత తమాల వృక్షాగ్రంలో కూర్చోగానే, ఆ పక్షి కంఠంలోనుంచి దానిఅంతటఅదే తియ్యటి పాటపుట్టుకవస్తుంది.

'అహం' కారాన్ని అనంతత్వంలో కలిపేసెయ్యి. చైతన్యమూ, తేజము, ప్రేమ (సత్-చిత్తు-ఆనంద)తో ఐక్యంగా తక్షణమే ఆ పరబ్రహ్మానందం సుఖప్రదమైన వీరకర్మగా వివేక సౌశీల్యాలుగా నీలోనుంచి పొంగిపొరలి ప్రవహిస్తుంది. ఇదే దైవప్రేరిత జీవితం. ఇదే నీ జన్మహక్కు.

"అతడు తననుండి యెగురు వియత్పథముకు
భాస్కరునిలోన నిల్చి నిష్పాక్షికముగ
సర్వ సృష్టి సమీక్షించి సర్వమంను
ప్రేమ వెదజల్లి దీవించు, విశ్వమెల్ల
బాగుగా నున్నదనుచు సంబరము జెందు."

కాలకొడ్డి.

"ఒకడు తనలో ఆనందం కనుగొంటం కష్టం. కానీ ఇంకొకచోట కనుకోవడం అసలే సాధ్యంకాదు"— అంటాడు స్కోపెన్‌హార్.

మహాకర్మ నిరహంకృతివల్లనే జరుగుతుంది. అహంకృతి వల్ల, నేననే స్వార్థంవల్ల మాత్రం జరగదు. సూర్యుడు తన సహజ ప్రతిభతో సాక్షిమాత్రుడై ప్రకాశిస్తుంటాడు. అంతే— చూడండి! నదులు మంచు ఉయ్యాలల్లోనుంచి విడివడుతాయి. ఉత్సాహంతో మలయానిలాలు నృత్యం సాగిస్తవి. సర్వ ప్రకృతి చైతన్యవంత మవుతుంది. మృగాలు నిద్ర లేస్తవి. మొక్కలు పెరుగుతవి. పుష్పకన్యలు కండ్లు విప్పుతాయి. తళతళమెరిసే సమస్తమానవుల నేత్రపద్మాలుకూడా ఆ సూర్యుని అద్భుత ప్రతిభా సాన్నిధ్యమాత్రంచేత విప్పారుకుంటవి.

ఓ దివ్యుడా! సర్వాత్మగా! -తేజోమూలంగా ఆనంద ప్రాదంగా, శక్తిగా ప్రకాశించడం మాత్రమే నీవు చెయ్యవలసిన పని. జీవమూ, కర్మోత్సాహం నీలోనుంచి నైజంగా పొంగిపొర్లు తుంది. పువ్వు వికసిస్తుంది. సువాసన దానంతటదే వ్యాపిస్తుంది.

ఈతరానివాడు ఎవడైనా సరోవరంలో పడతాడను కోండి. నైజంగా నీళ్లు వాణ్ణి పైకి తేలుస్తాయి. కానీ వాడు గాభరాపడి (శాంతి విడచి) చేతులూ కాళ్లూ ఆడించి, అటూ యిటు తన్నుకోని నిరాశతో మునిగిపోతాడు. అందుచేత, చింత— ఆందోళన— నిరుత్సాహ సంకులంతో కూడిన 'అహం' కృతే మనిషిని ముంచుతుంది అంటారు జలాలిరుమీ.

"వనవాసులగు యూదులకు నిత్య మపుడు
స్వర్గ దివ్యాన్నంబు వర్షించుచుండె,
కాని, క్షమాహీనులౌ హాస్యగాండ్రు
కొందరు త్వరపడి సాహసించియును
ఉల్లిగడ్డల తెమ్మంటంచు వాంఛించి
అంతతో స్వర్గాన్నవర్ష మాగినది."

శిరస్సును బాధపెట్టే దేమిటి? వీపును వంచేదేమిటి? వక్షస్థలాన్ని గిజగిజ లాడించే దేమిటి? పాదాల మీద నడవ కుండా, తలమీద నడవడమే. పాదాలు నేలమీద ఉంచు. శిరస్సు పైన గాలిలో ఉంచు. స్వర్గానందం అనుభవించనీ. దైవాజ్ఞను తల్లక్రిందుగ చెయ్యవాకు. మట్టిని నెత్తిమీద పెట్టు కోని స్వచ్ఛత అనవద్దు. దివ్యమైన సత్యాత్మకంటే బాహ్యవిష యాలకు ఎక్కువ ప్రాధాన్య మివ్వవాకు.

ఒక సామెత ఉంది; ఎవరో ఒక మనిషి కుక్కగొడుగుల కోసమని అడివిలో తిరుగుతూ, కాళ్ల క్రింద దేవదారు మొక్కలు తొక్కుతున్నాడట! ప్రియుడా! ఈ చిన్న చిన్న లాభాల కోసం, నష్టాల కోసం ఎందుకు ప్రాకులాడుతావు? శాశ్వతానందాన్ని (ఆత్మను) ఎందుకు పోగొట్టుకుంటావు? బాధ్యతాభారంతో, విధిచేత బాధింపబడి, దుష్టమైన గౌరవానికి లొంగిన అహంకారమా నిజంగా పనులు చేసేది? గుర్రపు వీపుమీద వాలిన ఈగ గుర్రాన్నీ, గుర్రపు బండినీ తోలుతుందా?

ప్రదీప్తిస్తున్న సత్య పారవశ్యానంద బహిర్గమనపథానికి అహంకారాన్ని అడ్డుపెట్టవాకు. నమ్ము—ఆ దివ్యశక్తిని నమ్ము. దేని సాన్నిధ్యం, యీ అహంకృతిచేత తెలేకుండానే ఈసీ మానవ దివ్యస్వరూపాన్ని పరిణమింపజేసిందో, ఆ పరమాత్మ ఆ దివ్యధర్మం ఇప్పుడు కూడా ఉన్నది. ఆ భగవంతుడు నిద్రపోడు. ఆయనకు మృత్యువు లేదు. పతనభయుం లేనే లేదు.

జలము లెచ్చటి కేగునో, తెలియకుండ
అబ్ధిపై విశ్రమించు విహంగముల వలె
తీర పరమేశ్వరుని యనంతత్వమందు
వ్యాపితార్క నక్షత్రమౌ పరమ సుఖము
పైన మేమహా! విశ్రాంతి బడసినాము.

అమెరికా దేశపు బ్రహ్మచారి (థొరే) ఇలా అంటున్నాడు—

మనము భగవంతుపై భారము నిడు నెడల
ఆతడే నిర్వహించి ఆహ్లాద మిడును
మనమె స్వయముగ జేయ నా పనిని బూన
వదలు పరమాత్మ మనలను ఒంటరిగను.

దుఃఖానికి ఇంకొక పేరు, నిన్ను నీవు పరిస్థితులకు, బాహ్యవిషయాలకు దాసునిగా బద్ధునిగా భావించుకొనడమే. భేదభావ సంజనితమైన నాస్తిక విభ్రాంతులను తుత్తునియలు చెయ్యి. బాహ్య ప్రకృతిని పరిపాలించే ఆత్మ, నీ అంతరాత్మ వేరువేరైనవైతే - ఇంక నీకు వేరేమార్గం లేదు. చేతులు పిసుక్కొని, తల వ్రేళ్ళాడవేసుకొని నిరాశాంధకారంలో వినాశంగావడమే. ఒకవైపు నీవు బాహ్యపరిస్థితులచేత చుట్ట బడ్డట్లు కనబడతావు. ఇంకొకవైపు నీవు ఆ బాహ్యపరిస్థితులు గానే కనబడతావు. అద్దం నా చేతిలో వున్నది. నేను అద్దంలో వున్నాను.

"తలుపుపై ఎవ్వరో తట్టినట్లయ్యె
గట్టిగా తట్టిరి వింటినా దెబ్బ.
ఎవ్వరు ? ఎవ్వరా తట్టుచున్నారు ?
అని కేకవేసితి, ఆశ్చర్యపడుచు
అహా ఎంత మృదుమధురంబుగా 'ప్రేమ'
చెవిలోన నుడివెను మెల్లగా "నీవె
తట్టుచున్నది నీవెరుంగవా" అనుచు ?

ముసల్మాను శాస్త్రాలయొక్క యదార్థవ్యాఖ్యానం ప్రకారం, అర్కేన్ జెల్ కూడా ( Archangell ) మానవుల్లో

పరమేశ్వరుణ్ణి గుర్తించ లేకపోవడంవల్ల నరకంలోకి విసరబడ్డా డనిన్నీ, మరి మహాపాపులుసైతం ( CF. Alastu Oalu-dala, cte. ) మానవుడిలో (అ హ మ ద్) భగవంతుణ్ణి (అహద్) చూచి స్వర్గాన్ని అధిరోహించారని తెలుస్తూవుంది.

"మహాత్మా సర్వభూతాని-నా ఆత్మే అందరి ఆత్మ" అనే దివ్యసత్యాన్ని అనుష్ఠానంలో చూపడమే. నిజమైన క్షేమదాయక మైన యిస్లాం (శ్రద్ధ).

అది వట్టి నమ్మకం అని పిలవడం సరిగ్గాలేదు. ఇదే "మహావిజ్ఞానం" (లేక వేదాన్తము, జ్ఞానము). ఇదే కళలకు కళ.

ఇది సత్యం అవునాకాదా అని తెలుసుకోవడానికి మార్గం-"దీన్ని ఆచరింపగలమా? మన జీవితాన్ని దానికి ఒప్పజెప్పగలమా?" అన్న పరీక్షే అని డాక్టర్ డి. యస్. జార్డన్ అంటాడు.

సర్వదృశ్య జగదంతరమైయున్న ఈ సత్యానికి నీవు నిరపాయంగా జీవితం ఒప్పజెప్పవచ్చు:— "నేనూ నా తండ్రి ఒకటే." "తత్త్వమసి."

గురుత్వాకర్షణ ధర్మమైనా, మీ విశ్వాసాన్ని మోసం చెయ్యవచ్చు కానీ, ఆధ్యాత్మిక ఐక్యతాధర్మం మిమ్మలను ఎప్పుడూ మోసం చెయ్యదు. ఈ ఏకత్వానుభూతి పొందు. ఈ సమస్తసృష్టి, నీ స్వశరీరంగా ప్రవర్తిస్తున్నట్లు నీవు కనుగొంటావు. ఓ విభ్రమితామృతమూర్తీ! ఈ వెండి బంగారాలు, ఈ సిరి సంపదలూ నీ జీవితానికి భద్రత యివ్వలేవు. ప్రాణానికి ప్రాణం యిస్తున్నది నీవే సుమా! వెండి బంగారాలకు

కాంతి ప్రసాదిస్తున్నది నీవే సుమా! తారా చంద్రసూర్యమండలాలకు నీవే సుమా తేజో ప్రదాతవు!

ప్రజలు త్వరగా ముందుకు పోరు; ఎందుకనుకున్నారు. బాహ్యాభిప్రాయాలు, లోకాచార వ్యవహారాలు, వస్తు సముదాయాల యొక్క దుర్భర భారం, ఆ మహోగ్ర హిమవత్పర్వతాల మాదిరి వారి వీపుల మీద (కాదు- గుండెలమీద) కూర్చున్నవి. అందుచేత ఒక్క అడుగైనా ముందుకు వేయలేరు. కల్మష భ్రమలనుంచి బయటపడు. ఖండభావంనుంచి విడిబడు. ప్రపంచం తనలోకి ఎప్పుడు వచ్చినా సరే, దాన్ని కరిగించి వేసే ఒక మధువు నీ మనస్సులో ఉండాలె.

జ్ఞానమనే (ఆత్మజ్ఞానము) విశ్వద్రావకంలో జగత్తు ద్రవించిపోతుంది. కానీ, జ్ఞానం ఎప్పటిమాదిరి స్ఫటికస్వచ్ఛంగా ఉంటుంది. నీవు సరిగా విచారిస్తే, స్వర్గాలు రాలిపోతున్నా, భూమండలం బీటలు వారుతున్నా, అవి నీ పురోగమనానికి పాడిన సంగీతమే అవుతుంది. శత్రువనేవాడు ఎప్పుడూ నిన్ను చూడలేడు. నీవు శత్రువనే వాడిని చూడడమే ఉండదు. అసలు ఆ శత్రుభావమే నీలో పుట్టలేదు.

సంగీతంలో కారణ కార్యక్రమ ప్రకారంగా నాదాలు ఒకదానివెంట ఒకటి పరుగెత్తుకుంటూ వస్తాయి. ఒక్కొక్క నాద ఖండాన్ని పరిశీలించడంవల్ల శృతి తెలీదు. కానీ అన్నింటినీ కలిపి వినడం వల్ల లోతైన ఒక అనుభూతి కలిగిన శృతి తెలుస్తుంది. ఈ అనుభూతే, ఈ గాఢోద్రేకమే సంగీతాని కంతటికీ మూలకారణం.

(10)

కాబట్టి, ప్రకృతి దాని ఉపరిభాగ ధర్మాలవల్ల బాహ్య కారణాలవల్ల వ్యాఖ్యాతం కాదు. అది "మానవుని దేహానై నప్పుడే" తెలియబడుతుంది.

సర్వం నీవే అనే అనుభూతి లేకుండా, నీవు సర్వాన్ని తెలుసుకో లేవు.

సత్యంలో కలిసిపోవడం నామరూపాలను అతిక్రమించడం, అరణ్య భూ కేదార ప్రదేశాల్లో, పర్వత నదీనదాల్లో దివారాత్రాల్లో, మేఘాల్లోకి తారల్లో స్వేచ్ఛా విహంగంవలె కలిసిపోవడం, సర్వమానవుల్లో పశుపక్షి మృగాదుల్లో; దేవతా సమూహాల్లో సర్వాత్మగా ఏకంగావడమే జీవితం. ఇదే జ్ఞానం. ఇదే అనుభవ జ్ఞానం.

ఎవడు ప్రపంచ మంతటితో ఒకటి అవుతాడో, అతనితో కలిసి ప్రపంచమంతా పనిచేసి తీరాలె.

కారణరంగంలో పరిజ్ఞాతమైన జ్ఞానం (అనుభవసత్య జ్ఞానము) పొంగిపొరలే ప్రేమ అవుతుంది. అంటే సర్వులతో సమస్తంతో ఏకత్వానుభూతి; ప్రదీప్త సూర్యునివలె ఏ ఫలాన్వేషణ చెయ్యని, లాభమర్థించని నిష్కామమైన పారవశ్యానంద మవుతుంది. (అందుకనే మానసికరంగంలో ఆ జ్ఞానం 'పరిత్యాగం' అవుతుంది.) ఇంకా ఆ జ్ఞానమే భౌతికరంగంలో అద్భుత సామర్థ్యము - శక్తివంతమైన మహాకర్మ స్వరూపం తాలుస్తుంది.

అందుకే, జ్ఞానాన్ని, కర్మలో ప్రేమద్వారా వైరాగ్యాన్ని (త్యాగాన్ని) తెలుసుకో.

"నాకు మార్పులు లేవు, భయమృతుల్ లేవు
నేనెప్పుడును పుట్టుటనునది లేదు
నాకారయను తల్లితండ్రులే లేరు
పరిపూర్ణజ్ఞాన స్వరూపుండ నేను,
నేనఖండామృతానంద రూపుడను
ఓం! అహంబ్రహ్మాఽస్మి! తత్త్వమసి! అహాహా!

ఏను శోకంబునుగూర్చ నెప్పుడును
మరి. నాకు నైతము దుఃఖంబు లేదు,
నాకు శాత్రవుడను వాడెందు లేడు
మరి నేను శాత్రవుడను కానుకాను.
పరిపూర్ణ జ్ఞానస్వరూపుండను నేను,
నేనఖండామృతానంద రూపుడను
ఓం! అహం బ్రహ్మాzస్మి! తత్త్వమసి! అహాహ

నాకు రూపము లేను, పరిమితి లేను,
స్థల కాలములకు నతీతుండ నేను,
నేను సర్వంబునందధి వసించెదను
సర్వంబు నాలోన నధివసించెడిని
వాసుదేవుడ నేను వాసుదేవుడను

సర్వ విశ్వానంద రూపుండ నేను.
నేలేని స్థలమేది ! నే సర్వమయుడ'
పరిపూర్ణజ్ఞాన స్వరూపుండ నేను.
నే నఖండా మృతానంద రూపుడను !
ఓం ! అహంబ్రహ్మాఽస్మి ! తత్త్వమసి ! అహాహా

నే నిరాకారుడను నిర్వికారుడను,
ఇంద్రియంబులు మరి ఇంద్రియంబులకు
కానవచ్చెడి పదార్థంబులే గాను
నేనఖండామృతానంద రూపుడను,
పరిపూర్ణ జ్ఞానస్వరూపుండ నేను !
ఓం ! అహం బ్రహ్మాఽస్మి ! తత్త్వమసి ! అహాహా

పాపంబు నేగాను, పుణ్యంబుగాను
దేవాలయముగాను, పూజలుకాను
యాత్రలు నేగాను, గ్రంథముల్ గాన
పరిపూర్ణజ్ఞాన స్వరూపుండ నేను
నేనఖండా మృతానంద రూపుడను,
ఓం! అహంబ్రహ్మాఽస్మి ! తత్త్వమసి ! అహాహా

నా యెదయను పవిత్రాలయంబందు
ప్రేమ మహాజ్యోతి వెలుగుచున్నయది,
దృశ్యకంపముల లక్షింపకుండ
ప్రేమపుష్పము శంకలేక స్వేచ్ఛగను
పరిమళ గంధముల్ వెదజల్లుచుండె

ఉత్తుంగ పరవశానంద మందు
ఎడ తెగకుండగా పొంగెడిజలలు
ధగధగ మెరయు దివ్యతేజమున
ప్రవహించుచున్నవి ధారలై లేచి,
ఓం ! అహం బ్రహ్మాస్మి ! తత్త్వమసి ! అహాహా

ఎవ్వరో వాకిలి తలుపులు తట్టుటను
ద్వారంబుకడ నొక చప్పుడు వింటి
"ఎవరది ?" అని నేను కేకవైచితిని
ఆశ్చర్యపడుచు నే నిలుచుంటినపుడు
మెల్ల మెల్లగ లోని కరుదెంచి ప్రేమ
మెంతయో మృదుమధురంబుగా ననియె
"తలుపు తట్టినది నీవేకదా యిపుడు,
తెలియదా నీకది" అనిన నేనంటి
ఓ ప్రియా; మధురాత్మ ! రారమ్ము నాథ !
చిరునవ్వుతో, శుభవీక్షణంబులతో
పాడుచు, ఆడుచు రావోయి దేవ !
రావోయి రావోయి కౌగలించుటకు
అని నేను నిట్టూర్పులిడి నతిసేయ
అతడు ప్రత్యుత్తరం బివ్వక నిలచె.
ప్రార్థించితిని, నేను సాష్టాంగపడితి.
మారుమాటాడక వెళ్ళినాడతడు.
"ఎందుకు నాయెడ తరిగెదవళ్ళు ?
దయచేసి నిలువుము పోబోకు" మంటి

"పిలులే"దని మెల్లగా చెప్పెనతడు.
"ఓ ప్రభూ ! నాచెంత కూర్చో" మటంచు
ఎంతయో బ్రతిమిలాడితి నాతడనియె :
"నీవు నాప్రక్కన కూర్చుండువేని
నీప్రక్క నప్పుడు కూర్చుందు నేను"
నేను : "నాతోడ మాట్లాడుమా సఖా !
ప్రియుడ"
ఆతడు : "గాఢమానంబులో మునిగి
పోయిన్నావు."
నేను : "నిను కౌగలించియు ముద్దాడు
కొనెద;
ప్రియతమా ! ఈఒక్క ప్రార్థన వినుము."
"నినునీవె ఆలింగనము చేసుకొనియు
ముద్దాడు కొనవలె. నేను నీవొకటె,
పొరపాటు పడుచుంటివేల నీవిట్లు ?"
"నీ ప్రతిమే నాదు దివ్యరూపంబు.
ఓ సర్వ సౌందర్య మూలమా ! ఏల
నీరూపమును నీవు వెతుకుచున్నావు ?
నీతోడనే నేను శయనించుచుంటి.
నీవెచ్చటో బైట వెతకుచున్నావు,
నన్నట్లు నిర్లక్ష్యముగ చూడవలదు.

ఎచ్చోటనో పోయి వెదకు టెందులకు ?"
నాకొక మంచి సంసర్గంబు గలదు,
అందరిలోనుండి నేజూతు, విందు
నాప్రియా ర్ద్రాంగి యా మృదులానిలంబు,
వర్ష వాయువులను రుచిజూతు నేను
నేనవ్వ గుసగుస బోవు నాకులకు
పరమానురాగంబు, ఎంతయో కరుణ,
పూవుల పెదిమలు నాకతి ప్రియము
స్వర్గాలు నాకు స్వాగత మిచ్చుప్రీతి
తృణములు సైతము స్వాగతమిచ్చు.



౭౦.

# యజ్ఞహృదయం

బ్రహ్మ మహా యజ్ఞభూమియైన పుష్కరతీరంలో ఉన్నప్పుడు, రాముడికి ఒక ఉత్తరం వచ్చింది. అందులో జాతీయైక్యత తేవడానికి, పురాతన యజ్ఞకర్మలు పునరుద్ధరించడం యొక్క అవసరాన్ని గురించి; రాముని అభిప్రాయం అడుగబడింది. ఆ ఉత్తరం ఈ క్రింది పద్యాన్ని స్మృతికి తెచ్చింది.

"అతి ఘన శీలంబునకు పేరు లేదు
శ్రేష్ఠ పవిత్రత లజ్జగా దోచు
సత్యమైనట్టి విజ్ఞానంబు సచివ!
అంత నమ్మకముగ కనబడదోయి
అత్యంతమగు మంచితనము చూచుటకు
అతి వింతగా నుండు క్రొత్తగానుండు
సతత ముందునదల మారని మార్పు
అతి పెద్ద శబ్దమెప్పుడు వినరాదు
అతి పెద్ద వస్తువునకు రూపు లేదు."

సూర్యుడు బొంబాయి మామిడిచెట్లకు "నేను హిమశిఖరాగ్రాలమీద కేదారవృక్షాలకు యిచ్చిన మాదిరి వేడి, వెలుతురు మీ కివ్వను. మీరు కూడా ఆ మనోహర పర్వత వృక్షాలంత పెద్దవిగా పెరగాలి." అని చెబితే, ఇంక బొంబాయి

మామిడిపండ్లు ఉండవు. తోటలో సీమరేగిచెట్లమీద ప్రస రించే సూర్యతాపం మీద కలువపుష్పాలు బ్రతకడం లేదు. షేక్స్పియర్, న్యూటన్, స్పెన్సర్ మొదలైనవాండ్లు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్ మొదలయినవారి జీవిత సంఘటనలతో జీవించలేము. అందుచేత, మన సమస్యలు మనమే పరిష్కరించు కోవాలె. గతించిన మన పూజనీయులైన పూర్వ ఋషుల కండ్లతో తొంగిచూడ్డం మాని, మన స్వంత కండ్లతో చూడ్డం మొదలుపెట్టాలె.

ప్రతి శాసనం (స్మృతి) "నిన్ను మేము యిలా యిలా ఒప్పుకొన్నాము. అయితే, ఇవ్వాళ్ల మీరీ విషయాన్ని గురించి ఏ విధంగా ఆలోచిస్తున్నారు?" అని చెప్పడానికి నిల్చొంటుంది. ప్రతి సంస్థా, మన స్వంత బొమ్మతో ముద్ర వేసుకునే ఒక నాణెం. త్వరలో అది రూపుమాసి పోతుంది. కొంత కాలాని కది టంకసాలకు రావాలె. ప్రకృతి గొప్పదనం నిరంతర విక ల్పనం (పరిణామం) లో ఉంది. జీవితంయొక్క నిరంతర స్థితి మారని మార్పే.

జరిగిపోయింది భవిష్యత్తుగా, భవిష్యత్తును గతంగా ఎంచుకునేవారి జీవితం మాత్రం జాలి కలిగిస్తుంది. ఈ క్రింది ప్రసంగంలోని ప్రతి విషయం నిరూపించడానికి గీతా, మను స్మృతి, శృతులనుండి అనేక ఉదాహరణాలివ్వవచ్చు. కానీ, అది బుద్ధిపూర్వకంగా నిరాకరింపబడింది. ఎందుచేతనంటే- అవి వట్టి నిస్సారమైన మాటల్లాగా ఉంటాయి కాబట్టి. అందులో అనేకం భిన్నమైన ప్రతులు కనిపిస్తాయి గనుక. అంతేకాకుండా

దానివల్ల అక్రమ విద్యావిధానాన్ని ప్రోత్సహించిన మహా
పాపం చుట్టుకుంటుంది. అలా చేయడం సత్య విషయ పఠనాని
కంటే, పుస్తకాలు చదవడానికి ఆధిక్యత ఇవ్వడమే.

మహాత్ముడైన శంకరుని మహాదోషం తన తేజాన్ని
తెరచాటున దాచడమే. తన స్వానుభవజ్ఞానానికి సంబంధించిన
సత్యనిరూపణాకార్యానికి, వెనకటి గ్రంథాలను పీడించడంలో
ఎందు కాయన కాలం వృథా చేయడం? ఇతర్లు వచ్చి, ఆ నిస్స
హాయ వాక్యాలనే తీసుకోని, ఆ గ్రంథాలనుండే బలవంతం
మీద వాళ్ల వాళ్ల స్వంత అర్థాలు గుంజారు. ఈ అర్థవంత
ప్రయత్నం వల్ల సత్యగమనం అధిక వేగం గావడానికి బదులు
స్తంభించింది. దాన్నే స్పష్టంగా చెబితే— ప్రస్తుత భారతదేశ
కష్టాలకు కారణం, ప్రకృతి విధానాన్ని తలక్రిందుచేసి జీవ
దాత్మను పురాతన గ్రంథ పిశాచానికి బానిసగా చేయడమే.
పవిత్ర శృతిమాత శోకనీయస్థితికి తేబడింది. ఆమె కుమారు
ల్లోనే ఒకడు వచ్చి ఆమె సుందర శిరోజాలు ఒకవైపు లాగు
తాడు; ఇంకొకడు ఇంకో వైపు; మూడోవాడు ఆ వెంట్రుకలు
బాగా లంకించుకోని ఇంకొక వైపు గుంజుతాడు. ఆ విధంగా
ప్రతివాడూ యిష్టం వచ్చినట్లు తను చెప్పదలచుకొన్నదాన్ని
కలుషితమైన ప్రవర్తనాసత్యాన్ని నిలబెట్టడానికి శ్రుతిపేరుతో
బోధిస్తాడు. ఓ భారతవర్ష సనాతన మహర్షులారా! తపస్వులారా!
మీ కుమారులు వారి అవసర వాంఛలకు ప్రస్తుత పరిస్థితు
లకు సంబంధించిన సమస్యలు, అవ్యవహారిక భాషాసంబంధ
మైన వ్యాకరణసూత్రాలచేత పరిష్కరించవలసిన గతిపట్టిందా?

ప్రియులారా! ధర్మాలు (Laws), సంస్థలూ మానవుడి కోసం; మానవుడు-ధర్మాలకోసం, సంస్థలకోసం కాదు. "భాష్యం (మతశాస్త్రాల మీద వ్యాఖ్యానం) వల్ల, భవిష్యత్తు గతంతో గట్టిగా ముడి వేయబడిం"దని కొందరంటారు. ఎంత పొందికగా ఉంది- పైకిచూడ్డానికి ఎంతబాగుందీభావం! ఐతే ఆపాతగుడ్డలకు ఇదివరకే ఎన్ని అతుకులు పెట్టాం? ఎన్ని కుట్లుకుట్టాం ? సత్యానికిరాజీ అక్కరలేదు. సకలప్రపంచమూ, సూర్యుడుచుట్టూ తిరగాలసిందే; సూర్యుడు ప్రపంచంచుట్టూ తిరగవలసిన పని లేదు. భూతకాలాన్ని భవిష్యత్తుతో ముడివేయడానికి, క్రైస్తవ బైబిలు లేక భాష్యాలు వ్యాఖ్యానాల్లాంటి గ్రంథాల్లోని హేతురహిత సిద్ధాంతాలతో, విజ్ఞానశాస్త్ర పరిశోధనలు, కలపవచ్చా ? భగవదావిర్భూతాలైన పవిత్ర శృతులను (మూలగ్రంథాలను) స్వయంగా మాట్లాడనివ్వండి. న్యాయాధిపతియొక్క నిష్పాక్షికత్వం నటిస్తూ, న్యాయవాదియొక్క దుష్కపట తంత్రాన్ని అభ్యసించే, వ్యాఖ్యాత-లేక స్వయం నిర్ణేత ప్రవక్తచేత, తన అర్థం బహిరంగం చేయబడిందాకా, వేలసంవత్సరాలు లోకం సందిగ్ధావస్థలో ఉక్కిరిబిక్కిరి అవుతూ ఉండేటట్లు చేయడానికి, భగవంతుడంత దుర్జనుడనుకున్నారా? ఆయనకు చాలినంత మంచి ఉంది! ప్రమాణం పరమ సత్యాన్ని నిలబెట్టగలదా? సూర్యుణ్ణి చూడడానికి, చిన్న దీపం కావాల్నా ? ఒక చిన్న గణితసూత్ర సత్యం, క్రీస్తు, మహమ్మదు, జొరాస్టరు అందరూవచ్చి దానికి దృష్టాంతరం యిస్తే, రవ్వంతైనా ఎక్కువ మారుతుందా ? రసాయనిక

సత్యాలు, నేరుగా పరిశోధనల ద్వారా తెలుసుకుంటాం. అలా కాకుండా; వాటిమీాది అంధవిశ్వాసం, బుర్రనిండా కుక్కడం మేధస్సును అణిచివేసే పాపకార్యం. "నిన్నా, యివ్వాళ్ళా, ఎప్పుడూ" మారక ఒకేమాదిరిఉన్న పరమ సత్యాన్ని, ఒక ప్రత్యేక సంఘటనతో వేరుగా భ్రమించవాకు. ఒక విషయాన్ని మనం ప్రమాణంమీాద నమ్మినట్లు, సత్యాం సత్యంలోనే తెలుసుకోబడుతుంది. వేదాంతానికి, ప్రమాణం వాదనకూడా కావాల్నా ? ఎందుకు ? దాని అర్థం తెలుసు కుంటే చాలు. అదే దానికి నిర్వివాదమైన ప్రమాణం. తన ఆకర్షణీయత బుజువుచేసుకోవడానికి, సౌందర్యానికి బైటి సిఫా రుసు లక్కరలేదు.

సోమరినిద్రను ఇంకాస్త దీర్ఘం చెయ్యడానికి సమ్మో హన గేయాలు, కాదు తియ్యటి జోలపాటలు పాడడంవల్ల, అజ్ఞానప్రజల హాస్యానికి చక్కిలిగింత పెట్టడంవల్ల, లేక పొగడ్త లనే అజ్ఞానంవల్ల, పెద్ద అనుచరుల గుంపును సంపాదించడం కష్టమైన పనికాదు. కానీ; పరమసత్యమే సత్యం. ఈ చరాచర స్వరూపాలు మిథ్య. ఈ దృశ్యస్వరూపాలకోసం, సత్యాన్ని వదిలిపెట్టేవాడికి శోకం తప్పదు. సత్యం, తన స్వేచ్ఛాప్రకారం బ్రద్దలవుగాక ! పరమ సత్యభానుడికి బాగా తెలుసు - ఎట్ల ఉదయించాలనో. ఉరుముతూ, గర్జిస్తూ, ఫిరంగిగుండ్ల సంగీ తంతో ఈ దీర్ఘదీర్ఘ నిద్రను ప్రకంపిస్తూ ప్రభేదిస్తూ, సత్య ప్రస్థా నయాత్ర చేస్తుంది గాక ! నేనే పరమసత్యాన్ని, శరీరాధిక్యత కోసం, నేను ఆత్మహత్య జేసుకోను.

సరే యిప్పుడు యజ్ఞాన్ని గురించి, స్వతంత్రంగా, నిష్పాక్షికంగా, వివిధ దృష్టులతో తర్కిద్దాము.

యజ్ఞానికి ముఖ్యలక్షణం హవిస్సు. ఈనాడు దీన్ని గురించి సామాన్యంగా యిలా అంటారు. హవిస్సు గాలిని నిర్మలం చేస్తుంది. అందమైన పరిమళాన్ని యిస్తుంది. ఈ విషయం చాలాదూరంగా ఉంది. ఇతరమైన మధుర పరిమళాల్లాగానే, ఈ పరిమళాలు అంతర్భావాలను రంజింపజేస్తాయి. ఉద్రేకమిచ్చే యీ మధుర పరిమళాలు, మన శక్తిని తీసుకుంటాయి. కాని, తీసుకున్న అప్పును మళ్ళీ తిరిగి యిచ్చెయ్యవు.

అందమైన వాసన, హవిస్సులోనుంచి కొద్దిగా మాత్రమే వస్తుంది. కానీ, ఎక్కువగా వచ్చేది . బొగ్గుపులుసు వాయువు. ఇది అపాయకరం.

ఒకప్పుడు భారతదేశంలో జనాభాకంటే ఎక్కువ అడవులు వుండేవి. ఆరోజుల్లో ఘృతం మొదలైన పదార్థాలు ఆహుతి చెయ్యడంచేత వచ్చిన కార్బన్ డయాక్సైడు సస్యాలకు సహాయం చేస్తే చేసివుండవచ్చు. కానీ, వాతావరణంలోని సహజమైఉన్న బొగ్గుపులుసు వాయువులాగా చెయ్యలేదు.

ప్రపంచం యిప్పుడు మారింది. జనసంఖ్య అభివృద్ధి అయింది. ఇప్పుడు వాతావరణంలో కావలసినంత 'కార్బన్ డయాక్సైడ్ ఉంది. ఇది మానవులను సోమరులను చేస్తుంది. ఇండియాకు ఎక్కువ ప్రాణవాయువు కావాలి యిప్పుడు.

హవిస్సును వ్రేలిస్తే, ఏ రసాయనిక ఫలితాలు వచ్చాయో, మానవజగత్తుకు అన్నసంతర్పణ చేసినా ఆ రసా

యనిక ఫలితాలే వస్తాయి. కృత్రిమమైన అగ్నుల్లో ఎందుకు విలువగల నేతిని వ్రేలుస్తారు? ప్రాణాలుండికూడా ఆకలితో మలమల మాడిపోతున్న ప్రత్యక్ష దరిద్రనారాయణుల జఠరాగ్ని కుండంలో పట్టెడు అన్నమైనా ఆహుతి చెయ్యరెందుకు? ఈ హోమము భరతవర్షంలో ఎక్కువ అవసరమైయున్నది.

ఇంకోసంగతి ఒకరోజున కొన్ని వేలమంది ప్రజలకు అన్నంపెడితే ఏమిలాభం. ఈరకమైన వివేచనలేని దానం గౌరవనీయులైన బిచ్చగాండ్ల సంఖ్యను వృద్ధిచేస్తుంది; అంతే. హిందూదేశంలో యీ దుఃఖం ఎందుకు వున్నది? వివేచనలేని దానంవల్ల ఉన్నది. ఒక ఫ్రెంచిరచయిత దానాన్నిగురించి యిలా అంటాడు. "దానం ఎంత సుఖాన్ని కలిగిస్తుందో అంత దుఃఖం కలిగిస్తుంది. ఆ కలిగించిన దుఃఖాన్ని తీసివెయ్యలేదు" దానాన్ని దాని ఉద్దేశ్యాన్నిబట్టి నిర్ణయించగూడదు. ఫలితాన్నిబట్టి నిర్ణయించాలి. దుర్బల మానసుడైన యాత్రికుడు ఒక సోమరి యాచకుడికి కాస్త బిక్షంబెట్టి, పరలోకంలో తన భద్రతకు ఏదో చేశాననుకుంటాడు. అయితే, కావచ్చు; ఇక్కడ జాతిని నాశనంచేయడానికి ఏదో కొంత చేశాడనడంలో సంశయంలేదు.

మన సమస్య సక్రమమైన యజ్ఞం ఎలా చేయడమని- దరిద్ర ప్రజాసేవ విజయవంతంగా ఎలా నెరవేర్చడమని— అన్ని దానాల్లోకి మహత్తరమైన దానం జ్ఞానం. ఒక్క రోజు అన్నం పెడతావు. రేపటికల్లా మళ్లీ వానికి ఆకలవుతుంది కదా!

దరిద్రుడికి బ్రతికే విధానం నేర్పు. బ్రతుకును సక్రమంగా బ్రతికే విధానంగా ఉండాలది. చెప్పులు కుట్టే విధానమైనా సరే అది అవసరమే.

హిందూదేశంలో నివసించే ప్రతిమనిషీ, తనకంటే గౌరవంలో, భాగ్యంలో, జ్ఞానంలో, శక్తిలో తక్కువైన ప్రతి వాణ్ణీ, తనపిల్లవానిలాగా నిస్వార్థప్రేమతో చూడాలె. తల్లిలాగా ప్రేమించాలె. ఆత్మకు ఆహారం యివ్వాలె. ఉత్సాహం, జ్ఞానమూ, ప్రేమయివ్వాలె. ఇదే మహానిష్కామ యజ్ఞం.

భారతదేశంలో కర్మకాండచరిత్రనుగురించి మరియొకసారి చెబుతాను. ఆ వెనుకటి మంచిరోజుల్లో, సంఘం ఎలావుందో చూచారా? అప్పుడు కృత్రిమత లేదు. ఇంకోచోట శరణ్యం తీసుకోవలసిన అవసరంలేదు. ఇప్పుడు కాశ్మీరంలో మాదిరి ప్రతిచోట ఫలభాగ్యం ఎక్కువగాఉండేది. అమెరికన్ యిండియన్లమాదిరి నగ్నంగాబ్రతికేవారు. చెట్లనీడల్లో, గుహల్లో నివసించేవాండ్లు. వారిఅంతర్బాహ్యాశక్తులు, ఇంకొక వెలుపలి మార్గం లేకపోవడంచేత, దేవతలను గురించి, యజ్ఞాలగురించి ఆలోచించేవి. యజ్ఞాలన్నీ దేవతలతో పరిచయాలుమాత్రమే. వాటిల్లో దాస్యభావంలేదు. ప్రకృతిశక్తులతో సమానతపొందడమే వాటిఅర్థం. రూపకల్పన చేయబడిన ప్రకృతితో ఒక రకమైన వ్యాపారం చెయ్యడంఅది. కానీ, వాటిల్లో యిచ్చి పుచ్చుకోవడం ఉన్నప్పటికీ, యిప్పటివర్తక తత్వంలేదు.

వానలు కావాలంటే యీ యజ్ఞంచెయ్యి. సంతానం కావాలంటే యీ యజ్ఞంచెయ్యి. భాగ్యంకావాలంటే. యీ యజ్ఞంచెయ్యి. ఇలాఉండేవి యజ్ఞాలు యిదివరకు,

ఈ రకంగా ఇష్టాలమీదనే ఆధారపడి ఉండేవి. యజ్ఞాలుచేయడం. కానీ, రానురాను, అది ఒకఆచారమూ, సాంప్రదాయంగా స్వయం విధితఋణబంధంగా తయారయింది.

తరువాత, హిందూదేశ చరిత్రలో, ఆ ఆదికాలయజ్ఞ కాండస్థానంలో పౌరాణికకర్మకాండ వచ్చికూర్చుంది. మహా భారతయుద్ధం మార్పులు తెచ్చింది. జాతిలో మత విప్లవాలు; రాజకీయ విప్లవాలు వచ్చాయి. దేవతలనుగురించిన అభి ప్రాయాలు మారిపోయినవి. భౌతికఅవసరాలు ఎక్కువ అయి పోయినవి. ప్రజలు యజ్ఞాలకు కాలం వృధాపుచ్చరింక. కర్మ కాండలోమార్పు వచ్చింది. ఈ చారిత్రకమైన మార్పునుబట్టి చూస్తే, మనకొక విషయం తేలుతుంది - ఇప్పుడుకూడా మన ధర్మం చెడకుండా, కర్మకాండలో అవసరమైన మార్పులు చేయవచ్చు - అని.

రాముడు, ఇలా అంటాడు. స్మృతి(ఆచారనియమాలు) కర్మకాండలు మారుతాయి. కాలాన్నిబట్టి మారుతాయి. మారడమేకాదు, ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఉంటాయి. సంఘం ఎప్పుడూనిశ్చలంగా ఉండదు. అలాఉంటే అనారోగ్యంలో కుళ్లిపోతుంది. ఎప్పుడూమారుతూ ఉంటుంది. పెరుగుతూఉంటుంది. "మారు - లేకపోతే చచ్చిపో." యిది ప్రకృతియొక్క అనుశాసనం.

ప్రపంచ పరిణామ వాదుల్లో, ముఖ్యుల్లోఒకడైన డాక్టర్ డేవిడ్‌స్టార్ జార్డన్ యిలా అన్నాడు. "సాంఘిక పరి ణామంయిలా ఉంటుంది. ఎంతగొప్పస్థితికి సంఘంవచ్చినా,

అది గొప్పస్థితికానట్లు, ఇంకామారవలసినట్లు, కనిపించాలి. మహాశాశ్వతమైన సంఘంయొక్క గుణం ఎప్పుడూ మారుతూ ఉండడం, నిశ్చలంగాఉన్న సంఘంఅంటే అభివృద్ధిని ఆటంక పరచడ మన్నమాట." పరిస్థితులు ఎంతతొందరగా మారితే అంత తొందరగా మారాలి. మార్పుఒకనాటికి సంపూర్ణంగా పోతుందని, సంఘం నిశ్చలంగా మారకుండా ఉంటుందని కలలు కనడం' మానవుని విజ్ఞానంలో లోపం.

కాబట్టి మన కర్మకాండను 'యీనాటి పరిస్థితులకు అన్వయించుదాం. మనకోరికలు ఆనాటి వేదఋషుల కోరిక ల్లాంటివికావు. పశుసంపద కావాలంటే యింద్రయజ్ఞం చెయ్య మని, సంతానంకావాలంటే ప్రజాపతి యజ్ఞంచెయ్యమని మనం కోరడంలేదు. ఈ నాటి కోరికలువేరు. ఇప్పటి ముఖ్యమైన ప్రశ్నలు అవికావు. ఇప్పటికర్మకాండ యీ స్వరూపం తాల్చింది: "ముందుకు పోతూవున్న యీ పారిశ్రామిక కళా యుగంలో నీవు బ్రతుక దలచుకుంటే, అడుగడుగునా రాజ కీయ క్షయవ్యాధిచేత చావకుండా ఉండదలచుకుంటే, విద్యు చ్ఛక్తి అనే మాత్రిశ్వుణ్ణి వశంచేసుకో. ఆవిరి అనేవరుణుణ్ణి ఉపాసన చేసుకో. వ్యవసాయ శాస్త్రమనే కుబేరుణ్ణి సఖ్యం చేసుకో" ఈ దేవతలకు పరిచయంచేసే పురోహితుడు, ఈ విజ్ఞానశాఖల్లో ఉపదేశించే విజ్ఞానశాస్త్రవేత్త లేక కళావేత్త.

రాముణ్ణి సాంప్రదాయకమైన భాషతో మాటలతో బంధించవద్దు. ప్రతిదీ మారాల్సిందే. దేశం సంపూర్ణంగా మారింది. ప్రభుత్వం మారింది. భాష మారింది. రంగు

మారింది. ఇంకా వేదకాలపు దేవతలు, మానవులతో కలిసి మెలిసి కాలంతో పాటు రాకుండా, ఆకాశంలో ఉయ్యాల లూగుతూ ఉండడం దేనికి ?

ప్రియమైన హిందూదేశ ప్రజలారా! రాముడు మీతో ఏమని చెబుతున్నాడు! మేఘగర్జనలో మెరుపులో, సూర్యచంద్రాదుల్లో, వాయువులో, జలంలో, భూమిలో, ఆ పూజ్యులైన మహర్షులు చూచిన "ఏకంసత్" లేక భగవంతుడికి మిమ్మలను దగ్గరగా తీసుకపోతున్నాడు. ప్రకృతిలోని భగవంతుణ్ణి ప్రకృతిగా దర్శించు. అంతేకాదు, విజ్ఞానశాస్త్ర పరిశోధనశాలలో, ఆ భగవంతుణ్ణి చూడు. రసాయనికపరిశోధనాశాల, యజ్ఞవేదిక, అదే యజ్ఞాగ్ని. వెనుకటి యజ్ఞాగ్ని జ్వాలను మళ్ళీనీవు పునరిద్ధరించలేవు. కానీ, ఆ వెనుకటి ప్రేమతత్త్వం, భక్తి, శ్రద్ధ, నేటికర్మల్లో పునరుద్ధరించాలి. ఎగజిజ్ యిలా అన్నాడు: "ప్రకృతిని పరిశీలించడమే భగవచ్చింతన చేయడం" మీ సర్వకర్మల్లో, పవిత్రతత్త్వం నిండి ఉండాలె, అలాఉంటే కమ్మరి కొలిమిమంటలోనే పవిత్రాగ్నిని చూడవచ్చు. ప్రియా; కర్షకుడి గడ్డపారను ఇంద్రరథంగా మార్చడం నీ 'రామ మహాదర్శనం' మీద ఆధారపడి ఉంది. ఈదివ్యదృష్టిని, దైవదృష్టినీ అభివృద్ధిపరచడమే యదార్థ యజ్ఞతత్త్వం.

ఇప్పటి జాతీయ పరిస్థితిని తెలుసుకోకపోవడంవల్ల, మీరు మీ భవిష్యజ్జీవితాన్ని పూడ్చిపెట్టుకుంటున్నారు. అలాంటి ఘోరనాస్తికులు (అవిశ్వాసులు) కావద్దు. భవిష్యజ్జీవనానికి పనిచేయడమే, మీ పరమావధి! కాబట్టి నీ భవిష్య

జీవితం లేక నీవు కాబోతున్న మానవుడు, తన కాలంలో సక్రమంగా సత్యంగా ఉండేలాగు జీవించు. అందుచేత, ఏభై సంవత్సరాల అనంతరం నీ ఉత్తరజీవితం నీకు లజ్జాదాయకం కాకుండా జీవించు. అందువల్ల, నీ భావిజీవితం, భావిభారత శిశుస్వరూపంలో పూర్ణపతనం కాకుండా జీవించు!

పూర్వాచార పరాయణులగు హిందువులారా! మీ మనస్సును పరిశుద్ధం చేసుకోండి. మీకు ఇద్దరు కర్మాధిపతులు వద్దు. మీరు మీ పూర్వులు విడిచివేసిన గుడ్డలు వేసుకోవద్దు. స్మృతిమాత్రంగా అవి ఉన్నాయని ఆ గుడ్డలు కట్టుకోవద్దు. తన జీవిత పరమదృక్పథాన్ని వదలిపెట్టి, యితర చిన్నచిన్న విషయాలకు ఆదర్శమున్న మానవుడు ప్రాకులాడ్డమే, మానవులను జాతులను పతితులను చేసేపాపం.

చిన్నచిన్న పిలుపులన్నిటికీ, 'లేదు-లేదు' అని జవాబు చెబుతాడు.

యజ్ఞమంటే దేవతలకు అర్పణచేయడం; దేవపూజ. వేందాతికమైన, వైదికమైన భాషలో దేవత అంటే ఏమిటి? తేజస్సును, ప్రాణాన్ని యిచ్చే శక్తి. దేవతలు (బహువచనంలో) అంటే, దివ్యశక్తియొక్క భిన్నభిన్న స్వరూపాలు. దేవత అంటే, ఆధిదైవికమైనటువంటి, ఆధ్యాత్మికమైనటువంటి ఒక శక్తి. చక్షువు, ఒక వ్యక్తియొక్క చూపుకుమాత్రం సంబంధించింది. కానీ, చక్షుర్దేవత, అంటే సర్వప్రాణుల్లో ఉన్న దర్శనశక్తి-దీన్నే ఆదిత్యశబ్దంవల్ల తెలియపరిచారు. ఈ శక్తికే బాహ్యంగా కనబడే సూర్యుణ్ణి, సంకేతికంగా తీసుకొని, జగ

చ్చక్షువు అన్నారు. కర్మేంద్రియం ఒక మనిషి బాహుశక్తిని సూచిస్తుంది. కానీ, హస్తాధిదేవత అంటే, సర్వహస్తాలను కదలించే శక్తి అని అర్థం. బ్రహ్మాండాంతర్గతమైన ఈ శక్తికి యిచ్చిన పేరు 'యింద్రుడు' అని కాబట్టి, ఇంద్రియాధిదేవతలు అన్నదానికి అర్థం యిదే.

యజ్ఞంలో దేవతలకు అర్పణలు చేయడంలోని హేతువు ఏమైవుంటుంది? తన వ్యక్తిగత శక్తుల్ని ఆయా సంబంధమైన బ్రహ్మాండ శక్తులకు అంకితంచెయ్యడం, తన స్వల్పాత్మను (అహంకారాన్ని) సర్వాంతరాత్మతో ఐక్యంచేయడం, తన తోటి వాండ్లను ఆత్మవత్తుగా గ్రహించగల్గడం, తన యిచ్ఛను భగవదేచ్ఛతో మగ్నంచేయడం—ఇదీ దేవతార్పణ. ఒక ఉదాహరణ తీసుకుందాం. ఆదిత్యార్పణ అంటే సర్వనేత్రాలను గౌరవించడం, దుష్ప్రవర్తనచేత, నేత్రాలను కలుషం చేయకుండా ఉండడం, నిన్ను చూస్తున్న సర్వనేత్రాలనూ, నీమీద కోపదృష్టులు చిమ్ముతున్న నేత్రాలనైనా ప్రేమా, చిరునవ్వులు, దీవనలతో దర్శించడం - సర్వనేత్రాల్లో భగవంతుణ్ణి దర్శించడం, ఇలా చేయాలని సంపూర్ణ నిశ్చయం. ఆదిత్యయజ్ఞమంటే యిదే.

ఇంద్రయజ్ఞమంటే, దేశంలోని సర్వహస్తాల అభ్యున్నతికి కృషిచేయడమే. ప్రతిదీ తన కవసరమైన ఆహారాన్ని తీసుకుంటుంది. చెయ్యి, భుజమూ, కండరాలు, వాటి స్వయం పరిశ్రమచేత ఆహారాన్ని స్వీకరించి పెరుగుతుంటై. ఇంద్ర సమర్పణమంటే, దేశంలో పనిలేక దేవులాడే లక్షలాది బీద

జనులకు పనికల్పించడమన్నమాట. అందువల్ల యింద్రుణ్ణి తృప్తిపరిస్తే దేశంలో అభ్యుదయానికి, సంపదకూ కొదవ ఉండదు. అన్ని చేతులు పనిచేస్తుంటే, దరిద్ర మెక్కడఉంటుంది? ఇంగ్లండులోవాళ్లు, నిజానికి ఎక్కువపంటలు పండించరు. అయినా అది శ్రీమంతంగాఉంది. కారణం ? శ్రామికదేవత (హస్తాధిదేవత) ఐన యింద్రుడు కళల్లో, పరిశ్రమల్లో అత్యధికంగా ఆరాధించబడ్డాడుగనుక. అందరిమేలుకోసం, సమిష్టి సౌభాగ్యంకోసం మనచేతులు కలపడమే యింద్రయజ్ఞం. విశ్వశ్రేయస్సుకోసం, సర్వజనీనిక సౌఖ్యంకోసం, మన మనస్సులు కలపడమే, బృహస్పతియజ్ఞం. మన హృదయాలు కలుపుకోవడమే, హృదయాధదేవతఐన చంద్రప్రీతికి చేసేయజ్ఞం. ఇలాగే, తదితరదేవతాయజ్ఞాలు.

కొద్దిలో చెప్పాలంటే, దేవతా యజ్ఞాలంటే నా హస్తాలను, సర్వహస్తాలకోసం, లేక సర్వజాతికోసం, ఆహుతి చేయడం, నా నేత్రాలను సర్వనేత్రాలకు అంటే సర్వప్రజానీకానికి అర్పణచెయ్యడం, నా మనస్సును అందరిమనస్సుకు సమర్పించడం, దేశముయొక్క అవసరాలలో, నా అవసరాలన్నీ మగ్నంచెయ్యడం, అందరినీ నాఆత్మగా భావించడం, — ఇంకొకరూపకం చెప్పాలంటే, "తత్త్వమసీ" ఆ "పరమాత్మవే" నీవు అనే సత్యాన్ని అనుభవపూర్వకంగా గ్రహించడం ఇదే స్వార్థదైహికపరిత్యాగ బాధితుడైన తర్వాత, సర్వైక్యతతో పునరుత్థానం కావడం. ఇదే వేదాంతం.

"ఓ ప్రభూ ! నా జీవితము తీసుకొమ్ము
నీ కంకితము చేసుకోవోయి ప్రియుడ !
నా హృదాబ్జము తీసుకోవోయి సఖుడ !
నీ ప్రేమలో దాని ముంచెత్తుకొనుము.
నా నేత్రముల తీసుకొని వానినింక
పరవశోన్మత్త పూర్ణముచేయవోయి !
నా చేతులను తీసుకొని నాథ ! వాని,
మధుర సత్యంబులో మగ్నంబుచెయ్యి."

(ఈ పద్యంలో 'ప్రభూ' అన్నదానికి అర్థం, స్వర్గంలో కూర్చొని, మబ్బుల్లో దగ్గు పడిశంతో బాధపడుతున్న కనపడని సోమరి కాదు, 'ప్రభూ' అంటే, సర్వమని-తోటి మానవు లని అర్థం.)

ఈ యజ్ఞమే ప్రతివ్యక్తీ తప్పక చేయవలసింది. ఇదే విశ్వమతం కావాలె. హిందూదేశమా! ఇది ఆచరిస్తే ఆచ రించు. లేదా చనిపో. ఇంకో మార్గం లేదు.

యజ్ఞసమయాల్లో దేవతలు ప్రత్యక్ష మవుతారని మీ శాస్త్రాల్లో చెప్పబడిన మాట అక్షరాలా నిజమని రాముడు చెపుతాడు. అయితే అది, 'సమిష్టి ఏకాగ్రతాశక్తి' మాత్రమే అని తేలుతుంది.(Power of collective concentration) మన సత్వశాస్త్రంలో యిటీవల పరిశోధనలలో ఒకేచోట ఒకే సమయంలో, ఎంతమంది ఏకాగ్రచిత్తులైన మానవు లుంటారో, ఇంకా అన్నిరెట్లు ఎక్కువగా ఏకాగ్రత వృద్ధి పొందుతుందని తేలింది. అదే సత్సంగంవల్ల కలిగే మేలు. ఇప్పుడు రాము

డొక్కడే, తనకిష్టమైన భావాన్ని సగుణంగా (సస్వరూపంగా) చేయగలుగుతున్నప్పుడు, ఏకాగ్రమానసులైన వేనకువేలు ప్రజలు ఒకేరూపాన్ని భావిస్తూ, ఒకే వేదబుక్కును గానం చేస్తూ ఉంటే, దాన్ని సస్వరూపంగా పొందడం వాళ్ళకు ఎందుకు సాధ్యంకాదు ?

అయితే, దీనివల్ల ఏమి తేలుతున్నది ? సత్యాత్మవు, సర్వానివీ అయిన నీవే, యీ సమస్త దేవతలకూ తండ్రివీ, సృష్టికర్తవనీ తేలుతున్నది. నీ స్వాంతభావాలేఅయిన యీ దేవతలు, నీ అనిత్యమైన దృశ్యమానమైన అహంకారాన్ని శాసిస్తున్నారు. మీ గతికి మీరేకర్తలు. బురదలో, బజారులో, దుమ్ములో పొర్లాడే బానిసగా ఉండటమో, లేదా నీ జన్మహక్కైన ప్రతిభాకిరీటాన్ని ధరించడమో నీవే నిర్ణయించుకో ! నీకేది యిష్టమో అది చెయ్యి. నీయంతటనీవు నిర్ణయించుకో !

మన సత్త్వశాస్త్రదృష్ట్యా, ఒక భావాన్ని మనస్సులో హత్తుకొనేటట్లు చేయడంలో, తగిన చిహ్నాలు. సాంకేతికాల యొక్క అద్భుతోపయోగం రాముడికి తెలుసు. ఏకాగ్రమైన ఆత్మార్పణా సంకల్పంలో మునిగిపోయిన మానవుడు, పాణిగ్రహణంలోమాదిరి విశ్వహస్తాలకు తన హస్తాలు అంకితంచేస్తూ, తనమనస్సు భక్తిపూరితమై, తనశరీరమంతా పవిత్ర నిర్ణయంతోపులకితమైనప్పుడు, అతడు, విశ్వశక్తిలో తన అహంకారాన్ని మగ్నంచేస్తున్నదానికి చిహ్నంగా, పెద్ద స్వాహాంతాలతో తన అంతరనిర్ణయాన్ని ప్రకటిస్తూ, మంత్రోచ్చారణతో, బాహ్యంగాకూడా అగ్నిలోఆహుతిచేస్తాడు. ఆపవిత్రకర్మమీద

చిహ్నరూపకమైన పావనముద్ర వేయబడింది! అయితే, ముద్ర అంతా (బాహ్యచిహ్నాలు) ఉండి కర్మసున్నా అయినప్పుడు, ఆ హాస్యకర్మవల్ల ఏమిఫలం ? భావనాబలం (Idea or Suggestion) లేకుండా, మనమీద బలంగా పెట్టిన అర్థరహితమైన వట్టి ఆకారం లేక సాంకేతికం, ప్రాణవిహీనమైన కళేబరమే. ఆ శవాన్ని వెంటనే బూడిదచెయ్యి. దాన్ని సేవించవాకు. అది అపాయకరమయింది ; మనలను పాడుచేస్తుంది. సజీవమైన నూతన స్వరూపాలను గ్రహించు.

నదీ ప్రవాహానికి, తన పాతకాల్వలోనే ప్రవహించడం సులభం. అందుకని, పురాతన సంస్థలలోనే క్రొత్తజీవాన్ని యిమడ్చవచ్చని కొందరంటారు. అది అసహజమయింది అంటాడు రాముడు. ఒకసారి పాతమార్గాన్ని వదలిపెట్టి, మళ్ళీ ఆ మార్గంలోనే ప్రవహించిన ఒకనదిపేరు చెప్పండి. లేదా ప్రాణంపోయిన శవంలో, క్రొత్తజీవితం ప్రారంభించిన ఉదాహరణ ఏమైనాఉందా ? పాతసీసాల్లో, క్రొత్తసారాయి పనికిరాదు. ఒకసారి రసంపిండబడిన, బెల్లపు చెరుకులోనుంచి మళ్ళీ రసం వస్తుందా ? దాన్ని కాల్చివేయాలసిందే. వస్తువులు వాటి రూపాలను సంబంధాలను మార్చుకుంటై. ఒకసారి వదలిపెట్టిన రూపాలు, సంబంధాలు మళ్ళీరావు." జ్ఞానాగ్నిలో త్యాగాహుతులనే, ఆహుతిచేద్దాం. కాలానుగుణ్యమైన రూపాలలో, సత్యయజ్ఞతత్త్వాన్ని గ్రహిద్దాము. దేశభక్తిఅంటే, జరిగిపోయిన పూర్వవైభవాలను, ఊరక ఎడతెగకుండా పొగడడం అనుకొనేవాండ్లు కొందరున్నారు. కొత్తపరిసరాల్లో, పాతబరు

వును వీపుమీద మోసకపోయే నత్తగుల్లలువాండ్లు. దివాలా ఎత్తిన కోటీశ్వరులు, ఎప్పటివో వెనుకటి నిల్వలెక్కలు బండెడు చూపిస్తే ఏమిప్రయోజనం ! పూర్వ 'హిందూదేశం ఇలాఉండేది' అనే ఆలోచనలతో కాలయాపనచేయవాకు ! అనంతమైన నీశక్తిని కూడబెట్టుకో. 'హిందూదేశం ఎలా వుండాలె' అనే సమస్యను పరిష్కరించడానికి, ఆలోచించు ! గాఢంగా ఆలోచించు !—

ప్రజలు, అందరూ సమావేశమై కండ్లూ చేతులు కలుపుకున్నప్పుడు, తరచుగా అక్కడ హృదయాలు కలవడానికి మహదవకాశముంటుంది. తెలిసో తెలేకుండానో, ఒకరి భావాలు ఒకరు గుర్తించుకోడానికి, సమరసభావనకు, సమరస నిర్ణయానికి రావడానికి, అవకాశముంటుంది. సామాన్య భావనాస్థితిని, సమానమైన శక్తివంతమైన ఆధ్యాత్మికతను ప్రజలు పొందడానికి వీలుంటుంది. ఈవిధంగా పరస్పర సోదర భావం, ఐకమత్యం కలుగుతుంది. నిరక్షరాస్యులై, కేవలం యుద్ధప్రియులైన అరబ్బులను, రోజుకు కనీసం అయిదుసార్లు నమాజుకోసం, దేవుడిముందరకు కలసివచ్చేటట్లు చేయడం లోనే, మహమ్మదు మేధాశక్తివుంది. ఆవిధంగా అల్లకల్లోలంగా ఉన్న అరబ్బీ ప్రజలను, ఒక క్రమబద్ధమైన జాతిగా తయారుచేయడంలో, అతను కృతకృత్యుడు కాలేదా ?

యజ్ఞాలూ, తీర్థయాత్రలూ, మేళలూ, మందిరాలు, న్యాయస్థానాలు సత్రాలు, వివాహ మరణ సందర్భాలు. సభలు; సమాజ వార్షికోత్సవాలు, నేటి సమావేశాలు,

కాంగ్రెసు సమావేశాలు,— ఇలాంటివన్నీ హిందూదేశంలో ప్రజానీకాన్ని సమావేశపరచడానికి ఉన్న అవకాశాలు. పాశ్చాత్యదేశాలలో, చర్చీలు, హోటళ్ళూ, ప్రదర్శనాలూ, విహారయాత్రలూ, విశ్వవిద్యాలయాలూ, బహిరంగోపన్యాసాలూ, క్లబ్బులూ, రాజకీయ సమావేశాలు, ఇవన్నీ ప్రజలను ఒకచోటికి చేర్చే అవకాశాలు. అయితే, మనం ప్రశాంత ఆధ్యాత్మిక భావంతో కలుసుకున్నప్పుడే, ఆసమావేశాల్లో గొప్ప ఐకమత్యశక్తి ఉంటుంది. అక్కడే, పవిత్ర ప్రేమజలం (సావిత్రి) ఐకమత్యాన్ని ప్రస్ఫుటంచేస్తుంది. హృదయాలు కలిసినప్పుడే, ఐక్యతాబంధం దృఢంగా ఏర్పడుతుంది. హృదయాలు కలవకుండా కేవల దేహసమావేశాలు, ఏమాత్రం ఫలవంతం కాజాలకపోగా, పరస్పర మనస్పర్థలు, యీర్ష్యలకు కూడా దారితీస్తవి. పైపై ఐక్యతకొరకు ప్రాకులాడవలసిన అగత్యమేమీలేదు. హృదయాలు కలవని స్నేహాలు, చిటపటమండే విరుద్ధ రసాయనికసంయోగాల్లాగా చెడిపోతవి. కేవల పాదప్రయత్నంచేత, ఎప్పుడూ రెండుమనస్సులు, పరస్పర సన్నిహితంకావు. నిజంగా మనకు కావలసింది ఈ స్నేహితులూ, అనుచరులేనా ? శాశ్వతస్రవంతికి, సర్వజీవన మూలానికి మనం దగ్గరవుతే, సహజంగానే మనచుట్టు స్నేహితులుంటారు. చెట్టు నీటికి సమీపంగాఉండి, తనవ్రేళ్లను నీటివైపు పంపుతుంది. ఆలాగేమనం శాశ్వత సర్వజీవనమూలం నుండి ప్రవహించాలె ; అప్పుడు మన సామీప్యంలో అనేక అనేక బాంధవ వృక్షాలు ఉండడం చూస్తాము. మొట్టమొదట, సత్యస్రవంతికి సమీపంగా ఉండడమే నీవు చేయవలసింది.

దూరదర్శినీ యంత్రంలోని (టెలిస్కోప్) అద్దాలు, వాటి కేంద్రదూరాలు ( focal lengths ) యుక్తపద్ధతిలో అమర్చినప్పుడే, సమస్మృతిలో కలిసి పనిచేస్తవి. ఖగోళమంతా గూడా, యధోచిత దూరాల్లో ఉంచబడిన వివిధమండలాల సమిష్టి స్థితిమాత్రమే. మనతో సన్నిహితత్వంవల్ల కొంచెం దెగ్గరఉన్నా, లేక కొంచెందూరంలోఉన్నా, కొంతమంది స్నేహితులతో మనం కలసి పనిచెయ్యలేము. స్నేహితం అనే సూర్యమండలంలోకూడా, శాశ్వతమైన, ప్రేమపూరితమైన ఐక్యత భద్రపరచడానికి, ఆధ్యాత్మిక దూరాల్లో యధోచిత పరస్పర సంబంధ సామ్యాలు కాపాడడం అవసరం. తరచుగా ప్రజలు, స్నేహితులతో కలసి ఉండడంవల్లా, లేక చాలా దూరంగా ఉండడంవల్లా, యీ రెండు స్వాపరాధాలచేత, బాధపడి ప్రతివాణ్ణీ అపనమ్మకంతో, అనుమానంతో చూస్తారు, ప్రేమ, సామరస్యమూ, ఐక్యత, ప్రజలతో ఎవరితో ఎంతదూరంలో ఉండాలనో, ఆ ఆ దూరాల యధోచిత స్థితులను కాపాడుకోవడంలో, భద్రపడుతుంది.

ప్రకృతి ధర్మానుసారంగా, తమతమ సంబంధ పరిమితులు ఏర్పరచుకొని, ఆధ్యాత్మిక సంబంధాలచేత స్వాత్మను గుర్తించి తదభిముఖులు గావడానికి, సకల ప్రజాజాతులు, వచ్చి, పరస్పరం కలియడానికి అవకాశాలు, ఉండేటట్లు, జాతీయోత్సవాలు అభివృద్ధి కావాలె. శీతకాల జాతియోత్సవాలు దక్షిణాపథంలో చెయ్యాలె. గ్రీష్మకాల జాతీయోత్సవం ఉత్తరఖండ పర్వతమనోహర ప్రదేశాల్లోనూ, వసం

త్సోవం వంగదేశంలో చెయ్యాలె. హేమంత ఉత్సవాలు పశ్చిమ భారతదేశంలో జరగాలి. ఈ ఉత్సవాలు, కుల, జాతి హద్దులుదాటి, సర్వజాతుల ప్రతినిధి సంఘాలచేత నడపబడి, జాతీయము లౌతవి. ఆ మహోత్సవ సందర్భములో, కళా ప్రదర్శనాలు, పరిశ్రమలు, అన్నిరకాల దుకాణాలు, విచిత్ర వస్తుప్రదర్శనశాలలు, గ్రంథాలయాలు, రసాయనిక శాలలు, క్రీడారంగాలు, ఉపన్యాసవేదికలు, క్లబ్బులు సమావేశాలు, జాతీయనాటకరంగాలు, ఏర్పరచాలె. వాటికోసం, నానాజాతి ప్రజలు, నానామతస్థులు కూడుతారు. అక్కడ సామాన్య విషయాలతోపాటు, జీవిత ప్రాముఖ్యవిషయాలుకూడా ప్రదర్శితాలవుతాయి. పురాతన హిందూదేశంలోలాగా, అక్కడ సోదరీ సోదరులు, భార్యాభర్తలు, ఆనందకేళి చేస్తారు. బొంబాయి రాజధానిలో మాదిరి, అక్కడ తల్లులను పిల్లలు అనుసరిస్తారు. అన్ని జాతులకు, అన్ని తరగతులకూ సకలమతాలకూ సంబంధించిన వక్తలు, తమ ప్రేమను వాగ్రూపకంగా ప్రకటించడానికి. అక్కడ ఒక సామాన్య రంగస్థలంఉండాలె.

జాతీయ సారస్వతాన్ని సృష్టించి, దాన్ని అభివృద్ధి చెయ్యడం, సజీవంగాఉన్న దేశభాషల్లో సామరస్యం ఏర్పరచడం, జాతీయైక్యతకు దోహదం చేస్తాయి. అక్కడక్కడ, అన్నిజాతులకూ అన్ని మతాలకూ చెందినవారు వచ్చి చనువుకోసం, ధ్యానంచేసుకోను,నిశ్శబ్దంగా ప్రార్థనచేసుకోడానికి, పరస్పర కరుణాప్రేమలు వెదజల్లుకోడానికి (నిశ్శబ్దంగా) తపస్సులో లీనంగాను అవకాశముండే ఓంకారమందిరాలు నిర్మించవచ్చు.

యువకులందరూ కలిసి బాహ్యప్రదేశంలో, రాముని పద్ధతిలో వ్యాయామం చెయ్యవచ్చు. ప్రతి దైహిక సంచల నాన్నీ, ఆధ్యాత్మిక సాంకేతికంగా మార్చవచ్చు, దేహాన్ని ఆధ్యాత్మిక తీర్థాభిషేకంకోసం, ఒక శంఖంగా చెయ్యాలి.

స్నానం చేసేటప్పుడు, అందరికీ అర్థమయ్యే భాషలో ఉచితమైన పవిత్ర ధ్యానశ్లోకాలు పాడుదాం.

యువకులందరూ, నదీతీరాల్లో పచ్చని మైదానాల్లో, చల్లని చెట్లనీడల్లో కానీ, ఆకాశ రాజచ్ఛత్ర శీతలచ్ఛాయల్లో కానీ, కలిసి ఆహారం తీసుకోవాలి. ముద్దముద్దకూ బాహ్యంగా ఆంతరంగికంగా కూడా, ఓం, ఓం అని సంస్మరించాలె. అగ్ని జ్వాలలవంటి పదాలతో, బుసకొట్టే భావాలతో, జాతీయ గీతాలు, ఏకస్వరంగా పాడాలె. సమిష్టి సంగీతంవల్ల ఐక్యత సులభంగా లభిస్తుంది.

హావనం కోసం కృత్రిమాగ్నిని రగిల్చేకంటే, భక్తి పూరితులైన యువకులు తమ అహంకారాన్ని ఉదయసూర్య కాంతి జ్వాలల్లో కానీ, అస్తమయ రక్తకాంతి జ్వాలల్లో కానీ, ఆహుతిచెయ్యడం మంచిది.

"మేలుకో భక్తుడా, మేలుకోవోయి !
అలుపులేకుండగ నడిచిపోవోయి !
దివ్యోదయారుణకాంతి వారిధిని
నీ హృదాబ్జము స్నాన మొనరింపవోయి !"

కాంతి సముద్రంలో మునుగుతావా ? వెలుగునదివై బైటికి వస్తావా ? అఖిల ప్రపంచాన్ని నీ దివ్యకాంతి సముద్రంలో ముంచెత్తుతావా ? ఇదే హావనం.

సామాన్య ప్రజానీకంలో, ముఖ్యంగా స్త్రీలల్లో, పసి పిల్లల్లో ప్రేమ, ఐకమత్యం కల్పించే మంచిమార్గం ఒకటి నగర కీర్తన; గానం చేసుకుంటూ, నృత్యం చేసుకుంటూ, నిర్భయంగా సత్యాన్ని ప్రకటిస్తూ వీధుల్లో చేసే ఉత్సవదృశ్యాలు.

సత్యంకోసం, ఒక జాతీయనాయకుడు ధర్మరక్షణార్థమైన మరణాన్ని, క్రూరబాధను పొందితే - అదే దేశంలో ఐక్యత దేవడానికి అమోఘశక్తిగా పనిచేస్తుంది. కానీ అది సజీవమృత్యువు. ఆ నిస్వార్థమైన మారణజీవితం (Dying life) ఒకణ్ణికాదు. సర్వజాతులనూ ఐక్యం చేస్తుంది. ఒక్కడు భగవంతుడులో ఉంటే చాలు, అతనిద్వారా జాతి మొత్తం ఐక్యం అవుతుంది.

యువకులు రక్తంలో, అగ్నిలో జ్ఞానస్నానం చేసి, యుద్ధ విద్యావిశారదులైనప్పుడే, ధైర్యం; ప్రవర్తనా సత్యవాదిత్వం, ఆత్మత్యాగశక్తి, సౌశీల్యం అభివృద్ధి పొందుతవి.

స్త్రీలకూ, పిల్లలకూ, కార్మికసంఘాలకు విద్య నేర్పక పోవడం, మనం కూర్చున్న కొమ్మలు మనం నరుక్కోవడం, అదేకాదు, జాతీయతా వృక్షాన్ని సమూలంగా తెగగొట్టడం సుమా!

ఇరువయ్యో శతాబ్దపు ఋషివంశీకులారా! మీరు మీ శ్రుతిప్రబోధాలు తెలుసుకుంటే, 'స్మృతి మీమీద బలవంతంగా పెట్టిన సంకుచిత కఠిన కర్కశమైన కుల జాతి భేదాలు బ్రద్దలు చెయ్యాలె. మీరు మీ సత్యాత్మను గుర్తించకపోతే శ్రుతిని లక్ష్యం చెయ్యకపోతే; గడచిన చలికాలంలో వేసు

కున్న దుస్తులు యెండాకాలంలో కూడా మీ పూర్వీకుల విజ్ఞానపు పేరుతో వేసుకుంటామని కూర్చుంటే, మీ గతి ఏమవుతుందో ఆలోచించుకోండి. మానవుడు కాలం వల్లనే జీవించడు. దేశాన్ని బట్టి కూడా జీవిస్తాడు. కాలాన్ని బట్టి మీరు హిమాలయ మహర్షులయొక్క వారసులే కావచ్చు. కానీ దేశాన్ని బట్టి మీరు ఐరోపా, అమెరికా ప్రజల్తో, వారి కళా విజ్ఞానశాస్త్రాలతో మీకు సంబంధం లేదని అనలేరు. సనాతన ఉపనిషద్విజ్ఞానానికి వారసులు కాండి. అయితే, భౌతికరంగంలో జపాన్ అమెరికా దేశాల అనుష్ఠాన పద్ధతులను జీర్ణించుకోని, ఆ ప్రకారంగా నడిస్తేగాని మీరు బ్రతుకలేరు. లేత మొక్క దాని పరిసరభూమినుండి నీరు, గాలి, వెలుతురు తీసుకోకుండా స్వంత ఆహార పదార్థాల మీదనే ఆధారపడితే, వెంటనే చచ్చిపోతుంది. రాముడు మిమ్మల్ని జాతీయ వ్యక్తిత్వాన్ని వదలుకోమనిఅనడు. వర్తమానకాలాన్ని,గతకాలాన్ని అర్థం చేసుకొని ముందుకు పొమ్మంటాడు. వాండ్లు మీ సనాతన దైవికజ్ఞానాన్ని జీర్ణించుకొంటున్నట్లుగా, వాండ్ల విజ్ఞానశాస్త్రాన్ని మీరు జీర్ణించుకోండని రాముడు నిజంగా మిమ్మల్ని శాసిస్తున్నాడు.

రాజకీయ ఆర్థికచరిత్ర విజ్ఞానశాస్త్రం చూపుతున్నది—

సకాలంలో విడివిడిగా నాటటంలో మొక్కల యొక్క ఆరోగ్యం ఎలా ఆధారపడి ఉందో, వలస పోవటంలో జాతి క్షేమం ఆధారపడి ఉందని భారతదేశంలో ఉపోషాలు చేస్తున్న పనిలేని బీదవాండ్లందరినీ జనసంఖ్య తక్కువగా ఉన్న ప్రదేశా

లకు కష్టంచేసుకోని బ్రదకడానికి పంపిస్తే, అక్కడ వాండ్లు సుఖజీవనం చేయడమే కాకుండా, వాండ్ల ద్వారా భారతదేశ మనే వృక్షం తన వ్రేళ్లు ప్రపంచంలోని దూర ప్రదేశాలకు వ్యాపింపజేస్తుకుంటుంది. దీనివల్ల పురాతన నిద్రాణభారతం మేల్కొంటుంది. దేశభారం తగ్గుతుంది. వాతావరణాన్ని విష కలితంచేసే నిస్సారప్రదమైన బొగ్గుపులుసువాయువు ఉండదు. అలా మీరు యిష్టపూర్వకంగా చేస్తే, దేవతలు మీ రథానికి కట్టుబడినట్లు(మీకు వశులౌతారు.) కాకపోతే, దేవతలయొక్క కర్కశ రథచక్రాల పరిభ్రమణానికి అంతు ఉండదు. వాటి క్రిందపడి నలిగిపోయే వాండ్లకు అంతుండదు. సర్వత నుండి మిమ్ములను మీరు కాపాడుకోలేరు. అయితే భగవంతుడు మీ హృదయాలను దీవిస్తాడు. మీరెలా అన్నా అర్థం చేసుకోండి. దయామయుడయిన భగవంతుడు కరువు ద్వారా, ప్లేగు మొదలైన వ్యాధుల ద్వారా వలస బంపించటమనేకార్యాన్ని తప్పక నెరవేరుస్తాడు. "ఒక మానవుడు తన వివేకమును జీవితధర్మానికి అన్వయింపజేసి పని చేస్తే; అతనిలోని వివేకం, ప్రకృతి నిర్ణయ కర్మను గ్రహిస్తుంటే, బాధావిముక్తి కలుగుతుంది." అతడొక్కడే అపాయాన్ని తప్పించుకుంటాడు.

కొందరిలా అంటారు— "పనిలేని బీదవాండ్లని, ఇండ్ల నుంచి పరదేశాలకు వెళ్లగొట్టడం దేని?" కని. ఇలా అనడం సంకుచిత జాతీయతత్వం మీద ఆధారపడి ఉంటుంది. మనం పుట్టిన యీ నాలుగు గోడలనుంచి బయట పడడం దేనికి? ఇల్లు విడిచి అసలు వీధుల్లో తిరగడం దేనికి? నీవు స్వర్గకుమా

రుడివిగాని, యీ భూకుమారుడివి కావు. నీవు స్వర్గకుమారుడివి.— కాదు స్వర్గానివే! ఎక్కడ బట్టినా నీ యిల్లే నీ వొక ప్రదేశానికి బద్ధుడవు కావాకు. ఇండియా ప్రపంచంనుండి విడిబడి ఉండగలదా? ఒకప్పుడు యిండియా, పర్షియా, ఈజిప్టు ఇలాంటివి ప్రత్యేక దేశాలుగా ఉన్నరోజులు పూర్వం ఉన్నవి. అయితే యీ రోజుల్లో దేశకాలాలు ఆవిరిచేత, విద్యుచ్ఛక్తి చేత రూపుమాసినవి. సముద్ర మిప్పుడు నిరాటంకమైన రాజమార్గమయింది. పూర్వ పట్టణాలు యిప్పుడు 'బజారులు'గా మారిపోయినై. పూర్వ 'దేశాలు' 'పట్టణాలు'గా మారినై. ఇప్పుడు ఒకటే దేశం. అది ప్రపంచం. తొందరపడు; స్వంత ఇంటిమీాద మోహం వదలిపెట్టి, ప్రపంచమే నీ ఇల్లు అనుకో! అన్ని దేశాలు నీవే. ఓ ప్రకృతిపురుష కుమారుడా! సర్వ మానవజాతి నీ సహోదరులు; నీ అక్కలూ చెల్లెండ్లు. అంతకుముందే హిందూజాతికి మృతభారంగా అంటిపెట్టుకోని ఉన్న మహాభిక్షుక జనసంఖ్యను అభివృద్ధిచేయకుండా; నీవు ఎక్కడ మంచి కార్మికుడివిగా బ్రదకడానికి అవకాశముంటుందో అక్కడికి వెళ్లు. భగవంతుడి కోసం వెళ్లు; మానవజాతి కోసం వెళ్లు!

హిందూదేశ బాధావిముక్తి కొందరికి జాతీయసమస్య కావచ్చు; రాముడికది అంతర్జాతీయ సమస్య. కొందరికది దేశభక్తి కావచ్చు; కానీ, రాముడికది మానవత్వ సమస్య. నా పిల్లలు నా కండ్లముందర ప్రాణాలు విడిచేదానికంటే, పరదేశాలకుపోయి సుఖంగా జీవించడం మంచిది. వెల్లువలై కారు

తున్న ప్రేమాశ్రువులతో, రాముడు మీకు వీడ్కోలు యిస్తు న్నాడు! వెళ్లండి!

తిరిగిరా. నీవు స్వయంపోషకతకంటే ఎక్కువజీవితోన్నతి పొందితే తిరిగి ఇక్కడికి రా. పాశ్చాత్యానుభవ జ్ఞానాన్ని తమ స్వగృహాంలో నింపుతున్న జపానీయువకుల్లాగా పరదేశాల నీవు ఆర్జించిన జ్ఞానంతో, తిరిగివచ్చి నీ పూర్వపుయింటిని దీవించు. కానీ,పరదేశాల్లో నీవు స్వయంపోషకతకంటే ఎక్కువ ఉన్నతి పొందకపోతే, అక్కడే వుండు. బాధాకులితమైన భారత మాతృవక్షంమీద పనిలేని ప్రాకుడుజలగవైతే, అరేబియా సముద్రంలో దూకు. ఆ అరేబియాసముద్రాతిథ్యాన్నే స్వీకరించు. మళ్ళీ యీ యిండియాగడ్డ తొక్కవాకు! గృహ ప్రేమ, నిజమైన దేశభక్తి యిలా నిన్ను శాశిస్తున్నది.

రాముడు అన్నిజంతువులనూ ప్రేమిస్తాడు. మనుష్యు లను ఎంత ప్రేమిస్తాడో, రాళ్ళనుకూడా అంతగా ప్రేమిస్తాడు. దేవతలను ఎంతప్రియంగా ప్రేమిస్తాడో,కోతుల నంతప్రియంగా చూస్తాడు. అయితే నిజం నిజమే. అబద్ధం ఆడినవాడికే విచారం. ఐర్లండు, తాను కొంచెం బాగుపడడానికి ఒకటేమార్గం వెతు క్కున్నది. ప్రతిసంవత్సరం, వేసకు వేలు తన ప్రజలను అమెరి కాకు వలస పంపించింది.

కానీ, రాముడు, తనప్రియమైన అమెరికాదేశాన్ని కానీ, ఇతర దేశాలనుకానీ, హిందూదేశంలోని సోమరిపోతుల గుంపుతో నింపడానికి ప్రయత్నించడంలేదు. మీరు పరదేశా లకు వెళ్ళడం మీ ఆరోగ్యానికికూడా మంచిది. ఒకచోటనే

గుంపుగా పెరిగేచెట్లు బలహీనంగా ఉంటాయి. ఒక చెట్టును తీసి దూరప్రదేశంలో నాటితే, బ్రహ్మాండమైన వృక్షంగా తయారవుతుంది. ఇతరదేశాలకు మీరు వెళ్ళినప్పుడు, మీరు పోయి వృద్ధిపొందిన ఆ దేశాలకు కూడా గౌరవమే. ప్రస్తుతం గొప్పస్థితిలో వున్న అమెరికాదేశీయుల్లో చాలామంది మొట్ట మొదట యూరపుదేశంనుంచి వలసవచ్చిన పేదజనులే. వివిధ జాతి చరిత్రలను చూస్తే ఒక సుఖప్రదమైన మార్పు రాబో తున్నదని తెలుస్తున్నది. ఈ మార్పు వలసపోవడం ద్వారానే కలుగుతుంది.

యజ్ఞాన్ని గురించి, ఇంక రెండుముక్కలు చెబుతాను: అప్పుడప్పుడు యజ్ఞం, త్యాగసూచనగా వ్యాఖ్యానం చేయ బడింది. త్యాగమనే గంభీరపదాన్ని, నిస్సత్వ నిస్సహాయత్వం, చేతగాక వదలుకొనే దౌర్బల్యత్వంగా అర్థంచేసుకోగూడదు. మూఢవైరాగ్యంగా పరిగణించగూడదు. భగవదాలయమైన నీదేహాన్ని, క్రూరమైన కండలు పీక్కుతినే తోడేళ్ళకు, ఏ మాత్రం ఆటంకపరచకుండా పెట్టడం పరిత్యాగంకాదు. అన్యా యానికి, ఘోరపాపానికి నిన్ను దింపుకోడానికి నీకేమి అధికార ముంది? ఒక స్త్రీ తన పవిత్రశరీరాన్ని, అపవిత్రత అనే వాని సకు వదలివేయడం, సధర్మమైన పరిత్యాగంకాదు. సత్యమైన పరిత్యాగమంటే, పరమసత్యానికి సర్వార్పణం చెయ్యడం. ఈ శరీరము, ఈ సంపద భగవంతుడిది. నీ జాగ్రత్తలో నీవుంచు. అన్యాయము, అధర్మము, నీ పవిత్రవిశ్వాసంతో జోక్యం కలి గించుకోగూడదు. పరమ సత్యానికి ఇతరంగా, ఏదో భిన్న

పదార్థంగా నిన్ను నీవు చూచుకొని, మతంపేరుతో, పరి త్యాగం చేయడానికి మొదలుపెట్టడం, నీది కాని దాన్ని అపహ రించడం, నీది కానిదాన్ని దానంచేయడం, పాపంకాదా? ప్రజ్వలిత సత్యభానుడవై వెలుగు! పరమ సత్యానివికా! ఇదే సధర్మపరిత్యాగం. కొంచెం ఆగు; దీన్ని మనం త్యాగం అని పిలవవచ్చా? ఇది దివ్య వైభవంకాదా? నిజం. బ్రహ్మత్వ మన్నా (దైవత్వమన్నా) పరిత్యాగమన్నా ఒకటే. సంస్కృతి శీలమూ—యివి దాని బాహ్యస్వరూపాలు.

పూర్వవేదకాలంలో కూడా, అహంకారంలో వ్రేళ్లు పాతుకున్న ఏ కర్మకాండకూడా, ముక్తిప్రదమని చెప్పబడ లేదు. జ్ఞానంవల్లనే ముక్తిగల్గుతుంది. కాబట్టి స్వార్థముయొక్క వేగిరపాటుగల నాగరిక బానిస ఐన, విధిచోదితమైన నేటి కర్మ కాండ, ఎవణ్ణీ పాపంనుంచి దుఃఖంనుంచి కాపాడలేదు. ఒకడు ప్రపంచంలోని సర్వభాగ్యాన్ని కూడబెట్టవచ్చు, కానీ సర్వుల ఆత్మనుతానేనని తెలుసుకునేంతవరకు శాంతి దొరకదు. ప్రపం చంలోని సర్వపరిస్థితులు పరివర్తనాలగుండా అంతర్గర్భితమై ఒకటేఆశయంప్రవహిస్తున్నది. అదిఆత్మజ్ఞానం. అదిగాక నిజంగా ఎంతకాలంఒకవ్యక్తి కృత్రిమతమీదఆధిక్యతలేక బాహ్యవేషాల మీద ఆధారపడి ఉంటాడో, అంతవరకు ప్రతి క్రొత్తమార్పు సంస్కరణమూ, క్రొత్తరకమైన చెత్తగామాత్రం తయారవు తుంది. ఆశయం నిస్సారమై ఉంటుంది. ఎంతకాలమైతే నీకు,

సర్వాన్నీ నేనే అనేభావం అనుభవానికి రాదో, అంతవరకూ, నీ సర్వనాగరిక దృశ్యం, బాధాకరమైన దేహస్మృతి అనే పుండుమీద కప్పిన పట్టుగుడ్డ కట్టులాగే ఉంటుంది. ఈ జ్ఞానానికి సంబంధించిన వేదభాగమే నిజమైన వేదం. దాన్నే 'శ్రుతి' అని షణ్మతకారులూ, జైన బౌద్ధరచయితలూ అన్నారు. హిందువులందరూ యీ శృతిని అనుసరించండి. నేటిపరిస్థితుల కనుగుణంగా స్మృతిని కర్మకాండకు మార్చుకొనిరి. ఆవిధంగా మీ హిందూ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడమే కాకుండా, హిందువులుగా, నిజమైన జగదాచార్యులుగా, జ్ఞానదాతలుగా వికసించి అభ్యుదయాన్ని పొందుతారు. స్థబ్దతను పోగొట్టుకొని, నిత్యనూతనత్వం పొందుతారు. ఆత్మజ్ఞానం లేకుండా పనిచేసేమనిషి, చీకటిగదిలో గోడకు తల కొట్టుకుంటూ, బల్లలకు మోకాళ్ళు కొట్టుకొంటూ, కుర్చీమీద బోర్లపడుతూ, పడుతూలేస్తూ పనిచేసే మనిషి లాంటివాడు. వెలుగులో పనిచేసే మానవుడికి బాధలేదు, ఆత్మజ్ఞాన శూన్యుడు, గుడ్డిపుతోకను పట్టుకొని, దానిచేత తన్నించుకుంటూ ప్రయాణంచేసే మనిషిలాంటివాడు. జ్ఞాని గుఱ్ఱంవీపుమీదయెక్కి ఉత్సాహంతో, సులభంగా ప్రయాణం చేస్తాడు. ఆత్మజ్ఞానికి, పని ఒక పనేకాదు. ఆత్మజ్ఞానికి అతి కష్టకార్యాలుకూడా, వేసవిగాలిచేత పూలమరిమళాలు విరజిమ్మబడినట్లు సులభంగా సౌఖ్యప్రదంగా ఉంటై. ఆత్మజ్ఞాని అసలు

పనేచెయ్యడని శంకరుడంటాడు. అవును, అతనిదృష్టి ప్రకారం అదినిజమే ఎందుకంటే, అతని కెప్పుడైనాసరే కష్టంగా కనబడే పనేలేదు, అంతా ఒక తమాషా, అంతా ఒక ఆట, అంతా ఆనందం. అతడు చేయవలసిన విధి ఏదీలేదు. తనకుతానే ప్రభువు. అతడెన్నడూ బాధపడడు, వేగిరపడడు, అతనికంతా పరిపూర్ణతే, అతనికి భయశోకాలులేవు. " కర్మజ్వరం "నుంచి అతడు విముక్తుడు.

అయితే అలాంటివాడు సోమరిగా ఉండగలడా ? " ప్రకృతి సోమరిగా, సూర్యుడు జడంగా ఉన్నాడని, నీవు చెప్ప వచ్చు" నైష్కర్మ్యయోగ మహాచార్యుడైన శంకరుణ్ణిచూడండి. సర్వజగచ్చరిత్రలో, ఒకవ్యక్తినుండి అంతకొద్దికాలంలో, అంత మహాకర్మజరిగిన ఒక ఉదాహరణచూపండి! వందలకొద్ది గ్రంథాలు వ్రాశాడు. సమావేశాలు చేశాడు. చక్రవర్తులను మార్చాడు. భారతదేశంలో ఆసేతుహిమాచలం, అద్భుత పరిషత్తులు జరిపాడు. నక్షత్రంలోనుంచి కాంతిలా, పువ్వులో నుంచి పరిమళంలాగా, ఆయనలోనుంచి కర్మ ప్రవ హించింది.

బ్రహ్మయజ్ఞాన్ని గురించి కొన్నిమాటలు చెప్పందే, రాముడీవిషయాన్ని ముగించడు. ఆత్మయజ్ఞిని 'స్వారాజ్యానికి' అంటే అంతర్బ్రహ్మానంద సామ్రాజ్య పీఠానికి బ్రహ్మయజ్ఞం

తీసుకపోతుందని మనువు అంటాడు. మీ సర్వభోగవాసులను, మీ సర్వమోహ సంకల్పాలను, నావీ నీవీ అనబడే వాటిని రాగద్వేషాలను, వాంఛలను, నిగ్రహానుగ్రహాలను, ఆడంబరాలను, ఒహమూ బాంధవ్యాలు, మనస్సునూ, సర్వసన్నిహితాలను, మంచి చెడులనూ, ధనమూ సంశయాలూ, సర్వవిధనామరూపాలు, సర్వహక్కులూ, మీ వలపులనూ జ్ఞానాగ్నిలో ఆహుతిచెయ్యండి. దివ్యజ్ఞానాగ్నిలో వాటిని హోమం చేయండి. వాటిని వ్రేల్చండి. 'తత్త్వమసి' అనే ప్రజ్వలితయజ్ఞకుండంలో నుంచివచ్చే వాటి మధురవాసనలు ఆఘ్రాణించండి. ఆనందించండి.

నీ దైవత్వాన్ని స్థిరీకరించి, సర్వమోహాలకు, భీరుత్వానికి అతీతుడవుకా. తన్ను తాను తెలుసుకున్న జ్ఞాని గమించే మార్గంలో, సర్వప్రపంచం ప్రక్కకు తొలుగుతుంది. విశ్వనాథుడవుకా! జగదీశ్వరుడవుకా! లేకపోతే అదేనిన్ను పాలిస్తుంది. సంశయాత్మా వినశ్యతి! ఇదినిజం - ఎందుకంటే వాంఛ నిష్ఫలమైన 'అహం'కారాన్ని నెత్తిన వేసుకుంటున్నారు.

" దేనికై భయమొందుచున్నావ సఖుడ ?
దేవునిగూర్చియా? బుద్ధిహీనతయె :
మర్త్యుని జూచియా ? పిరికితనంబు

పంచభూతములకా ? ఎదురించవోయి :
నిను నీవుచూచియా ? తెలుసుకోనిన్ను.
గర్జించుమా ' అహంబ్రహ్మాఽస్మియనుచు !

ఓం. ఓం. ఓం.



ఓం

# అరణ్యప్రసంగాలు

దేవదారువృక్షాల నీడల్లో, ఒక చల్లనిరాయి తలగడగా మెత్తని యిసుక పరుపుమీద రాముడు పండుకొని ఉన్నాడు. నిర్లక్ష్యంగా కాలుమీద కాలు వేసుకుని, పరిశుభ్రమైన గాలిని పీలుస్తూన్నాడు. సంపూర్ణమైన ఆనందంతో దివ్యమైన వెలుతురును అనుభవిస్తూ, ఓంకారోచ్చరణం చేస్తున్నాడు. ప్రక్కనే సెలయేరు ధ్వనిచేస్తూ ప్రవహిస్తున్నది. అలాంటి సమయంలో ఒక చెడి బ్రతికిన నాగరికుడు రాముణ్ణి ఇలా ప్రశ్నించాడు.

"ఇలా ఊరికే కూచుని ఆసియాదేశపు సోమరితనాన్ని అమెరికాకు యెందుకు దిగుమతి చేస్తున్నారు? పోయి ఏదన్నా మంచిపని చేయండి."

రాముడు: ఓ నా ప్రియాత్మా! మంచిచేయడం అంటే ఇదివరకే గుంపులుకూడి చేసే పనికాదు. నన్ను, నా రాముణ్ణి యిలా ఒంటరిగానే ఉండనీ.

సోమరితనం! అంటున్నావా? పాశ్చాత్యదేశాల సోమరితనమా? సోమరితనం అంటే యేమిటి? సంప్రదాయాలకు బద్ధుడై ఆచార వ్యవహార ప్రవాహాల్లో కొట్టుకొని పోవడం, వేషభాషాలంకారాల్లో, డాంబికాల్లో, ఆడంబరాల్లో మునిగిపోయి, ధనవాంఛలకు కట్టుబడి భగవంతుని కొరకు వినియోగించవలసిన కాలాన్ని వ్యర్థం చేయడం సోమరితనం కాదా?

ఇలా ధనాన్ని కూడబెట్టి యిదే మంచి చేయడమని శాస్త్రాలు చెప్పడం సోమరితనం కాదా? నీ జీవితాన్ని పరాభిప్రాయాలకు బానిసను జేసి వాక్స్వాతంత్ర్యం మాట అలా ఉంచి గుడ్డలు కట్టుకోవడంలో, తినడంలో, నడవడంలో, నిద్ర పోవడంలో, నవ్వడంలో చివరకు ఏడవడంలో కూడా స్వేచ్ఛ లేకుండా బ్రదకడం సోమరితనం కాదా?

నీ బ్రహ్మత్వాన్ని పోగొట్టుకోవడం సోమరితనం కాదా? ఈ తొందర, తొట్రుపాటు యెందుకు - ఈ దిగుళ్లూ, చింతలూ యెందుకు? డాలర్లు నిరంతరంగా కుప్పలుగా కూడబెట్టడానికేనా? యితరులులాగా భోగాలు అనుభవించడానికేనా? ఈ భోగాలవెంటబడి పరుగెత్తడంలో సుఖంలేదు సుమా. ఓ ప్రియపరాభిప్రాయ దాసులారా! మీ నైజానందాన్ని ఎందుకు త్రోసివేసుకుంటున్నారు? ఈ సహజ సౌందర్యవంతమైన ఆరామంలో, ఈ పర్వత ఝరీతీరులో కూర్చొని, పరిశుభ్రమైన గాలీ, వెండివంటి తెల్లని కాంతీ, తరంగాలతో తృళ్లింతలుపెట్టే ఈ నదీజలం, ఈ పచ్చని మైదాన ప్రాంతాన్నీ యెందుకు అనుభవించరు? వీటికి, మీ దేహంలోని రక్తానికీ యెంత దగ్గరసంబంధం ఉందో! నాగరికజాతులు వర్ణవ్యవస్థలలో బద్ధులై వున్నవి, సోదర మానవులనుండి వేరుపడి, విశాల ప్రకృతినుండి దూరమైపోయి, గుహలవంటి చీకటికోణాలవంటి మూసిన గదుల్లో నిత్యనూతన సౌరభవంతమైన సహజ జీవితాన్ని బంధించారు. ఈ విశాల ప్రపంచంనుంచీ స్వయం బహిష్కృతులై, సృష్టిసౌందర్యానికి దూరస్థులై, జంతుకోటికీ

వృక్షకోటికీ అధికారంలేనివారు అవుతున్నారు. ఆ పరస్పర ఆధిక్యత, ప్రతిష్ట, గౌరవనీయత మొదలైనవి కల్పించుకొని, పరస్పర ప్రేమలేని నిశ్చలస్థితి స్తబ్ధతలోకి పోతున్నారు. దయ కలిగి ఉండండి, స్నేహితులారా మీమీద మీరు దయగలిగి మెలగండి.

అవధి లేకుండా సాగిపోతున్న దురాశతో, కృత్రిమ తంత్రాలతో మీరు ఆర్జించిన ధనం దేనికి ? రోగనిలయము లైన హెూటలు విందులకూ, పానశాలలకూ. మీ ముఖాలను నిస్తేజం చేసి వేయడానికీ, లోకాచారాలలో మ్రగ్గడానికి కృత్రిమ సౌందర్యమందిరాలనే పెట్టెల్లో మిమ్మల్ని బంధించడానికి మాత్రమే ఉపయోగిస్తుంది. దైహికమైన, మానసికమైన రకరకాల మధ్యసారాదులచేత ప్రకోపితమైన అశాంతిలో మిమ్మల్ని ముంచుతుంది. ఈ రభసంతా స్వయంపతనానికేనా ? భోగాలనబడే వాటిపేరుతో, మీ నిజమైన ఆనందాన్ని వదలకోకండి. డొంకతిరుగుడు మార్గాలక్కర లేదు. రా - ఇక్కడే ఇప్పుడే ఆనందించు. వచ్చి-నాతో యీ పచ్చికశయ్యమీద విశ్రమించు. జీవితభద్రతకోసమని వెండీ బంగారం కూడబెట్టడంలో నీ జీవితం వృధాచేసుకోవాకు. ధనంలో భాగ్యవంతుడవై, కాలం వృధాచేసుకోవడంవల్ల నీ జీవితానికి భద్రత కలుగుతుందా ? ఆ నమ్మకం పెట్టుకోవాకు. ఓ భ్రమపడిన అమృతుడా ! నిరుపయోగమైన క్షుద్రసుఖాలకోసం ఎందుకు నీవు ఈ తొందర తొట్రుపాటు జీవితం గడుపుతావు ?

"ఈ ప్రపంచములోన మునిగిపోయితిమి
ఆర్జన, ఖర్చుతో రాత్రింబగళ్ళు
మా శక్తులను వృధాచేయుచున్నాము,
ఇంతకు ప్రకృతిలో మేముపొందినది
పూచికపుల్లయిన కానగారాదు,
మారొదల్ దుష్టవాంఛల కంకితములు
పొంగుచున్నది ఈ మహాసాగరమ్ము
ఎడతెంపులులేక తుఫానులురేగి
గర్జింపుచున్నవి 'హూారుమటంచు,
రాలిన పూలచందమున మేమిప్పుడు
ఈ సముద్రపు కెరటాలపై మేము
తేలియున్నాము నిర్జీవులమగుచు
ప్రతి విషయంబులో శృతిదప్పినాము,
తీరంబు చేరెడు తెరవు లేదోయి
ఓ పరమేశ్వరా! ఓ మహాభాగ!
ఏదియో మాధ్య మతస్థునకైన
దారి గానగవచ్చునేమొ రవ్వంత!
ఆ మనోహరమైన తీరంబు జేర్ప
నీ కృపాదృష్టిని బరుపుమో దేవ!
ఓ సముద్రాధీశ వేగ రారమ్ము
నీ శంఖరవముల వినిపింపవయ్య!

వర్డ్సువర్త్—

యూరపు అమెరికాలలోని అభ్యుదయజాతు లనబడేవి, మనో తాపత్రయంలో మాత్రమే అభివృద్ధిదశలో ఉన్నవి. అభివృద్ధి అంటే- ఆధ్యాత్మిక వైజ్ఞానిక అభివృద్ధి అన్నమాట. అభివృద్ధి అసలు మానవుణ్ణి బాగుచేయాలికాని, అతడి పైపై నీడను ముట్టుకుంటే చాలదు. అనవసర జీవితావసరాలను పెంచుకోవడం గాని, భౌతికసంపదను వృద్ధిచేయడం గాని, అభివృద్ధిలక్షణం కాదు. పూర్వం ఆర్యులు ఏదీ తమ సొంతంఅనేది లేకుండా, ఆస్తిపాస్తులు లేకుండా మహత్తర గ్రంథాలు రచిస్తూ, నిర్విక్రమమైన స్వేచ్ఛాజీవితాలు గడిపారు. తగిన మార్పులతో వారి జీవన విధానాన్నే తిరిగి చరిత్ర అనుసరించవలసి ఉంటుంది. ఈనాటి నాగరికజీవితం దాని పరమార్థానికి దూరం చేయబడింది. ధరలు పెరిగే తరిగే గోధుమ లాంటి ధాన్యాల పరిభాషలోనే మానవుడు అర్థం చేసుకోబడుతున్నాడు. ఈ ప్రస్తుత హీనస్థితిని అధిగమించు. నీకు విలువ లేదు. అమూల్యుడవు.

ప్రియమైన ఆడంబర మానవుల్లారా! మీకు నిరాడంబరమైన ఆర్యులసన్యాసమూ, సర్వసంగపరిత్యాగమూ, మీకు సోమరి నిద్రగా, పగటికలగా కనపడుతున్నది. జాగర్తగా ఆలోచించండి. మిమ్మల్ని పునాదుల్తో కదలించి మీ దురవస్థను కండ్లకు కట్టినట్లు చూపించగల కాలపరిపక్వదశ ఆసన్నమైంది, ప్రేమసంభాసిత పరిత్యాగంలేని నాగరిక మానవుడు మెక్కువ అనుభవశాలియైన తెలివిగల ఆటవికుడు మాత్రమే. సంప్రదాయ మాధ్యత, కృత్రిమత, ధనపిచ్చి, పైపై మెరుగు

లతో నిండిన నాగరిక జగత్తుకు దాసులు కాకండి. అవి నిర ర్థకము లైనవి. అగ్నిపరీక్షకు ఏమాత్రం నిలువలేక దగ్ధమైనవి. మానవకోటిలో సగంభాగం కూడూ నీళ్లూ లేక ఆకలితో మలమల మాడి చస్తున్నది. మిగతా సగం నిష్ఫలమైన వ్యర్థ జీవితం క్రింద పూడ్చిపెట్టబడింది. అంటే నిరర్థకమైన గృహోప కరణాలతో, సెంటు సీసాలతో, షోకులతో, ధనంతో, దర్ప ముతో కూడిన అనారోగ్యకరమైన ఆడంబర జీవితంతో కుళ్లి పోతున్నది.

ఒకదాని వ్యయంతో ఇంకొకటి నిర్వహింపబడితే తప్ప మనః పరిశ్రమగానీ, శారీరక పరిశ్రమగానీ దీర్ఘాయురారోగ్య కరం గాదు. కానీ, నేటికాలపు ప్రపంచంలో కొందరు దేహ శ్రమవల్ల చావులాంటి బ్రదుకు బ్రదుకుతున్నారు. మరికొం దరు మనస్సుయొక్క అధిక శ్రమవలన నశించిపోతున్నారు. కుటుంబంలోని కొందరికి ఎండురొట్టె ఆహారంగా పంచియిచ్చి తక్కినవాళ్లకు జున్ను ఒక్కటి మాత్రం యిచ్చినట్లుగా ఉంది.

స్వయంకృత పాపపంకిల శరీరులు ఎవరంటే; ఇది నాది అని ఒకదాన్నికూడబెట్టినవాండ్లే. నిజమైన శూద్రులుఎవరంటే వస్తువులందు కర్తృత్వారోపకులే. చీకటికోణాల జైళ్లలో స్వయంగా తమకుతామే బంధితులైనవాండ్లెవరంటే, దేన్నైనా సరే ఇది నాస్వంతం అన్నవాండ్లే. పాపము! క్షుద్రకీటకా లెవ రంటే ఇది నాది, అది నాది అని ప్రోగుచేసేవాండ్లే. నీచమైన ధన ధూళిధూసరితులై, రాజులమనీ, అధ్యక్షులమనీ పిలుచు కుంటూ, యీ ఆత్మహాత్యాకారులు కష్టాలు కొని తెచ్చు

కొంటున్నారు. కొందరు అగాధమయిన, భయంకరమయిన అజ్ఞానాంధకారకూపంలోపడి తత్త్వవేత్తలమనీ, పండితుల మనీ భ్రమపడతారు. కొందరు బలహీనులై, శరీర దుర్బలులై అదేశకి అనుకుంటారు. ఆధిక్యతాగర్వంవల్ల, మదోన్మత్తులై నిర్జల ప్రదేశంలో చేపలు పట్టినట్టు బాధలు పొందుతారు, భ్రమిస్తారు. ఆస్తివల్ల, స్వధనంవల్ల బాధపడే యీ విచిత్ర మానవులకు విజ్ఞానం, విముక్తి అవుసరం. ధన వ్యామోహాలు బిరుదులూ, అధికారాలు నశించుగాక! సమానతే సౌఖ్యానికి పునాది. అధికాశలూ, అసూయా, మౌఢ్యము, జంతుతత్వాని కంటే హీనమైన కూడబెట్టే స్వభావంవాళ్ళను చికాకు పరుస్తుంది. అధికారజ్వరాలూ, ఆశా వ్యామోహాలూ నశించు గాక! "నీవు యెంతగా దేన్ని పొందిఉన్నావో, అంతగా దాని వల్ల నీవు బద్ధుడవై యున్నావు" అనే నిత్యసత్యం వారి కర్ణాల్లో ప్రతిధ్వనించునుగాక!

ఓ సత్యాన్వేషీ! నాగరికతయొక్క ఒత్తిడికి లోబడి పోకు. నీ చుట్టూవున్న జగతినడతకు కట్టుబడకు. ఈ అభ్యుదయ నాగరికజాతులనబడే వాటి ఆడంబరాలకు మోసపోకు. అభివృద్ధిని సూచిస్తూ వారుచెప్పే లెక్కలు నమ్మకు. అదంతా ఒక కల్పితకథ. వాళ్ళు చూపే డబ్బు లెక్కలకు చలించకు. ఇరవయ్యో శతాబ్దంలో, నాగరికజాతులు తమ ప్రభుత్వ విధానాలూ, జీవితపద్ధతులూ మార్చుకోని, వేదాంతము, స్వాతంత్ర్యము పునాదులుగాగల సూత్రాలపై పునర్నింపబడే రోజులు సమీపిస్తున్నవి. వైదాంతిక పరిత్యాగం అవలంబించి

ఆస్తి ధన భావత్యాగం చేయడంలోనే, వ్యక్తుల జాతుల విముక్తిమార్గం గోచరిస్తుంది. యితరమైనమార్గం యింకోటిలేదు.

పాశ్చాత్య నాగరికతా దేశాలన్నింటిలోనూ ధన దాహం తీవ్రంగా ఉంది. ఆస్తి కట్టుబాట్లను విచ్ఛిన్నంచేసే శక్తులు అప్పుడే అక్కడక్కడ తీవ్రంగా చెలరేగినై. పరిత్యాగ రాజ్యం జగత్తుకు శ్రేయస్కరమైనది. అది స్వతంత్రమైన రాజ్యం.

ప్రశ్న : అయితే మీరు కొత్తమతాన్ని బోధిస్తున్నారన్న మాటా ?

సమాధానం : రాముడు యేక్రొత్తనూ ప్రతిపాదించడం లేదు. సత్యం స్వయం ప్రతిపాదితమైంది. రాముడు యేవిధమైన అడ్డులుమాత్రం కల్పించడు. తను నిర్మలంగావుండి తేజస్సును నిరభ్యంతరంగా ప్రకాశించేటట్టు చేస్తాడు, అది యేరూపంలోనైనా ప్రకాశించనీ. మనోదేహములు తేజోవంతములగునుగాక, యింతకంటే అదృష్టవంతమైనది లేదు. వార్తను గ్రహించి వార్తాహరుణ్ణి వదిలిపెట్టు.

ప్రశ్న : మీరు ఒక మతప్రవర్తలా ?

సమా : కాదు. అది నా ప్రతిష్ఠకు తక్కువ అయినది. నేను భగవంతుణ్ణే. నీవుకూడా అంతే. ఈ దేహం నాకు సాధన మాత్రమే.

ప్రశ్న : మీ ప్రబోధం ఫలవంతంకాజాలదు. మానవులు దాన్ని గ్రహించను సమర్థమైన స్థితిలో లేరు.

సమా :- నాకు దానితో సంబంధంలేదు. నేను అంటే సత్యం. ఈ స్వల్పవిషయాల్లో నడవను. యుగయుగాలు నావి. అనంతమైన కాలం నాది. తన స్వదేశ ప్రజలచే తిరస్కరింపబడి, క్రీస్తు జగద్ధ్యేయుడైనాడు. అలాగే తన కాలంలో తిరస్కృతుడైతే ఆగామికాలంలో తనను గుర్తిస్తుంది.

ప్రశ్న : మీ అభిప్రాయాన్ని చరిత్ర ఒప్పుకోదు.

సమా : మీ చరిత్ర అసంపూర్ణమైంది. ఈ నేను చెప్పిన సత్యం చరిత్రలో వ్రాసే అధ్యాయాన్ని నీవింకా చదవనే లేదు. 'యిచ్ఛ' ముందర చరిత్ర ప్రారంభిస్తుంది. ఒక మానవుడి యిచ్ఛ అయినా సరే చిహ్నాలనుమాత్రం చర్చించి నిజమైన కారణాన్ని వదిలిపెట్టితే చరిత్ర వ్యర్థమౌతుంది.

ప్రశ్న :- 'యెమర్సన్' దృష్ట్యా చూస్తే యితర్లను తనలాగానే మనసారా చూడడం నిజమైన ప్రేమబంధలక్షణం. మరి మీరు యే యితరులతోను యేకీభవించడం లేదుగదా! ఎంత ప్రేమశూన్యజీవితాన్ని గడుపుతున్నారు!

సమా :- అనేక దృష్టులతో నా చిత్రమైన జగత్తును నేను చూడగలను. వెనుకనుండి ఒక మితవాదిలాగా ఇక్కడ చూస్తాను. ఇంకోచోట అభివృద్ధికరమైన అభ్యుదయవాదిలాగా ముందర ఉండి చూస్తాను. రాముడిలాగా (లేక పురాణాలాగా) కుడినుంచి పరీక్షించి, అభ్యుదయవిమర్శకుడిలా యెడమనుంచి చూస్తాను. ఈ పార్శ్వదృక్కులన్నీ నావే. వెన్న తీసేటప్పుడు గొల్లభామ కుడి యెడమచేతుల్లోని రెండు తాళ్లను లాగుతుంది. అన్ని అభిప్రాయాలు నావే అయినప్పుడు ఇంకొకరితో

నేనెల్లా భేదిస్తాను? వివిధ తరంగావృతమైన ప్రేమసముద్రాన్ని నేను. ప్రతి ఒకరితోనూ, అందరితోనూ భేదించనే నేను ఒప్పు కుంటాను. యీ భేదంలో ఐక్యతను నాతో అనుభవించను రా.

ప్రశ్న:- ఇది అయోమయంగా లేదా? పూర్తిగా వేరు పడి ఉన్న ఒక వ్యక్తితో యింకో వ్యక్తిని యెలా మిళితం చేస్తారు?

సమా:- సరే. అది అలాఉంటనీ, చూడడానికి మాత్రం మనం అందరం ఒకటికాదు; గాని నిజంగా ఒకటే. నాకూ ఆశ్చర్యంగానే ఉంది.

అసంపూర్ణమైన తత్వశాస్త్రం దీన్ని ఋజువు చెయ్యలేక పోవచ్చు. యీసత్యం యింద్రియగోచరం కాకపోవచ్చు. కాని, అది అంతే. సత్యం సాధింపబడిన అనంతరం మోహాలు మాయమైపోతై. ప్రేమ తత్వమసి అని చూపిస్తుంది. నీవే భగవత్పదార్థానివి.

ప్రశ్న:- భగవత్పదార్థం అంటూ రెందుకు?

సమా:-కొందరు భగవంతుణ్ణి స్వర్గంలోఉన్న తండ్రిగా ఆరాధించి 'ఆయన' అంటారు. మరికొందరు పరమాత్మను దివ్యజననిగా భావించి 'ఆమె' అని సంబోధిస్తారు. కొంతమంది పారశీక కవుల్లాగా 'ప్రియుడు'గా భావిస్తారు. కాబట్టి భగవంతుడి పరంగా ఏ సర్వనామాన్నైనా ఉపయోగించే ముందు తమతమ భావానుసారం నిర్ణయించుకోవాలె.

ప్రశ్న:- అయితే భగవంతుడు వీటిల్లో ఏది?

సమా:- ఏదీ కాదు. ఒక విచిత్రం!

## అరణ్య ప్రసంగాలు 2.

### ఆస్థి

ఈ క్రింది విషయంలో చాలాభాగం, నాలుగు దార్లు కలిసే చోట వచ్చిన ఒక ప్రశ్నకు ప్రత్యుత్తరంగా వ్రాయ బడింది.

*    *    *    *

దివ్యుడా ! ఆస్థి హక్కుల్ని గురించి రాముడి అభి ప్రాయాలు అడిగిన వాడివి నీవేనా? నీవు నన్ను క్షమిస్తే, ఆస్థి హక్కు లనేదాన్ని ఆస్థి - అన్యాయాలంటాను. ప్రశ్నించిన మనిషి యెవరయినా సరే రాముడి దృష్టిలో యీ దేహం తోనైనా, యింకో రూపంలోనైనా, నీ ఆత్మే ప్రశ్నించినట్లు అవుతుంది.

ఆస్థి అంటే ఏమిటి?

ఒక వస్తువుమీద ఒకనికి ఉన్న హక్కు—లేదా దాని స్వభావం నైజమైన తేలికదనం, మండే స్వభావం మొదలైనవి ఉదజని స్వభావాలు. (Properties of Hydrogen) కాని దాన్ని లోపల నింపుకొనే గ్లాసు మాత్రం దాని ఆస్థి గాదు. అలాగే మానవత్వం— కాదు బ్రహ్మత్వం— నీ స్వభావం. కాని, నీవు నివసించే యిల్లు, నీ సొమ్ములు యివన్నీ నీ ఆస్థులు కావు. తమ జన్మహక్కు, తమ సహజమైన ఆస్థి అయిన బ్రహ్మజ్ఞానాన్ని వదలుకోడానికి ప్రజలు యిష్టపడుతున్నారు. కాని, యిల్లు, బంగారం మొ॥ వాటికి అంటిపెట్టుకొని, తీవ్రంగా అవి వారి ఆస్థులని నమ్మి అపహాసపాత్రులగుచున్నారు. ఎంత విచిత్రము!!

తోడుక్కున్న చెప్పులనుబట్టి మానవకోటిని భాగాలుగా తరగతులుగా విభజించితే యెలా అసహజంగా ఉంటుందో, అలాగే సిరిసంపదలు, ఆస్తిపాస్తులవల్ల కలిగిన తరగతులు కూడా అంత హాస్యాస్పదంగానే ఉంటాయి.

ఇందువల్ల రాముడు చెప్పేదేమిటంటే, ఆత్మజ్ఞానానికి ఉన్న అడ్డుతెర ఆస్తిజ్ఞానము, అని, మాట ముల్లెలమీదా మన కున్న హక్కు లన్నమాట. మనం దేనినైనా పొందిన మరు క్షణంతో ఆత్మచ్యుతిభూతానికి పట్టుబడుతాము. పరిత్యాగము-దీన్నే సర్వసంపద అనవచ్చు. అంటే సత్యంతో సమైక్యం పొందడమే వేదాంతము. సంపూర్ణప్రజాస్వామ్యం, సర్వసమానత్వం, పరాధికార నిరాకరణా, వస్తుసంగ్రహణబుద్ధివిసర్జనా, ఆధిక్యతా, అహంకారాలు విడవడం, న్యూనతాభావం పారద్రోలడం — ఇవన్నీ భౌతిక వేదాంతసూత్రాలు. వేదాంతం ఆధ్యాత్మికమనోరంగాలకు కూడావర్తిస్తుంది. అన్నింటియందూ నీ హక్కును వదలుకోవడం, నీ దేహమూ, జ్ఞానమూ, రచన, సుభాషితాలూ, నీ యిల్లూ, కుటుంబమూ, కీర్తి, ప్రతిష్ఠా— వీటన్నిటియందు హక్కు వదలుకోవడం వేదాంతం. నీ చుట్టూ ఉన్న ఆవరణలను నూతనం చేయడం, యితరులను అవతలకు త్రోయడంద్వారా నీకు నీవు చుట్టూ గోడలు కట్టుకోకపోవడం, అంటే, భగవంతుడిలాగా ప్రపంచంలోని ప్రతి శక్తీ, అణువూ, నక్షత్రమూ, చెట్టూ, చేమా మీద అధికారం సంపాదించడం వేదాంతం. తరచుగా తెలియకుండానే యావత్ప్రపంచాన్ని వేదాంతమార్గానికి నడపడానికి ప్రయత్నాలు జరుగు

తున్నవి. తుదకు సన్యాసపతాకం జగత్తంతటిమీదా యెగిరి తీరాలె.

అప్పుడే కొందరు వేదాంతులు సంపూర్ణమైన ప్రేమ ప్రభుత్వంలో జీవిస్తున్నారు. కొన్ని వేల్ల చరిత్రాతీతపూర్వకాలం నుంచీ, యీ తేజస్సు ప్రకాశిస్తూనే ఉంది.

ఆవులూ, కుక్కలూ, చేపలూ, పక్షులూ నిర్భయంగా సమీపించి ప్రేమప్రేరితాలై, తన చేతిలోని ఆహారంలో భాగం పంచుకొంటుంటే, గంగాతీరంలో ఆసీనుడై ఉండే ఒకానొక మహర్షిని గురించి కొంచెం ఆలోచించుకోండి. ఒక తీవ్రమైన ఉదాహరణ చూపిస్తాను.

నేనొక స్వాములవారిని యెరుగుదును. భాధాకరమైన గాయంవల్ల అతని దేహం కష్టపడుతున్నది. చర్మాన్ని పురుగులు తినేస్తున్నవి. కాని వాటిని చంపను యేమందూ వాడలేదు సరిగదా, పైగా, కడుపునిండి క్రింద పడిపోయిన పురుగులను నవ్వుతూ, సంతోషంగా, మళ్ళీ గాయంలో యథాస్థానంలో పెడుతున్నాడు. ఈ చిన్నదేహము, ప్రపంచంలోని ప్రతి జీవికీ చెందుతుంది. ఈ విశాల ప్రపంచం నాకు చెందుతుంది. ప్రపంచమే నాదేహము. వాయువునాకు కట్టుకునే వస్త్రం, భూమి నాపాదరక్షలు.

స్వామి అంటేనిరంతరంయిచ్చేవాడన్నమాట. సత్యాన్ని మాత్రం ఉంచుకొని మిగిలిన యావత్తు వదలిపెట్టు! సన్యాసి తన వద్దవున్న భిక్షనుకూడా, యెక్కువ అక్కరగావున్న యితరులకు యిస్తాడు. యివ్వటు యింక యేమీ లేకపోతే తన

దేహాన్ని, ఈగలకూ క్రిములకూ పురుగులకూ మహా సంతో షంతో యిస్తాడు. ఇలా యిస్తూ, అందరి ఆత్మా, తనేగనుక ప్రతి గ్రహీత పొందే ఆనందాన్నికూడా పొందుతాడు. తన దేహ మాంస భక్షణసమయంలో యీగలూ పురుగుల్లా తనూ ఆనందిస్తాడు. ఎముకలు ఎండేటప్పుడు, గాలి వేడిమిలా తనూ ఆనందిస్తాడు.

సామాన్య దానము:—సంఘంలోని ఒక భాగాన్ని దరిద్రులుగాచేసి, పీడించి బలవంతంచేసి కూడబెట్టిన ధనంలో కొంత తిరిగి యిచ్చివేయడమే, ఘనకార్యంగా, పెద్ద దానంగా పిలువబడుతుంది. ఆసిఙ్జానం యింతవరకు తెచ్చింది; యిలా అనిపిస్తున్నది. ఒక చనిపోయేవాడినోట్లో యిన్ని నీళ్లుపోయడం, అతనుబ్రదికి తద్వారా అతను యాతన యింకాకొన్నాళ్లు యెక్కువ అనుభవించడం, గొప్పపనిగాబోలు! వడ్డీకట్టకుండా వదలడం చాలా ప్రేమపూర్వకమైన పనిగా చూడబడుతుంది; యెందుకంటే, వడ్డీలు అలవాటైపోయినవి గనుక.

యిది యూరపు, అమెరికాదేశీయుల ధర్మకార్యవివరణ. కాని,హిందూదేశంలో దానధర్మాలు కూలినాలి చేసుకొని జీవించే, అనేక రోజులు పస్తుపండుకొంటూ గత్యంతరంలేక బ్రతికే; చావలేకబ్రతికే, శూద్రుల శ్రామిక జీవులనుగురించి అంతగా ఆలోచించవు—పట్టించుకోవు. మత ప్రతినిధులమని చెప్పారుంటూ దేవాలయాల్లో పొట్టలుపోసుకునే కడుపులు నిండిన సోమరిపోతులను పోషించడంద్వారానూ, దానధర్మకార్యాలుయిచ్చిన ఆ ఉదారపరులను నేరుగా స్వర్గానికితీసికొనిపో.

నేను నిరాడంబరతను, నాగరికతగా చేస్తాను. నిన్ను ఆకర్షణీయుంగా యేదిచేస్తుంది? నిన్ను మూసివేసే వస్త్రములా? నీ అంతస్సునువెలిపరిచే తేజస్సా? వస్త్రాదులనుండి గాని, యితరవాటినుండిగాని సౌందర్యాన్ని అప్పుతెచ్చుకో నక్కరలేదు. సహజమైన చిరునవ్వులు, ఆరోగ్యము, ఉత్సాహాముమాత్రం ధరించు.

యెవరైనాసరేవచ్చి దొంగిలించుకొని పోమ్మను,

ప్రభుత్వాన్ని సిరిసంపదల పిచ్చిలోపడి కొట్టుకోని! నీకెందుకు. నీభాగాన్ని మాత్రం నీవు యివ్వరు. సత్యమే నీ ఆత్మ. భౌతికసంపదకు ప్రాకులాడకు, సత్యంకోసం నీవు నిలువబడు. మనకు విశ్వవిద్యాలయాల పట్టాలు కావలెనా! బుద్ధిహీనత! ఆ చివరపట్టా స్వయంగా సంపాదించాలె.

కలలో పెద్దపులిని చంపడానికి, కలలోని కత్తే కావాలె. కానీ, జాగ్రదవస్థలో, స్వాప్నికమైన ఆ కత్తీ, ఆ పెద్దపులీ రెండూ యెందుకూ పనికిరావు.

అదేమాదిరి, పదార్థ విజ్ఞానశాస్త్రాలూ కళలుకూడా, ప్రాపంచక విజ్ఞానంగా వాటికెంత ప్రాధాన్యతఉన్నా దివ్యజ్ఞాన ప్రబుద్ధస్థితిలో విలువలేనివే. ఆత్మజ్ఞాన మార్గంలోవున్న పెద్ద అడ్డుశిలల్లో ఒకటి - విశ్వవిద్యాలయ పట్టాలకూ బిరుదులకూ, ఇలాంటి మానసిక సంపదలకు చూపించే మహా గౌరవమూ, భద్రత. జ్ఞానికి ప్రపంచం ఒక గారడీ విద్యాప్రదర్శనం ప్రపంచ వస్తువులన్నీ మోహితుడు కల్పించుకున్న నేలమీది సరస్సుల్లాంటివి. ప్రపంచ మలాంటిదైనప్పుడు, తత్సంబంధమైన విజ్ఞా

నంతో మేము మహా పండితులమనుకొనే వారి విజ్ఞానంగూడా మాయగాక ఇంకేమిటి. ప్రపంచం భావనే, దాని సంబంధ మైన ప్రజల జ్ఞానంకూడా కేవల భావనే. దృశ్యప్రపంచ శిఖ రాగ్రం చేరుకున్న జ్ఞానికి జగత్తులోని మహా భూభాగాలు గాని, నదులుగాని, పర్వతాలుగాని, సూర్యులుగాని నక్షత్రాలు గాని ఆశ్చర్యకరంగా కనిపించవు. అదీగాక, వీటికి సంబంధించిన విజ్ఞానం,—ఖగోళశాస్త్రజ్ఞులు, గణితశాస్త్రజ్ఞులు, వృక్షశాస్త్ర జ్ఞులు, జలశాస్త్రజ్ఞులు; జంతుశాస్త్రవేత్తలు, మొదలైనవారు సంపాదించామనుకునే విజ్ఞానం — కూడ. జ్ఞానికి ఆశ్చర్యకరం కానేరదు. ఇదంతా హాస్యంగా, ఒక నాటకంగా, బూటకంగా మాత్రమే తలుస్తాడు. ప్రాపంచిక వస్తుసంగ్రాహకులు (పెట్టు బడి దారులు) ఆయా వస్తుసంబంధ విజ్ఞానవేత్తలూ (శాస్త్ర జ్ఞులు) యిద్దరూ ఆ వస్తువుల పరిధిలోనే ఉంటారు. అంటే యీ దృశ్య ప్రపంచ సంబంధులు మాత్రమే నన్నమాట. పండితుల, తత్వవేత్తల విమర్శలూ సలహాలూ, నిగ్రహానుగ్ర హాలూ, యివన్నీ బ్రహ్మజ్ఞానిముందర మోకరిల్లుతాయి. అత నికి అవి నిరర్థకాలు. (సామాన్యంగా ఈ విశ్వవిద్యాలయాలూ ప్రదర్శనాలూ. జగత్సమ్మోహన స్థితిని సుదీర్ఘంచేసే వివిధ సాధనాలు మాత్రమే.) చర్చిలూ, దేవాలయాలూ, సభలూ సమావేశాలూ, గూడా సమ్మోహిత స్థితియైన జగన్నిద్ర కార్యం దీర్ఘం గావడానికి ఏర్పడిన వివిధ సాధనాలు. సూర్యుడు చల్లబడినా, చంద్రుడు చండకిరణుడై వేడిమి వెదజల్లినా జీవ న్ముక్తుడు ఆశ్చర్యపడడు. అగ్ని ఉపరిభాగమందుగాక,

కాష్టముయొక్క అధోభాగజ్వలితుడైనా, నిరవకాశమైన ఆకాశప్రదేశమంతా ( Space ) కాగితం చుట్టలాగా చుట్ట బడినా అది అతనికి ఆశ్చర్యకరం కానేరదు. బ్రాహ్మణులు (పౌరోహితవర్గమూ) జగత్తును పరిపాలించిన రోజులు ఉన్నవి. ఒకనాడు క్షత్రియులు (భుజబలం, ధైర్యసాహసాలు) జగత్పాలకులైనారు. ఈనాడు వైశ్యులు (పెట్టుబడిదారీ వర్గం) పరిపాలిస్తున్నది. శూద్రుల, అంటే శ్రామికుల రాజ్యం రాబోతున్నది. ఈ శూద్రులు యెలాంటివారు ? సన్యాసభావ పూరితులైన శ్రామికులు అన్నమాట.

యూరోపు, అమెరికాదేశాల్లోవున్న శ్రామికవర్గం, ఒక సంకుచిత మతానికీ, సంప్రదాయాలకూ కట్టుబడి ఉండలేదు. ఐనా వారివిషయం చాలా అసంతృప్తికరంగానే కనబడుతున్నది.

ఇండియాలో, వర్ణవ్యవస్థవలన అన్యాయం, అక్రమమూ ద్విగుణీకృతం చేయబడి అన్నివర్గాల స్వయంపతనానికి దారులు ఏర్పడినవి. వర్ణవ్యవస్థ సమ్మెలను రాకుండా చేస్తుంది. కాని, జాతినంతా బలహీనులుగాచేసి గొఱ్ఱెలమందకంటె హీనమైన పిరికిపందలుగా తయారుచేస్తుంది.

యిప్పటిదాకా వేదాంతము కొద్దిమందికి మాత్రమే ప్రత్యేకపు ఆస్తిగాఉన్నది. మేధారంగంలో మాత్రమే ఎక్కువగా విహరించింది.(యుగాయుగాలక్రితం సృష్టిఅయిన యీపసిబిడ్డ భూగర్భంలో (అంటే హిమాలయగృహాగర్భాల్లో) మాత్రమే దాగిఉంది.) కాని, చివరకు గంగానదీపూతజలప్రవాహంగా మైదానాలకుదిగి, బ్రాహ్మణులనూ, శూద్రులనూ,

మానవుణ్ణీ, దేవతనూ ఒకేరీతిగా పునీతంచేసుకుంటూ రకా రకాల కృత్రిమ భేదాలను తుడిచి వేస్తున్నది. దైహికంగా, ప్రతిమానవుడూ ఒకటే. యీ భావం కొద్దిగా గుర్తించబడింది. ప్రతిరోజూ నీకు కావలసిన ఆహారాన్ని క్రమంగా తీసికుంటావు. యిది నీవు తెలిసిచేస్తావు. కాని, ఆహారపదార్థం జఠరంలోని వివిధభాగాలకూ, వివిధమార్గాలద్వారా చేరటం నీకు తెలియ కుండానే జరుగుతోంది. అలాగే, నీవు ఐక్యత, ఏకత్వంమీద, అంటే ప్రేమ, దైవత్వంమీద మనస్సును కేంద్రీకృతంచేస్తే, విభిన్నత, భేదభావమూ, దానంతటఅదే పలాయనమవుతుంది.

రాజకుమారులారా! పౌరోహితులారా! శూద్రు లారా! హిందూదేశంలో పరిపాలనసాగించే రాజకుటుంబీకు లారా! ముందు కొన్ని సంవత్సరాలకు రాబోయేస్థితిని మీరు ఊహించి చూడగలరా?

దాన్ని విపరీతమనీ, విచిత్రమనీ అంటారేమో! కాని, నామాటకు, నేనొక స్వాప్నికజగత్తును చూస్తున్నాను. అక్కడ దేవతలు భూమిమీదనే విహరిస్తున్నారు. ఈనాటి ఒంకమంటి విభేదాలు, ఈ తరగతులు నశించిపోయినై. యిండియా, చైనా, అమెరికా, ఇంగ్లాండు దేశాల్లోని విభేదాలు పూర్తిగా మాయ మైనై. సర్వనైర్మల్యగంగ సమస్తప్రపంచాన్నిముంచెత్తుతున్నది.

స్వాప్నిక ప్రియులారా! మానవుల్ని కొలిచే కొలబద్ద లను మీ దృష్టులనుంచి వేరుచేయండి! మహా సన్న్యాసులు శూద్రసహవాసం చేయడాన్ని గమనించండి. ఓహో! సన్న్యా సుల భిక్షాపాత్రిక శ్రామికుల 'పార'గా మారింది. సన్న్యాసులు

తమ సోమరితనాన్ని పారద్రోలారు. శూద్రులు అంటే శ్రమ జీవులు. సన్యాసుల ప్రతిష్ఠాస్థానాన్ని అందుకున్నారు. అందరిలో పరిత్యాగభావమే ప్రజ్వలించింది. లజ్జాహీనమైన భోగకాంతల ధైర్యమూ, రాముడి పావిత్ర్యమూ కలుసుకున్నై. గొర్రెపిల్లసాధుత్వము, సింహ ధైర్యంతో మేళవించింది. అగ్రాలు కలిసినై. మధ్యనవున్న కృత్రిమ భేదాలు నశించినై. ప్రపంచమంతా ఒక కుటుంబమైంది. ఈ స్థితినంతా చూడండి- అదిగో! అదిగో!!

మీకు కత్తితోగాని, తుపాకితోగాని అవసరముందా? లేదు. పోలీసుదళాలు కావాలా? అక్కర లేదు. నేను వర్ణించిన సామాజికవ్యవస్థ గంధర్వనగరం లాంటిదా? యెప్పటికీ కాదు. ఇదంతా కమ్యూనిజమూ, సోషలిజమూ అంటారా? అయితే కావచ్చు. అయితే యిది హిందూదేశానికి సహజమైన సిద్ధాంతము. వేదాంతసూత్రముల సహజమైన సమాచరణమే!

భారతీయులారా! మిమ్మల్ని మీరు తెలుసుకోని యీ పరిత్యాగ సిద్ధాంతం ఆచరిస్తే, ఇంక చిక్కు యెక్కడిది? మనోరుజ పోతే భౌతికరోగాలు తప్పకుండా పలాయనమై పోతై. కృత్రిమ మార్గాలు అక్కరలేదు. సిద్ధాంతాలు అనవసరం. అనుమానాలూ, భయాలూ అవసరంలేదు. అవన్నీ పిరికివాళ్ళను అనుసరించనీయండి.

మీ హృదయాలు సింహాసనాలు గాగల రామసార్వభౌముణ్ణి నేను. నేను వేదాలద్వారా ప్రబోధించినప్పుడు, కురుక్షేత్రంలో చెప్పినప్పుడు(గీత) జెరూసెలంలో (క్రీస్తు) మక్కాలో

(మహమ్మదు)బోధించినప్పుడు, నేనూ, నాబోధలు సరిగా అర్థం చేసుకోబడలేదు. మళ్ళీ నాకంతాన్ని యెత్తాను. నాకంత మేమీ అందరికంతమూనూ. తత్త్వమసి! నీవు చూస్తూన్న ప్రతీదీ నీవే!

మీలో కొందరు పెడమొగాలు పెట్టారు. కొందరు ముక్కు విరుపులు సాగించారు. అసహ్యంతో కొందరు చేతి లోని కాగితాన్ని అవతల పారేశారు. యేమన్నా చేయండి, కాని (ప్రళయంలాంటి మార్పు) జరుగవలసిందే. ఏ శక్తిగాని, యే రాజులుగాని, దేవతలుగాని, దయ్యాలుగాని దాన్ని ఆప లేవు సత్యంయొక్క ఆజ్ఞ అవశ్యం నిర్వర్తింపబడవలసిందే. భయపడకండి. నా శిరస్సే (బుద్ధి) మీ శిరస్సు. మీకు ఇష్ట మైతే దాన్ని నరకండి. కాని దానిస్థానాన్ని ఆక్రమించుకోను యింకో సహస్రశిరస్సులు సృష్టింపబడు తై.

షామ్సు - టేబ్రిజ్ (Shams - Tabriz) ఇదే గానం చేశాడు. మధురహృదయుడైన బుల్లా, శక్తివంతుడైన పంజాబు దేశపు గోపాలసింగు యిదే పాడలేదా? క్రీస్తు ఈ సత్యాన్నే ప్రబోధించాడుగదా ? ఈ చంద్రవంకనే మహమ్మదు చూచాడా? అది నాకొక పెద్దవిషయం కాదు. కండ్లు తెరిస్తే నాకీ సత్యం కనపడుతున్నది.

పురాతన సత్యము ఎప్పుడూ నిత్యనూతనమైందే. నిన్ను నీవు తెలుసుకుంటే సర్వమూ నీకు అవగతమవుతుంది. నీవు నీ సత్యాత్మను, సత్యస్వరూపుడైన భగవంతుని తెలుసుకోవడ మనే ప్రబుద్ధస్థితికివచ్చిన తక్షణమే, నీ అజ్ఞాన స్వాప్నికపురుషు లైన మహాత్ములూ, ప్రవక్తలు నీలోకలిసి మాయమైపోతారు.

ఓం! ఓం!! ఓం!!!

# అరణ్య ప్రసంగాలు 3.

## సంస్కర్త

భూగోళ పరిధుల నధిగమించియును
పై పైకి పై పైకి ఎత్తుల కీవు
అగ్ని మేఖలవోలె ఎగిరిపోయెదవు;
నీలిమాకాశ పథాంచలంబులకు
మధురగానముతోడ ఎగిరిపోయెదవు,
రవ్వంత కల్మష వాసనే లేక
సతమీవు మధురగానమున దేలెదవు."

షెల్లీ.

## పవిత్ర చాయ

(ఫ్రెంచి భాషలోనుండి మత్ క్రాఫ్ట్ వలన అనువదింపబడింది.)

అనగా అనగా ఒక ఋషీశ్వరుడుండేవాడు. ఆయన చాలా మంచివాడు. స్వర్గంనుంచి దేవదూతలు, ఒక మనుష్య మాత్రుడు యింత దైవికుడుగా యెలా ఉంటాడని ఆశ్చర్యపడి చూడడానికి వచ్చారు. ఆయన నిత్యకృత్యాలు జరుపుకుంటుండేవాడు. పూవు పరిమళాన్నిలాగా, నక్షత్రం కాంతినిలాగా తన పవిత్రతను దశదిక్కులా వెదజల్లుతుండేవాడు. ఆ సంగతి ఆయనకు తెలీనే తెలేదు.

ఆయన నిత్యకృత్యాలు రెండు ముక్కల్లో చెప్పొచ్చు. ఆయన ఇచ్చేవాడు- మరిచిపోయేవాడు. అయినా ఏమాటలు ఆయన నోటివెంట వచ్చేవికావు. ఆయన చిరునవ్వులో, దయా

ర్శిత్వంలో, ధర్మగుణంలో, ఓపికలో మాత్రం ఆ మాటలు వ్యక్తమవుతుండేవి.

దేవదూతలు భగవంతుడితో చెప్పారు—"దేవదేవా! ఆయనకు అద్భుతశక్తులు ప్రసాదించవలసింది" అని.

భగవంతుడు అన్నాడు—"సరే. ఒప్పుకున్నాను. అడగండి. ఆయనకు యేంకావాలనో,"

వాళ్లు వచ్చి ఋషితో యిలా అన్నారు—

"ఏమండీ ! మీ హస్తస్పర్శమాత్రంచేత రోగగ్రస్తులు ఆరోగ్యం పొందేటట్లుగా వరంకావాల్నా ?"

"అక్ఖర్లేదు. భగవంతుడే ఆపని చెయ్యాలని నాకోరిక." అన్నాడు ఋషి. "దోషులనూ, పతితులనూ ఉద్ధరించి సన్మార్గానికి త్రిప్పే సమర్థత కోరుకుంటారా" ?

"వద్దు. అది దేవదూతల కర్తవ్యం. నేను మార్చను."

"శాంతికి ఆదర్శంగా ఉండి, మీ గుణకాంతులచే మానవులను ఆకర్షిస్తూ భగవంతుణ్ణి యితోధిక ప్రకాశితుణ్ణిగా చేస్తుంటారా ?"

"కాదుకాదు. మనుష్యులను నే నాకర్షిస్తేవాళ్లు భగవంతుడికి దూరులౌతారు భగవంతుడు స్వయంప్రకాశుడు. యితర మార్గాలు అనేకం ఉన్నై ఆయనకు ఆధిక్యతా ప్రతిపాదకాలు" అన్నాడు ఋషి.

"అయితే మీకు యేమవరంకావాలి" అని ప్రశ్నించారు దేవదూతలు.

"నేను దేన్ని కోరగలను!" అని చిరునవ్వునవ్వుతూ ఋషి అన్నాడు.

"భగవంతుడు నాకు తన అనుగ్రహాన్ని ప్రసాదించాడు. దానితో నాకు అన్నీ ఉన్నట్లేగదా"—

కాని దేవతలు ఇలా చెప్పారు.

"మీరు యేదో ఒక శిద్ధిని కోరుకోవాలి. లేదా బలవంతంగానన్నా యిస్తాము" సరేనని ఋషి "నాకు నేను చేస్తున్నా నసేవిషయం ఎప్పుడూ, తెలేకుండానే నేను జగత్కల్యాణకరమైన చాలా మేలుచయ్యాలి" అని వరం కోరాడు. దేవదూతలకు అర్ధంకాలేదు. అందరూ ఆలోచించుకొని ఒక మార్గం ఆలోచించారు. ఋషి నీడ, ఆయనకు కనపడకుండా ఉండేటట్లు వెనకనో ప్రక్కలనో పడుతుండాలి. ఆ నీడకు జబ్బుల్ని నయంచేసేశక్తి, బాధను తగ్గించేశక్తీ, దుఃఖనివారణశక్తీ ఉండాలి— యిదీ ఉపాయం.

సరే ఆలాగే జరుగుతున్నది. ఆయన నడుస్తుంటే, నీడ వెనకనో ప్రక్కనోపడి, యెండిన చెట్లమొక్కలు మళ్ళీ చిగిరించడం, దారుల్లో పచ్చిక మొలవడం, యెండిన గుంటల్లో నిర్మలోదకం చేరడం, వాడిన పసిబిడ్డలముఖాల్లో కాంతులు ప్రసరించడం, దుఃఖమగ్నులైన తల్లులకు ఆనందం కలగడం— యిలాగా జరుగుతున్నది.

కాని, ఆయన నిత్యకృత్యాలు జరుపుకుంటుండేవాడు. పూలలోంచి పరిమళంలా, నక్షత్రాల కాంతిలా ఆయన సుగుణపుంజములు తనకు తెలేకుండానే వ్యాపిస్తుండేవి.

ఆయన న(మతను గౌరవిస్తూ, (ప్రజలందరూ, మహా త్తును గురించి యేంమాట్లాడకుండా నెమ్మదిగా ఆయన్ను అనుసరించేవాళ్లు. క్రమక్రమంగా ఆయనపేరుకూడా మరిచి పోయి 'పవిత్రచ్ఛాయ' అని పిలుస్తుండేవాళ్లు.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా-జీవో బ్రహ్మైవ నా పరః—"

తెలుగులో అర్థము.

సత్యం మహాత్తరమైనది. దాని ఆధిక్యతముందు అన్ని ఆడంబరాలూ, మానవుల మనీషన్సుల నిరర్థక ప్రదర్శనాలూ, అదృశ్యమైపోవాలి. సత్యంతో నీ సమైక్యత నిజమైనదీ; దృఢ మైనదీ, అయితే, — క్రూరత్వం నిన్ను సమీపించలేదు. గాండామృగపు కొమ్ముకు నిన్ను పొడవడానికి తగిన పదును లేదు. మరి పెద్దపులికి కరవనుచోటు దొరకదు. ఖడ్గానికి నీలోకి గ్రుచ్చుకొని పోవడానికి సమర్థత ఉండదు. నీమీద ఫిరంగులు వర్షించినా, నిన్ను తాకనన్నా తాకలేవు.

నీ సహవాసం సత్యంతో మాత్రమే ఉండాలి. సత్య మార్గంలో నీవు ఒక్కడివేఉన్నా, సత్యంతో జీవించి, సత్యం తోనే చావు.

సత్యజీవిత శిఖరాగ్రంలో నీవు యేకాకిగా నిలుచు న్నప్పుడు, న్యాయసూర్యుడే నీకు తోడౌతాడు. నీవు యిచ్చే జీవత్సలహాలు స్నేహితులు గ్రహిస్తారు. ఇలా వృద్ధిపొందిన సంఘం సహజమైంది. సంఘులవెంటా రాయబారాలవెంటా పరుగెత్తవాకు. నాకు యెవరూ శిష్యులుగాని, పరివర్తితులు గానీ అవసరంలేదు. నేను సత్యంతోనే జీవిస్తాను. సత్యానికి

యెవరూ బలపరచేవాళ్ళు అక్కర్లేదు. సూర్యకాంతి భూమి మీదికి రావడానికి మధ్యవర్తులు యెందుకు? నేను సత్యాన్ని వ్యాప్తిచెయ్యను. ప్రచారం చెయ్యను. సత్యమే నన్ను ప్రచారంచేసి తను వ్యాపిస్తుంది.

పరిణామవాదులు యిలా అంటారు. "తెలివిగా కొన్ని అవసరమైన పద్ధతులు అవలంబిస్తే జగజ్జీవితం అంత కష్టమైనది కాదు. జంతువుల గుంపులు,వృక్షాలు మానవులు ఈ పద్ధతులు నేర్చుకున్నారు. వారూ, వారి తరాలవారు అందుకనే యీ జీవితసమరంలో నిలబడగలిగారు"—

అవును నిజమే. జీవించడం అనే కళను అభ్యసించిన వాడు ఋషి. అతను జగత్తులో కలిసిపోతాడు కనుక జగత్తు అతనిలో కలిసిపోవాలి. అహంకార పరిత్యాగంతో సర్వస్వైక్యతను పొందిన మానవుడికి అడ్డంకులు యెలా కలుగుతై? "పరోపకార శీలుడొక్కడే నిలిచి జీవిస్తాడు"— ఈ శాస్త్ర సిద్ధాంతాన్ని ప్రజలు సర్వవినియోగం చేయడంలో సమర్థులైనారు. "పరోపకారం" అంటే యేమిటి? ప్రజలు యేమనుకుంటున్నారో, యేం కోరుతారో, దేన్ని ఒప్పుకుంటారోనని యెదురు చూస్తుండడమేనా? ప్రజల అభిప్రాయాలతో అనుగుణ్యత పొందడంలోగల యుక్తిబలమా?

లేక మానవకోటికి సేవ చేయగలపనిలో మునిగి పోవడమా?

అదికాదు. సత్యమైన వ్యక్తిత్వమే నిజమైన సేవ. ఎవడు తనకుతాను ఊరక ఉత్సాహంలో ప్రేమలో గాఢంగా శృతి

గప్పిజీవిస్తాడో, సహాయమూ పరానుమతి అనే పేర్లతో అపార్థం చేయకుండా తాను తెలుసుకున్న సత్యాన్ని దాచకూండా చెపుతాడో ఆ మానవుడే చివరకు నిలుస్తాడు.

నీ హృదయంలో క్రొత్తదిలాగా కనబడే ఒక భావం ప్రకాశించినప్పుడు, నీ చుట్టూతా ఉన్న అనేకవేల జన సమూహంకూడా ఖచ్చితంగా ఆ భావాన్ని చూడలేకపోయినా నీలాగానే హృదయానుభూతినన్నా కలిగివుంటారని నమ్ము. పొలంలో ఒకకాయ పండేరోజుల్లో, ఆ జాతికిచెందిన యితర కాయలుకూడా వాతావరణ స్థితినిబట్టి పండే స్థితిలోనే ఉంటై. ఒక చెట్టుమీద, ఆకులూ, రేకులూ, పుట్టుతున్న కాలంలో, వసంతంలో మొక్కలు భూమిలోనుండి పైకివచ్చే రోజుల్లో, అలాగే కొన్ని వందలు వేలుకూడా పుడుతుంటై. ఒక ఆధ్యాత్మికమైన లేక నైతిక, వైజ్ఞానికమైన సృష్టి, తల్లి గర్భగోళం లోని శిశువులా, ఎప్పుడూ పవిత్రమైందే. దాన్ని దాచిపెట్టడం కప్పివేయడం, దైవాపచారం.

నీ ఆత్మకు నీవు సత్యంగా ఉండడంచేత అందరికీ నీవు సత్యంగా ఉండడంచూచి ఆశ్చర్యపడతావు. సత్యముకోసం చేసే పరిత్యాగమూ అనుమతీ, అనుసరణమూ, మరి సత్యమూ మాత్రమే పాపరహితాలు. బాహ్యావేషాలకు స్వరూపాలకు బిరుదులకూ, సంపదలకూ, పాండిత్యాలకూ ప్రకర్షలకూ గౌరవం చూపడమే విగ్రహారాధన. ప్రపంచజ్ఞానముంటే అజ్ఞానానికి చెప్పుకొనే క్షమాపణే.

"ఆనందపడుచు, చుక్కలు ప్రకాశించు
తన వెండితరగలతోడ సాగరము
పొంగిపోవుచు నుండు ఆనందవశత,
దేని కైచింత లేశంబును లేక
తమలోన తామవి మునిగి జీవించు."
తనఆత్మలోనుంచి తప్పిపోవుటయె
సకల తాపంబుకు మూలకారణము,
"తనులోన తాము మగ్నంబు జెందియును
ఇతరమౌ విషయముల్ పట్టించుకొనక
తమతమ ధర్మనిర్వహణ కార్యముల
తమ శక్తులన్ని ధారవోయుచును,
కనుము, మహాస్థితి నివి పొందునోయి.
"నీ ఆత్మలో నీవు నిలువుమో సఖుడ
తనను తా కనుగొన్న వగ యంతరించు
అని ఎరుంగుము, నిలుము నీ ఆత్మలోన."

చావుగానీ బ్రదుకుగానీ నేను సత్యమును మాత్రమే లెక్క చేస్తాను.

పాపంగానీ దుఃఖంగానీ, లోవెలుగును మాత్రమే సేవిస్తాను

సత్యమా! నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమా! నిన్ను నేను విశ్వశిస్తున్నాను.

లెక్కలూ, జాబితాలూ, అనుచరులపరివర్తితుల సంఖ్యాధిక్యతలతో, తమ కార్య ఫలితాలు బాహ్యంగా కనపరచాలని

'పరోపకార కర్మనిరతులు' తహతహ పడుతుంటారు. ఇదే చెడుకలిగిస్తున్న వ్యతిరేక దుష్టశక్తి. లెక్కలకోసం, జాబితాల కోసం పడే పరితపనే చెడుకంతటికీ మూలకారణం. పీనుగలో జనాపాయకరమైన విషముండవచ్చు. చాలామందికది కీడు చేస్తుంది కాబట్టి దాని సంఖ్యనుబట్టి ఆ పీనుగ చాల గొప్ప దంటామా ?

తమచేత నాటబడిన మొక్కలు చెట్లు గావాలనీ, పండ్లు తినాలనీ చాలా ఉత్సాహంగా ఎదురుచూస్తుంటారు ప్రజలు. దీనిలో విశ్వాసరాహిత్య స్వార్థపరత్వం యిమిడి ఉన్నాయి. జీసస్సూ, నానకూ, మరికొందరు మహానుభావులు తమ అనంతరం రాబోయే తరాలవారికి ఫలవంతం కాబోతున్న చెట్లకు తమ శరీరాలను ఎరువులుగా ఉపయోగించారు. కొందరు వక్తలు తోకచుక్కలకు లాగా ఆడంబరము అనే తోకను తగిలించుకోను తంటాలు పడతారు. తోకలు పొడుగులు చేసుకోవడంలోనే తప్ప, ఆచరణలో సర్వశూన్యమేఅవుతున్నారు.

మతాబాలూ, తారాజువ్వలూ కాల్చే సమయంలో గుంపులు గుంపులు జనం చేర్తారు. కాని, ప్రదర్శనానంతరం, ఒక చిహ్నం కూడా కనపడదు. మతాబాల ఒడుదుడుకుల కాంతిలో మనకేమి ఉపయోగం? నిశ్చలమైన, నిరభ్యంతరమైన కాంతి — కొవ్వొత్తిదీపం కాంతి అయినా సరే — అది మాత్రమే మనకు మేలుచేయ గలుగుతుంది.

నీ ఆత్మకేంద్రంనుండి చ్యుతుడవు కాకు. నిర్మలమైన ప్రేమా, స్వార్థత్యాగమూ యివి శీలానికి కావలసిన ముఖ్య

లక్షణాలు. ఇవి కలిగి ఉంటే పరోపకారం దానంతటదే జరుగుతుంది.

సూర్యదేవునిపైన లక్ష్యంబు నిలిపి
మేఘముల్ విచ్చియు తేజంబు పడిన
మేఘావృతంబయి తమమె ప్రాకినను
పెను తుఫానులు వచ్చి కబళించుచున్న
తన సముత్సాహములో లోటువడక
తొట్రుపాటొందక నిలుచుండ కెచట
భూదేవి యేరీతి సమగామియగుచు
తన యాత్ర సాగించుచున్నదో కనుము!
ఆవిధంబుగ నీవు ఓ శక్తియుక్త!
భూపుత్ర! గమ్యంబుపై లక్ష్యముంచి
అలయక సొలయక సాగిపోవోయి!

ఒకదాంట్లో తప్పుచేశాడని యింకోదాంట్లో కర్మపరుల సేవను తిరస్కరించడం యిండియాలో అలవాటు. ఉదాహరణకు- నిత్యజీవితంలో కొన్ని అలవాట్లు మంచివి కావు గనుక ఒక బోధకుని బోధలు తృణీకరించడం లాంటివి. అందువల్ల పరస్పర సహకారం అసాధ్యమైపోయింది. ఆవు సవారిచేయను పనికిరాదు కాబట్టి దాన్ని, దాని పాలను బహిష్కరించి నట్లుంది. లేదా- పాలు యివ్వలేదు కాబట్టి గుర్రాన్ని స్వారి చేయకుండా వదలడం లాగా ఉంది.

సహజవాదుల విస్పష్టసిద్ధాంతం ఇలా అంటున్నది: 'పందెముకు ఒక్క చురుకుతనం ఉంటే చాలదు' 'యుద్ధానికి

ఒక్క బలముంటే చాలదు.' ఈ రెండూ సహకారం పొంది నప్పుడే వీటి కర్తృత్వము. సహకారం ముందర ఉంటే తర్వాత పందెము (విజయఫలితము.) అయితే మానవకోటిలో సహ కారము- కలయిక ఎలా లభిస్తుంది? సహకారము కోసమైన ఏ సహకారమైన నిష్ఫలమై తీరుతుంది. సహజ సమీకరణం మన శరీరంలోని వివిధాంగ సమీకరణం లాగా తెలే కుండానే జరుగుతుంది. సర్వశాస్త్రము, సహకారంచేత, ఐక్యతచేత, సర్వసాధారణ కర్మచేతనే ఆవిర్భవించింది. అయితే శాస్త్రవేత్తలు ఒండొరులు ఒకేచోట కలిసి ఉండనవ సరము లేదు. ఒకే సత్యమందలి విశ్వాసంలో శాస్త్రవేత్తల సమీకరణ ఉంటుంది. ప్రపంచంలోని పసిపిల్లలందరికీ ప్రేమ, ఆట, అమాయకత అనే ఒక సర్వసామాన్య అనుభూత మత ముంటుంది. ప్రతి శిశువూ తన మధురాతిమధురమైన ఆత్మలో సహజమగ్నత కలిగి ఉండడంచేత ఈ ఐక్యత వస్తున్నది. తన అనుయాయులచేత మంచివాడనిపించుకోవాలనే వాంఛ తర చుగా శీల పారిశుద్ధతను మొదలంట నాశనం చేస్తుంది. ఈ వాంఛే కపటనాటకసంఘాల పునాది రాయి.

భిన్నాభిప్రాయ ప్రజలను సంతోషపెట్టాలనే వాంఛ యొక్క ఒత్తిడిచేత మానవుడు తప్పుదారుల్లో పడతాడు. ఒక వేళ అతనికి యిష్టం లేకపోవచ్చు. త్రాగుడు మొదలైన అల వాట్లు ఎలాకలుగుతవనుకున్నారు! త్రాగుబోతు స్నేహితుల మీది, గౌరవమూ అనురాగంచేతనే మామూలుగా కలుగు తుంటవి.

సత్యమే మంచిపని. దాన్ని అనుసరించడమే మంచిపని చేయడం. సత్యం నిన్ను బలవంతుడిగా చేస్తుంది. స్వతంత్రుడిగా చేస్తుంది.

తన ఆత్మకు ధర్మంగా వర్తించడమే, బాహ్యాధికార ధర్మాలనుంచి విముక్తి కలిగిస్తుంది. ఇదే గౌరవమంటే! సత్యమును బలపరచ నవసరం లేదు. సత్యమైనది స్వయంగానే స్థిరత్వంలో తననుతానే ఋజువు పరుచుకుంటుంది. స్థిరత్వమే బలము. బలహీనమైనది నశిస్తుంది. ఆయన ఆమోదించిన దానిని బట్టే, భగవదిచ్ఛను మనము తెలుసుకుంటాము. ప్రకృతి మహాగ్రంథంలో భగవంతుడు తన స్వహస్తంతో శుభ్రంగా, పొరపాటు లేకుండా ఇలా వ్రాస్తున్నాడు; "బలహీనత అనేది తప్ప వేరే పాపం లేదు. అది అజ్ఞానం వల్లనే జనించింది." భగవదిచ్ఛానుసారమైందే నిలుస్తుంది—వృద్ధిపొందుతుంది. నైజ తత్వం దర్శింపబడి సమిష్టీకరింపబడుతుందో అదే ఒకధర్మం. ప్రకృతిశాస్త్రము ఈ క్రింది ధర్మాన్ని ప్రకటిస్తున్నది. "ఏది నిజమైనదో అది ఎప్పుడో ఒకప్పుడు బలపడి, తననుతాను ఋజువు చేసుకొంటుంది." సత్యము కఠినమైంది. బలమైంది తాకం గానే పేటిబుడగలాగా పగిలిపోదు! బంతినిలాగా దాన్ని నీవు రోజల్లా తన్ను. తిరిగి రాత్రికి చూస్తే అది దృఢంగా చక్కగా ఉంటుంది. యథాప్రకారంగా ఉంటుంది. భగవంతుడు ప్రపంచాన్ని పాలిస్తున్నాడు. సర్వశక్తి సమర్థమైన సత్యమే గెలుస్తుంది. సత్యాన్ని గురించి ఆశ్చర్యపడకుండా భయపడకుండా, నీ హృదంతరాళంలోనుంచి, 'నేను భగవంతుణ్ణి' అని నిర్ఘోషించు!

సత్యాన్ని అధికంగా ప్రదర్శించే, అనంతశక్తిలో, శ్రుతి గల్పి పనిచేసే, భగవంతుణ్ణి అధికంగా ప్రదర్శించే సంఘమే, విజయాధిక్యతలను పొందగలుగుతుంది. సత్యాభిమానము బలాన్ని, విజయాన్ని సమకూరుస్తుంది. దేహాభిమానం— అది బ్రాహ్మణాభిమానమైనా, లేక సన్యాసిననే అభిమానమైనా సరే నిన్ను అస్పృశ్యునిగా (అంత్యజుడు, శూద్రుడు) మారుస్తుంది. ఈ చర్మవ్యాపార సంబంధమైన చండాలత్వానికే దూరం గమ్మని పవిత్రమైన శ్రుతి మిమ్ములను మాటిమాటికి హెచ్చరిస్తున్నది.

సత్యశీలుడైన దేహాభిమానరహిత మానవుడు, తాను చెప్పలుకుట్టే పనిచేస్తున్నప్పటికీ మహోదారమైన సన్యాస తత్త్వాన్ని గ్రహించవచ్చు. ఆ తోళ్ళపనేకాదు ఎలాంటిపనిలో, వ్యాపారంలో ఉన్నాసరే ఆపని ఎప్పుడూ నిన్ను శూద్రుణ్ణి చేయలేదు. స్త్రీలూ, బాలురు, శూద్రులు జాతీయవృక్షానికి వేళ్లు. అయ్యో, భారతదేశంలో వీరికి తగిన విద్యావిధానము, శ్రద్ధ తృణీకరింపబడింది. అగ్రజాతు లనబడేవాండ్లు వృక్షము యొక్క ఫలాలుమాత్రమే, చెట్టుమీదపండ్లు కాపాడ్డం కోసమే మనం కాలము వ్యయం చేయకుంటాముగాక. వేళ్లవిషయం చూడండి. తగిన ఆహారంపెట్టి నీరుపోయండి.

ప్రియమైన సంఘసంస్కర్తలారా! ధనవంతుల అభిరుచులకు అనుగుణ్యంగా వర్తిస్తే మీ వ్యక్తిత్వం వృద్ధిచెంది పేరు ప్రతిష్ఠలు కొంతకాలం రావచ్చు. కాని, సత్యం పేద జనానీకం ద్వారానే, స్త్రీలూ, బాలుర, ద్వారానే వ్యాప్తి

చెందుతుంది, అని చరిత్ర ఋజువు చేస్తున్నదికూడా. తమ ఉప న్యాసాలకు ఉద్యోగస్తులువస్తే, ఉపాధ్యాయులు తమనుతామే మెచ్చుకోవడం అలవాటైపోయింది. ప్రభుత్వోద్యోగులు యీనాడు యితరులకంటె తెలివికలవారు కావచ్చు. సహాయ కారులు కావచ్చు. కాని జాతీయాభ్యుదయం వారివలన జరు గదు. అధికవేతన వ్యామోహాలలో తమ స్వాతంత్ర్యాన్ని అమ్ముకొని, బాధపనివలన, అధికశ్రమవలన బలహీనులై, రాత్రింబవళ్లు చావుచాకిరిచేసే, ఆ మర్యాదస్తులు, ఆ పూజ నీయులు, నిస్సహాయులై పొగడ్తలలో, జోలపాటల్లో వారి సేవకుల సపర్యల్లో, ఆనందించనీయండి. కానీ, అభ్యుదయం మాత్రం వేళ్లనుండి కలుగుతుంది.

ఇండియాలోని అనేక ఉద్యమాలు నిష్ఫలమైనవి. దీనికి ముఖ్యకారణం, ఉద్యమకారులు పైతరగతుల పెద్దమను షుల్నిమాత్రమే, ధనవంతుల్నిమాత్రమే (వృక్షముపై ఫలా లను, పత్రాలను) సేవించారు. శూద్రులకు (క్రింది తరగతుల వారికి) వెలుగూ బ్రతుకుతెరువూ కావాలి. క్రింది తరగతులలో పనికిమాలిన వారియందును శ్రద్ధాళుడవైన నిన్ను ప్రజలు దూషి స్తారు. కాని, ఒకసున్నా పదిరెట్లు విలువను అధికంచేస్తుంది అని గుర్తించు; ఒకటికి కుడివైపునవుంచినపుడు, ఆ సున్నా ఉపయోగకారి. ఒకటిని సున్నాలతో సరియైన క్రమంలో సమన్వయపరుచు. "తత్-త్వం-అసీ." "ఆ పరబ్రహ్మవునీవే." బ్రహ్మవిద్యకు శూద్రులు, స్త్రీలు, బాలురూ, అనధికారులని, కొందరు అంటారు. యీ అభిప్రాయమే వేదాంతాన్ని ఒక

పెద్ద సంశయాస్పదమైన సూత్రంగా తయారుచేసింది. సత్యం గాకుండా, సూత్రప్రాయమే అయింది!

ప్రతిబాలుడూ, సూర్యకాంతికీ, గాలికీ అధికారి అయినపుడు, ఆధ్యాత్మిక కాంతికీ, గాలికీ యెందుకు అర్హుడుకాడు? బ్రహ్మవిద్యను యెందుకు తాళాలువేసి బిగిస్తారు. అజ్ఞాన బలహీనతా ప్రేరితాలైన చీకటి గదులూ, భూగర్భగృహాలూ, నశించుగాక! దైవకాంతీ, వాయువూ, అందరనూ సమానంగా అనుగ్రహించునుగాక!

ప్రజలకు నైతిక ఆజ్ఞలను బోధించడంద్వారానే ఆధ్యాత్మిక దారిద్ర్యత యేర్పడుతుంది. ఉద్రేకులై నీతివాదులు వారికి వారు సత్యాన్ని ప్రకాశింపజేసుకోని, యితరులను విజ్ఞానవంతుల్ని చేయడంగాక, సుగుణ పద్ధతులను బలవంతంగా యితరుల నెత్తిన రుద్దడంద్వారా, తమప్రయోజనాన్ని కోల్పోతున్నారు. తన మనస్సుకు నచ్చితే, ఎవడూ చెడుదారిలో పడడు. (చూస్తూ, చూస్తూ. ముందర భావిలో యెవడూ దూకడు. ఇది చెయ్యి, యిది వద్దు అనే ఆజ్ఞలు, మనుష్యునిలోని పశుత్వాన్ని మాత్రమే ప్రబోధిస్తవి. ఒక బాలుడికిగానీ, బాలికకుగానీ, యిదిచెయ్యి, అదిచెయ్యి అని చెప్పితే, వారిలోని మనుష్యత్వాన్ని విస్మరించాము గనుక అది యెదురు తిరుగుతుంది. మనలోని పశుత్వంఅనే గుర్రాన్ని, వివేకమనే స్వారి చేయువానినుండి తోలివేసినట్లుగా ఉన్నవి మనం చేసే ఆజ్ఞలు.)

పిల్లల్ని కట్టుదిట్టంగా ఉంచబోయి వారిమీద మన అధికారాలు చెలాయించబోయి, వారికి విప్లవ భావాలను నేర్పుతున్నాం. బలవంతమైన పరిపాలన యెక్కడ విప్లవ శక్తుల్ని పుట్టించదో, అక్కడ పతనమూ, మరణమూ సంభవిస్తుంది. మన తత్వశాస్త్ర సిద్ధాంతప్రకారం, మానవుని సామాన్యస్థితిలో ఒకసూచన ఎంతవక్రంగా (Indirect) ఉంటే అంతపనిచేస్తుంది. మనచేత బలవంతంగా రుద్దబడిన నైతిక సూత్రాలవలన మన సామాన్య మానవుడు సహజంగా వ్యతిరేకార్థాన్ని గ్రహిస్తాడు. బహిష్కరణవలన తిరస్కరణవలన, ఒకదానియందలికోర్కె యింకా యెక్కువే అవుతుంది.

ప్రజల్లో అలవాటుయేమంటే, వాళ్లు భగవంతుణ్ణికూడా విడిచిపెట్టలేరు. రోజూ, నెలా నెలా, వారి ఆహారాన్ని అనుగ్రహించి, వారికి ఆయన సేవచెయ్యాలని కోరుతారు. మత వ్యాపారి అయిన ఒక సిద్ధుడివద్దకు ఒకడు అద్భుతశక్తి·కొఱకు పోయి, హృదయానుగుణమైన ప్రాపంచిక ప్రయోజనాన్ని సాధించే, ఒక దివ్యమంత్రాన్ని తనకు ప్రసాదించమని అర్థించాడు. సిద్ధుడు మంత్రాన్ని బోధించాడు కాని, దాని ఫలితాలకు ఒక నియమం పెట్టాడు. ( "ఒక నిర్ణీతమైన కాలం వరకూ యీ మంత్రాన్ని జపించే టప్పుడు, నీమనస్సులోకి కోతిని గురించిన భావాలు రానీయక". అని. పాపము అతడు మరుసటిరోజు పోయి గురువుతో "మీరు అలానన్ను హెచ్చరించక పోయిఉంటే, అసలు కోతిభావనే నామనస్సులోకివచ్చి

ఉండేదికాదు. కాని యిప్పుడు కోతిభావన అధికంగా వస్తోంది. దాన్ని వదిలించుకోలేకుండా ఉన్నాను. ”/అన్నాడు.

అలాగే మన బోధకులందరూ తిరస్కరిస్తూ ఉండక పోయినట్లయితే అపవిత్రత, యితర పాపాలూ యెప్పుడో జగత్తును వదలిపోయి ఉండేవి. పాపము! ఆదము, ఈడెన్ వనంలోని ఆ ప్రత్యేకమైన చెట్టు పండును తినాలని ఉద్దేశించక పోయి ఉండేవాడు, బైబిలులోని దేవుడు అది బహిష్కరించ బడింది అని చెప్పకపోయినట్లయితే.

సంస్కరణ పేరుతో, మన నిరంకుశ సలహాలను తీవ్రంగా ప్రతిపాదిస్తాము. ఒక పసిబిడ్డను ‘నీ పేరేమిటి’ అని అడిగితే, “మాఅమ్మ వద్దు,వద్దు, అంటుంటుంది యెప్పుడూ; అదే నా పేరై ఉండాలి” అని జవాబు చెప్పిందట! ఆజ్ఞల బరువుల వలన ప్రజలు సత్యాత్మను విస్మరించారు. వారు ధరించిన పేరూ, రూపమే వారని భ్రమిస్తున్నారు.

అనుష్ఠానవేదాంతం పుస్తకాలద్వారా కాకుండా, పరిశుద్ధతద్వారా యిండియాలో మొదలుపెట్టబడాలి. వేదాంతం అంటే- ఆధ్యాత్మిక, మానసిక, దైహిక పరిశుద్ధత. జలుబూ, దగ్గూ, జ్వరాలేకాక- ఈర్ష్య, సోమరితనం, కోపము, కల్మష భావాలూ, బలహీనతా, యింకా అపవిత్రత యొక్క యితర రూపాలూ అన్నీకూడా జఠరారోగ్యము రాగానే మాయమై పోతై. సరియైన అవసరాన్ని గుర్తించి, గ్రహించడమే నిజమైన స్వాతంత్ర్యము. నేనే అవసరాన్ని; కనుక స్వతంత్రుణ్ణి, నన్ను నేను గుర్తించడంలో నిజమైన పరిశుద్ధత యిమిడి ఉంది. నన్ను

గుర్తించకపోతే, నీ పరిశుద్ధత యేదో జబ్బుకు వేసిన తొడుగు మాత్రమే అవుతుంది.

పరిశుద్ధతా, పూర్ణము, పరిపూర్ణమైన యీమాటలన్నీ ఒకేజాతికి చెందుతై. ఐక్యతను గుర్తించి అనుభవించడం పరిశుద్ధత. ఐక్యతలోజీవించు జగత్తులోనిదేని ప్రాముఖ్యతకు భ్రమపడవాకు. నీవు యేంచెప్పదలచుకొన్నావో అదిచెప్పు, అవసరంలేంది చెప్పవద్దు. జీవితమే సమస్యలకు సమాధానం. కాన, యే సమస్యలూ పరిష్కరింపబడకుండా ఉండవు. పరిశుద్ధతను స్వతంత్రంగా ప్రదర్శింబడనీ, యేవాంఛలు మనసులోవుండ కూడదు.

తక్షణమే త్యాగంచేయవలసిన పనికిరాని ఆస్తియేదంటే ఒకడికి ఉండే స్వార్థాశయాలు. సూటిగాచూడు; అంటే, యేం భయంలేకుండా చెట్లను, నదులనూ చూసినట్టే యెవరివైపైనా సరే ధైర్యంగాచూడు. పసిబిడ్డలా, వారి(వ్యక్తిత్వాలను)చూడకుండా, ఎవరిలోనైనా కూడా నీ ఆత్మనే చూడాలి. అనుభవం చేత (అంటే-అపజయాలవల్ల) యెక్కువ తెలివికలవాళ్లు మనుకునే పెద్దలకంటే, జీవితాన్ని ఆడుకునే పిల్లలే దాని సహజసూత్రాలనూ, బాంధవ్యాలను గుర్తిస్తారు. కాళ్లజెర్రిని నిర్భయంగా తాకితే నిన్ను కుట్టదు. కాని మామూలుగా భయపడుతూ తాకితే ఒళ్లంతా మంటలు మండిస్తుంది. కొందరు మంచి మానవసేవకులు ఉన్నారు. వారి సంభాషణలలో యెక్కువగా గూఢచారులవలన భయమూ, రహస్యపరిశోధకులవలన భయమూ ఉంటుంది. వీళ్లే దొంగలని చెప్పటానికి

నేను సాహసిస్తున్నాను. రహస్యశోధకులారా! గూఢచారు
లారా! స్వాగతము. రండి. రండి. నాకు మీరు అవసరం.
మీకు యిదివరకు జీతం యేమున్నా ఉంటే దానికంటే అనం
తంగా మీకు యిస్తాను, నన్ను పరిశోధించండి. నా రహస్య
జీవితాన్ని గూఢంగా పరిశోధించండి. నాకు ఉన్నవన్నీ మీకు
యిస్తాను. మీ కోరికలన్నీ తీరుస్తాను, మీ అక్కరలన్నీ తీరు
స్తాను. యింక మీరు బాధపడరు. మీ దరిద్రం పోతుంది.
అన్ని రాజ్యాలూ మీ పాదాక్రాంతాలు అవుతై. మీ రహస్య
శోధనా హృదయాలకు నా ఆశీస్సులు రండి.

పవిత్రతే, మానవునిద్వారా పవిత్రకర్మలు చేయిస్తుంది.
శిశువులో ఏ సంకల్పాలు వుండవు. అయితే, ప్రపంచం
మొత్తంలో నిరంతర ! కర్మోత్సాహపరుల్లో శిశువొకడు.
వేదాంతం నిన్ను పరిశ్రమించమంటున్నది. నీ ధర్మాన్ని నిర్వ
ర్తించు. ఫలితమేమైనా నీఆనందాన్ని వదలుకోకు ! ప్రతికర్మ
ఆనందోత్సాహంతో చెయ్యి. కాని ఆనందం ఎక్కడ ఉందని
దేనిమీదనో ఆధారపడివుందని, దానికోసం వృధాగా ప్రాకు
లాడవాకు !

సత్యంలో ఒక్కడవై నిల్చున్న నీవు, అధికసంఖ్యాకులు
ప్రతికూలంగా ఉన్నారని భయపడవాకు. ఈ అధికసంఖ్యా
కులుగాఉన్న మూర్ఖులైన అజ్ఞానులు, గడ్డిపరకలమీద, ఆకుల
మీద చేరిన ఉదయకాల హిమబిందుసైన్యాలవంటివారు.
ఓ సూర్యుడా ! నీ ప్రతిభలో కరిగిపోయే యీ అధికసంఖ్యా
కులు, నీకు స్వాగతమివ్వడానికే మిణుకుమిణుకు మంటు

న్నారు. సత్యంలో మగ్నుడవుగా! కొన్ని వేలమంది ఎదిరిస్తే నీకేమి లెక్క! అయినా అధిక సంఖ్యాకులు, నీవైపే ఉన్నారు. పర్వతాలు, వృక్షాలు, నదులు. సూర్యుడు, నక్షత్రాలు-అన్నీ నీవైపే ఉన్నై. కాలం నీవైపు ఉంది దినం నీదే, శతాబ్దాలు నీవే.

అనంతమైన కాలం నీది. సర్వవ్యాప్తమైన ప్రకృతి నీలోనే ఉన్నది. నీ ప్రతిపక్షులను నీవు చుట్టివేస్తున్నావు. కాని నీవు వారిచేత చుట్టబడలేవు. విధిని చుట్టిపెట్టు! దాన్ని బాధించి ఉపయోగించుకో.

## కా వా ల !

సంస్కారులు
ఇతర్లను సంస్కరించను కాదు.
తమ్ము తాము సంస్కరించుకోను.
యూనివర్సిటీ డిగ్రీలు సంపాయించినవాళ్లు కాదు.
ఆత్మవిజయం పొందినవాళ్లు
వయస్సు: దివ్యానంద గ్రావసం
జీతం: బ్రహ్మత్వం
త్వరలో దరఖాస్తులు పంపండి.
యాచనతో. ప్రార్థనలోగాక
అధికారం సూచకమైన నిశ్చయమైన సంకల్పంతో
(ఎవరికి?) విశ్వనాథుడికి — మీ ఆత్మకు!

ఓం

# అరణ్య ప్రసంగాలు 4.

## కథలు.

భగవంతుణ్ణి నీ ద్వారా పనిచెయ్యనీ. అప్పుడు కర్తవ్యమనేదే ఉండదు. భగవంతుణ్ణి ప్రకాశించనీ. ఆయన్ను స్వయం ప్రదర్శితుణ్ణి కానీ. భగవంతుణ్ణి జీవించు, తిను, త్రాగు, పీల్చు. సత్యాన్ని గుర్తించు. మిగతా పనులు తమంతట తామే జరుగుతై. నీలో ఉన్న స్వర్గసామ్రాజ్యంలో జీవించు. అది నీవే! తక్కినవన్నీ నీలో ఐక్యమౌతవి.

### 1. లార్డ్ బైరన్.

ఆయన తన ద్వారా స్వాతంత్ర్యభావాన్ని పనిచేయనిచ్చాడు. విశ్వవిద్యాలయ విద్యార్థిగా ఉన్న రోజుల్లో ఆయన తరగతికి పరీక్షలో వ్యాసరచన వచ్చింది, క్రీస్తు నీళ్లను సారాగా చేసిన అద్భుతమూ, అప్పటి విందు సందర్భాన్ని గురించి వ్రాయాలి వ్యాసం. అందులో కొందరు విద్యార్థులు మొత్త శ్రమజేశారు వ్రాయడానికి! నిర్ణీతమైన కాలంలో అప్పుడు వచ్చిన అతిథులు యెలా ఉన్నారో, యే వస్త్రాలు ధరించారో, విందు యెలా యేర్పాటుచేయబడిందో, క్రీస్తు యెలా మాట్లాడాడో యిలాగా వ్యాసవిషయాన్ని పెంచిపెంచి కొందరు విద్యార్థులు పెద్ద కథలుగా వ్రాశారు. ఇంతసేపూ బైరను మాత్రం యేమీ వ్రాయకుండా యింటికప్పుతట్టు చూస్తూ, యితర విద్యార్థుల ముఖాలు పరిశీలిస్తూ కాలం గడిపాడు. టైము అయిపోగానే ఉపాధ్యాయుడు అందరి వ్యాసాలూ తీసికోడానికి వచ్చి బైరను

వద్దకుకూడా వచ్చి హాస్యంగా యిలా అన్నాడు. "నీవు అలసి
పోయి ఉంటావు. చాలా కష్టపడి రాస్తున్నావు యిందాకటి
నుంచీ" బైరన్ యేమీ వ్రాయని తెల్లకాగితం యిస్తాడనిఅను
కున్నాడు. "ఉండండి. ఒక్క నిముషం ఆగండి" అన్నాడు బైరన్.
తొందరగా ఒక వాక్యాన్నుకు వ్రాసి పుస్తకం యిచ్చేశాడు.
మూడువారాల్లో, ఎన్నో గడిచిన తర్వాత ఫలితాలు చెప్పారు.
కొన్ని వ్యాసాలు ప్రత్యేకంగా మెచ్చుకోబడినై. కాని బైర
నును మొదటి బహుమతి రావడంతో అందరూ ఆశ్చర్యమగ్ను
లైనారు. బైరను వ్రాసిన వ్యాసం చాలా రసవంతంగా ఉందని
విద్యార్థులకు విప్పిచెప్పడానికి ఉపాధ్యాయుడు క్లాసులో దాన్ని
చదివాడు. వ్యాసం అంతా కలిసి యీ ఒక్క వాక్యం మాత్రం
ఉంది.

"నీళ్లు తమ నాథుణ్ణి చూచి (సిగ్గుచేత) యెర్రబడినై"
అని. ఆయన యేమీ బలవంతంగా వ్రాయలేదు. ఈ వాక్యం
సహజంగా, సంపూర్ణంగా, స్వతంత్రంగా, ప్రకాశవంతంగా, కవి
త్వంగా, ఆత్మకార్యంగా ఉంది.

"కనులు చూచునుగాని గ్రహింపలేవు,
కర్ణముల్ వినుచున్నవేగాని తాము
వినజాలకున్నవి యిదనిర్ఝరవము!
మా కిష్టమున్నను లేకపోయినను
మా శరీరము లెల్లు వర్తించుచుండు."
"నీవు చింతింపుము భావంబులోన
'ఈ మహావిషయము గుర్తుంచుకొనుము'

ఈ వస్తువులగూర్చి నిరతంబు మనము
భాషింపుచున్నను ఫలమేమి లేదు
ఇట్లనే నిరత మన్వేషణే మిగులు."

వర్డ్స్‌వర్త్.

## 2. గాయకాచార్యుడు

ఒక చర్చిలో ఒక సుందరమైన శ్రుతివాద్యముంది. దాన్ని ఏ సంగీతపాటకునీ తాకనివ్వరు. ఒకరోజున చర్చిలో దేవసేవ జరుగుతున్న సమయంలో ఒక చింకిగుడ్డలు ధరించిన కొత్తమనిషి వచ్చి దాన్ని ఉపయోగిస్తాననగా, దాని సమీపానికి కూడా అతన్ని వాళ్ళు చేరనియ్యలేదు. చర్చి ప్రతినిధికి అతనెవరో తెలియదు. అసలే వాద్యం ప్రీతి పాత్రమైంది కాబట్టి, దాన్ని ఉపయోగించే అధికారం యివ్వలేదు. పూజానంతరం సంగీతవేత్త దాన్ని అవతలపెట్టిన తర్వాత, నెమ్మదిగా కొత్తమనిషి దాని దగ్గిరికి పోయాడు. అతని హస్తస్పర్శ కాగానే వాద్యం తన యజమానిని గుర్తించింది. అందరూ పోవడానికి సిద్ధమైఉన్నా, ఆ సంగీతధ్వనుల మనోహరత్వానికి సమ్మోహితులై, నిశ్చేష్టులై అక్కడే నిలబడ్డారు. చర్చిని విడిచిపోలేక పోయారు. ఈ మనోహర సంగీతం వాయించినవాడే, ఆ వాద్య నిర్మాత.

ఆత్మకు, భగవంతుడికి, ప్రేమకు, మనకోసం పనిచేసే అవకాశాన్ని యివ్వము. ఈ దేహం, యీ మనస్సు, వీటిని జాగ్రత్త చేసుకుంటే, సామాన్య శ్రుతులే పలుకుతై. యజమానిని (భగవంతుడు) ఈ వాద్యంమీద వాయించనీయండి.

మరుక్షణమే, ప్రేమదేవతా హస్తస్పర్శ కలగంగానే, యితః పూర్వంలో కూడా వినని మనోహరసంగీతం వినిపిస్తుంది. అద్భుతతేజస్సూ, గానమూ, ప్రవహించుతై. దైవశ్రుతులు పుట్టుతై, స్వర్గసంగీతం వినిపిస్తుంది.

"ఈ నల్లరాతిలో ఈ పూవులోన
ఈ పక్షిలోపల నీ భృంగమందు
వెలుగొందుచున్నట్టి ఓ పరమాత్మ,
నీనుంచి అద్భుత ప్రేమప్రవాహ
మహా తనకాల్వలన్నింటిలోనుంచి
పారుచున్నది కదా ఎడతెంపులేక
ఆ ప్రేమతృణములో జీవమైనిలచు
పూలతో ప్రాణమై ఉద్గతంబగును,
అణువణువందుండి అద్భుతలీల
సృష్టి సౌధాకాశ శిఖరంబులైన
సూర్యతారాచంద్ర మండలంబులను
నీప్రేమ తేజము ప్రవహించుదేవ!
ఈ నల్లరాతిలో ఈ పూలలోన
ఈ పక్షిలోపల నీ భృంగమందు
వెలుగొందుచున్నట్టి ఓ పరమాత్మ!
ఈ మహా బ్రహ్మాండ వస్తువాహినుల
లోనుంచి యీ మహా ప్రేమజలంబు
నీలోకి ప్రవహించుచున్నది తిరిగి
ఈ ప్రకారంబుగా యీ ప్రవాహంబు

నీనుండి విశ్వాంత రాళంబునకును
విశ్వమందుడియు నీలోన కెపుడు
పరమేశ సతము పరిభ్రమించెడిని,
తీరమే లేని అపార సాగరము !
మనుజులు, దేవతల్, తారలు, సూర్య
లీపకమై వెల్గు ప్రేమసూత్రమున
కలసియున్నారు పరస్పరం బహూహా !
కర్తృత్వ అహంకారమరణం

లిజీడోబిన్

పూర్వం గొప్ప కామరూప శక్తిగల మనిషి ఉండే వాడు. అసలు వస్తువుకూ అతను తెచ్చుకున్న రూపానికి యేమీ తేడా ఉండేదికాదు. అంత తెలివికలవాడు. తనకు మృత్యుదేవత ఆసన్నమైందని తెలుసుకుని, యేం చెయ్యాలో తోచక, మృత్యువును తప్పించుకొనే పద్ధతి తట్టక, చివరకు ఒక మంచి ఉపాయం పన్నాడు. తనలాంటి డజను రూపాలను పొందాడు. మృత్యుదేవత వచ్చింది. యేది నిజమైన అసలు మనిషి అయిందీ తెలేక మృత్యువు దేన్ని గ్రహించలేక పోయింది. మృత్యువు భగవంతుడివద్దకు పోయి, యేం జెయ్యాలో చెప్పమంది. ఆయనతో కొంత ఆలోచనచేసి, మళ్ళీ ప్రయత్నం చేద్దామని భూమ్మీదికి వచ్చింది. అతనితో యిలా అంది" నీవు చాలా తెలివికలవాడివే. అందుకనే యిన్ని రూపాలు ధరించావు. అయితే ఒక్క విషయంలో పొరపడ్డావు. అది ఒకటే నీవుచేసినతప్పు". —అని అంది. తను

ణామే నిజమైనమనిషి ముందరికివచ్చి -" దేనిలో తప్పుచేసింది ? నేను అని తొందరపాటుతో అడిగాడు. " యిందులోనే " అని మృత్యువు అతన్ని గ్రహించగలిగింది. " నేను మంచిపని చేస్తున్నానా" అని అడగడమేతప్పు. ప్రియుడా ! నీవు మంచివికాక, యింకోటి యేంకాగలవు ? కర్తృత్వాహంకారం, మృత్యువు పాలైంది.

4. ఇది నా కందదుంప,

కరువురోజుల్లో ఒకముసలమ్మ చచ్చింది. యమధర్మ రాజు, ఆమె పాపపుణ్యాలనుగురించి విచారించాడు. ఆమె యేమీపుణ్యాలు చేయలేదు. ఒకసారిమాత్రం, ఒకఆకలిగొన్న బిచ్చగాడికి ఒకకందదుంప నొకదాన్ని (లేదా ముల్లంగిదుంపో సరిగా తెలేదు) యిచ్చింది. యముడి ఆజ్ఞానుసారం ఆ దుంపను కోర్టులోకి పిలిపించి హాజరు పెట్టాడు. యీ దుంపే ఆమెను స్వర్గానికి తీసుకపోవాలి. ముసలి ఆ దుంపను పట్టుకుంది. ఆ కందదుంప, ఆమెతోసహా పైకిలేచింది,

అప్పుడు రంగంమీదికి బిచ్చగాడు వచ్చాడు. ఆమె చినిగిన గుడ్డపీలిక పట్టుకోని వాడూ పైకిపోతున్నాడు. యింకో మూడోమనిషి బిచ్చగాడి కాళ్లుపట్టుకొని వేళ్ళాడి పోతున్నాడు. యిలా ఒక పెద్ద గొలుసులా ఒకడివెంబడి ఒకడు, ఆ కందదుంపవల్ల పైకిపోతున్నారు.

ఆ ముసలిదానికీ తనక్రింద వేళ్లాడుతున్న మనుషులు బరువనిపించలేదు. యెంత ఆశ్చర్యం ! (యిల్లాంటి సంగతులు తరచుగా మీ కలల్లో కనపడు తుండవూ ? )

రక్షితులైన ఆ మనుషులందరూ పైకి పోయిపోయి, చివరికి స్వర్గద్వారం సమీపించారు. ముసల్ది యిక్కడికి వచ్చేటప్పటికి కిందికిచూసింది. ఊరుకుంది. ఊరుకోలేక — ఆమెకు యేమనిపించిందో తెలేదు — కిందిగొలుసులాగా ఉన్న వాళ్ళందరతో యిలా అంది.

"పోండి ! మీరందరూ !

యిది నా కందదుంప" అన్నది. వాళ్లందర్నీ దూరంగా పారద్రోలుదామని తనకు తెలేకుండానే, తనచెయ్యి ఊపింది. పట్టుతప్పిపోవడంవల్ల ఆకందదుంప ఊడిపడింది. ముసలమ్మ గూడా కిందపడింది. అందరూ పడ్డారు.

ఉన్న యదార్థం చెప్పబడింది. దీనిలో నీతిని మీరే ఊహించుకోండి.

5. సమానత్వం

"ఒకసారి ఒకపెద్ద పర్వతంబునకు
ఒకచిన్న ఉడుతకు తగవు ఏర్పడియె ;
ఆ పెద్దకొండ, ఆ ఉడుతనుజూచి
"ఓఅల్పజంతువా" అనిదెప్పిపొడిచె.
ఉడుత ఆమాటకు బదులిట్లు చెప్పె :
నిజము— నీవెంతయో పెద్దవస్తువువె ;
ఒకపెద్ద వత్సరమగుటకు కనుము—
ఎన్ని దినంబులు ఎన్ని క్షణాలు
ఎన్ని మాసంబులు కలసిన యగును ?

కావున నాస్థానమే నాక్రమింప
నే లజ్జనొందనో పెద్దసర్వేశమా.
నీవంటి పెద్దదానిని నేనుగాన,
నావంటి చిన్నదానివి నీవుగావు.
నాయంత ఉత్సాహమున్నదా నీకు !
సామర్థ్యములు వేరు వేరుగావచ్చు
ఎవరి స్థానములలో వారలేగొప్ప,
అట్టి యేర్పాటు లీశ్వరుడు గావించె
నతిబుద్ధి బలముతో లోటులేకుండ
నా వీపుపై నేను నీమాదిరిగను
అడవులమోయగా లేకున్న యెడల
మఱి, నీవునారీతి గట్టికాయలను
పటపట పండ్లతో కొరకగాగలవ" ?

ప్రశ్న:- స్వామీజీ! మన ఆత్మయే సర్వజ్ఞానమని మీరు చెప్పుతున్నారు. అయితే రాబోయే లా పరీక్షలో పుస్తకాలు చదవకుండా మొదటి బహుమానం గెల్చుకునే సదుపాయం, వేదాంత సంబంధమైన పద్ధతి యేదన్నా ఉంటే చెప్పుమని ప్రార్థిస్తున్నాను.

సమాధానం:- ఒక రాజకుమారుడు బాల్యంలో ధనవంతుల బిడ్డలతో కలిసి దాగుడుమూత ఆడుకుంటున్నాడు. పిల్లల్ని వెదకవలసిన పని అతనిమీద చాలాపడింది. ఇదిచూసి ప్రక్కన ఉన్న పెద్దమనిషి ఒకాయన యిలా అన్నాడు." ఆట పిల్లల్ని వెదకడంలో యింత శ్రమపడితే యేం లాభం?నీ రాజ

రికపు అధికారాన్ని వినియోగించి పిలిపిస్తే వెంటనే వచ్చే వాళ్లను యింత వెదకడ మెందుకు?" అని. రాజకుమారుడు బదులు చెప్పాడు— "అలాఅయితే ఆటలోఉన్న రుచి పోతుంది. ఆట మజా ఉండదు" అని.

అలాగే వాస్తవంలో కూడా సర్వజ్ఞుడివీ, సర్వశక్తివంత మైన దైవత్వానివి నీవే. నీవే పరిపాలకుడవు అయితే, నీవే హాస్యానికోసం ని విషయాలను తెలుసుకునే కార్యక్రమం యేర్పరచుకున్నావు కాబట్టి (వైజ్ఞానిక - యితర వ్యాసంగాలనే వాటిని, ప్రపంచమనే దాగుడుమూతల ఆటలో) ఆటసంతా నీరసంగా చేసే, ఆ అధికారాన్ని నీవు వినియోగించడం న్యాయంగా ఉండదు. భూత భవిష్యద్వర్తమానకాలాలూ, సహస్ర సూర్యచంద్రాదులూ, నక్షత్రాలూ నీ ఆత్మగా అవు తున్నప్పుడు— కాదు; నీ విజ్ఞానసముద్రంలో అన్ని శాస్త్రాలు, అన్ని విషయాలూ బుద్బుదప్రాయా లౌతున్నప్పుడు, నీవు ఈ లా పరీక్షకూ, యీ ప్రాపంచిక విజయాలకూ యెందుకు లెక్క చేస్తావు? నీవు దివ్యదృష్టి పొందాలంటే, యింద్రియ రంగాన్ని వదలాలి. లేదా తదతీతుడవు కావాలి. ఇంద్రియాల ద్వారానే, వాటికొరకే నీవా శక్తిని కోరుతున్నావు. ఇంద్రి యాతీతుడవు కావాలి.

చేపలను పట్టను వల వేయబడింది. చేపలు వలలోపడి వాటి బలంవల్ల వలను లాక్కుపోయినై. వేదాంతసాధనమంటే వాంఛా వాగురులను నాశనంచేసే క్రొత్తరకం చేపలు. విజ్ఞాన సంపాదనకు అవలంబింపబడే సామాన్య మార్గాలు కూడా

వేదాంతవిధానాలే. విజ్ఞానార్జనకాలంలో తెలేకుండానే అహం కార ద్వైతాలనుండి తప్పించుకుంటున్నావు కాబట్టి.

యిమాం ఘిజాలీ అనే మహమ్మదీయ భక్తుడు చదువు కునే రోజుల్లో ఒకరాత్రి మామూలుగా చాలాశ్రద్ధగా చదువు కొంటూ, అట్లాగే నిద్రపోయాడు. కలలో ఖ్వాజా ఖజీర్ (విజ్ఞానాధిదేవత) వచ్చి యిమాం చెవుల్లో, నోట్లో గాలి పోయడం ద్వారా సర్వజ్ఞుణ్ణి చేస్తానన్నాడు. కాని ప్రతిష్ఠాశాలి యైన ఘిజాలీ సమ్మతించలేదు. పైగా యింకా శ్రద్ధగా చదవ డానికి అర్థరాత్రివరకూ చదివినా సరిపోయే నూనెను యివ్వ వలసిందని వరం కోరేడు. దగ్గరదారికంటే దూరపుదారిని కోరు కున్నాడు. స్వర్గపు దిడ్డిదారిగుండా జొరబడి చౌర్యం చేయడా నికి ఆయన మెత్తబడలేదు.

భగవంతుడికి, నీవిలానడువుమని సలహా లివ్వవాకు. ఇదిగో నాకోర్కె నెరవేర్చు అని భగవంతుడికి ఆజ్ఞాపించకు! నీ ఆత్మను ఆయనకు అంకితంచెయ్యి. అహంకార వర్జితుడవుగా! ఆయనలో ఐక్యమైపో. నానావిధములైన, ఈవ్యామోహాలనూ, అనవసరమైన నీ వాంచలన్నీ కట్టిపెట్టు, నీ దేహాన్ని మనస్సునూ కాంతిమయం చేయుగలుగుతావు. నిజమైనవిద్యా, విజ్ఞానమూ, లోపలినుంచి వస్తై. గ్రంథాలద్వారాగాని, విజ్ఞానులద్వారా గానిరావు. ఉపజ్ఞాపరులు, తత్వవిచారణలో పనిచేసిన మొదటి మనుషులు, యేకోరికా లేకుండా, మనోదేహాల్లో యేమాత్రం స్వార్థంలేకుండా, సత్యమైన ఆలోచనానిమగ్నులైనపుడే సత్యాన్ని కనుకోగలిగారు. వారు నిర్మలులైనారు. (గ్లాసు

లాంటి) వారిలోకుండా కాంతి ప్రవహించింది. గ్రంథాలను ప్రకాశవంతాలుగా చేసి గ్రంథాలయాలను కాంతి వంతాలుగా చేశారు. యిదీపనిఅంటే. కర్మ (పని) అంటే ఊరికే అంతులేని శ్రమచెందడం అని రాముడు యెన్నడూ అనడు. వేదాంతంలో కర్మఅంటే సత్యాత్మతో సామరస్య సంఘటన, విశ్వసంగీతంతో మేళవింపు. ఏకసత్యంతో నిస్స్వార్థమైన ఐక్యతయే నిజమైనకర్మ. తరచుగా దాన్ని సోమరితనం అని అంటారు. వేదాంతభావనతో చేస్తోన్న అతి కష్టమైన కర్మగూడా, సుఖమయంగా, సంతోషపూరితంగా ఉంటుందిగాని, కష్టంగా భారంగా ఉండదు. "చేయడానికి యేంపనిలేకపోయినా, యెల్లప్పుడూ చేస్తునేవుండు" యిది వేదాంత బోధనకు మూలసూత్రం. ఓ ఆనంద కర్మిష్ఠీ! నీవు విజయాన్ని వెదకడం చాలించుకుంటే, విజయం నిన్ను వెతుక్కుంటూ వచ్చి పాదాక్రాంతం కావాలె!



"తరళమగు ఈ జగచ్ఛర్వంబునకును
ఆది అంతంబులు నేనే నిజంబు,
నాకన్న వేరైన దేదియు లేదు.
ఓ మర్త్యులార! ఓ హిమా జనులార!
ఒక సూత్రమున బహుపుష్పంబు లట్లు
నాయందె సర్వము గుచ్ఛగాబడియె,
జలములందలి పరిశుద్ధత్వమే నె,
సూర్యచంద్రాదుల తేజంబు నేనె;
దివ్యభావంబుల సారంబు నేనె
శబ్దాలలోగల శబ్దంబు మరియు
సర్వమానవులలో గల మానవుండు
జీవ జీవంబును నేనె ఓ నరుడ!
నిజమైన అఖిలమగు భక్తిమార్గముల
కేంద్రశక్తిని, జగద్బీజంబు నేనె,
సర్వులకున్నల బలమును నేనె,
సత్యదృష్టిని నన్ను సేవించునట్టి
నిర్భయులౌ బుధజన సమూహముల
భాసురంబగు వివేకంబును నేనె.
నా ధర్మములను సమాచరించుచును
నాయందె ఏకైకలక్ష్యులై యుండు
వారి డెందంబులు ప్రేమలో నిలుచు
భయదమగు సంసారవనధిలో నుండి

వారి దప్పించియు సతతంబు నేనె
మార్గదర్శిగనుండి కాపాడుచుందు.
బుద్ధీంద్రియంబు లెవ్వని యాజ్ఞనడుచు
జీవితంబెవ్వని ఆజ్ఞచే నుండు ?
ఎవనిచే జ్ఞానులు మతి నిగ్రహింత్రు ?
నేత్రేంద్రియంబు కర్మేంద్రియములు
ఏ శక్తి చేత ప్రకాశించుచుండు?
ఆకర్ణకర్ణము, ఆ మనోమనము,
ఆ వచోవచన, మా జీవజీవంబు
ఆ నేత్రనేత్ర మా పరమాత్మ ఒకటె
దుఃఖ మృత్యువుల భక్షించు నన్నముగ.

అంతా ప్రేమ **మ**యం.

సత్యము తెలుసుకోవడమే సత్యాన్ని ప్రేమించడం.
సత్యమంటే ఏమిటి?— తత్త్వమసీ లేక ప్రేమే.

బాంధవ్యంలా, ఆకర్షణలా, ఆశలాగా, వాంఛలా, ఆదర్శంలా ప్రేమ క్రమక్రమంగా వివిధస్థితుల్లో ప్రదర్శిత మౌతుంది. భిన్నమైన పద్ధతుల్లో, భిన్నస్థితుల్లో అయస్కాంత శక్తి, విద్యుత్తు, వేడిమి, శబ్దము. కాంతి— వీటిలా ప్రేమ కన బడింది. "శక్తి కేంద్రాలుగా" భౌతికాణువులు తెలుసుకోబడు తున్నై. పదార్థము. చివరి పరిణామదశలో కేంద్రీకృత ప్రేమగా అవుతుంది. అనేకత్వంలో యేకత్వం, విభిన్నతలో ఐక్యత, బహుళతలో సామరస్యం చూడడమే ప్రకృతిధర్మం అయి ఉండడంచేత అది ప్రేమయొక్క ఒకస్వరూపమే. రహస్య

గూఢచారుల్లో, పరిశోధకుల్లో, అనుమానితులైన స్నేహితుల్లో, దుఃఖకారులైన శత్రువుల్లో, ద్రోహులైన యితరుల్లో, గూడా ప్రేమకాని యేయితర శక్తీ పనిచేయడంలేదు ప్రేమ ప్రభుత్వము తప్ప యేదీ ప్రపంచాన్ని పాలించడంలేదు. "ద్వేషం అంటే తలక్రిందుచేయబడిన ప్రేమ అని కార్లైయిలు అన్నాడు. నిరోధింపబడిన ప్రేమే, భయము. కానిచో ప్రేమ, భయాన్ని యెలా గెలవగలదు? ఒక మనిషి వెయ్యి రూపాయల మనీ పర్సుతో అరణ్యాల్లో పోయేటప్పుడు, భయపడతాడు. తన ధనాన్ని ప్రేమించాడు గనక భయపడతాడు. స్వతంత్రుడు తను కలుసుకున్న వాళ్ళందరికీ స్వాగతమిస్తాడు. స్వతంత్రుడైన వాడిలో సక్రమంగా ప్రేమ ప్రవహిస్తుంది. వాస్తవంలో ప్రేమే ఏకైకశక్తి గనుక, ప్రేమైక్యతను తెలుసుకోవడమే విముక్తి. ఆ ప్రేమచైతన్యాన్ని పొందడానికి చేసే వ్యక్తావ్యక్త సమరమే, జీవితము. ఆ పరమగమ్యమును పొందడానికి దగ్గర మార్గంలో తొందరగా ప్రయత్నించడమే విజ్ఞానం. వివిధ ప్రేమ శక్తుల్ని ఆ పరమదశతో సరిగా మేళవించుకోవడమే శీలం.

ప్రేమద్రోహం అంటూ యేదీలేదు. యెవడూ ద్రోహి కాడు. యెవని ప్రవర్తనగానీ అవిశ్వాస నీయమైందికాదు. జ్యూ అనీ, మహమ్మదీయుడనీ, శూద్రుడనీ, బ్రాహ్మణుడనీ, భూమిలోని మనుష్యులకు భావావకాశాలను తగ్గించే, నిరోధించే హక్కు మనకులేదు. మూఢ విశ్వాసాలకు దాసులైన వాళ్ళకుగూడా విముక్తి వుంది. భగవంతుడు, సత్యం, నిన్ను లోకాచార సంప్రదాయ దాస్యంలోంచి, శ్రీకృష్ణుడు గోపి

కలను తమ భర్తల గృహాల్లోనుంచీ వెలికిలాగినట్లు, లాగాలి.)

మానవుని సత్యమైన ఆత్మే యీ పరమమైన ప్రేమ. నీవే ప్రేమవు. నీవే విశ్వాత్మవు. లైలా చెక్కుటద్దాలలో నిగనిగమని ప్రతిఫలించే అరుణరాగము నీవే. నీవే మజునూ రక్తార్ద్ర హృదయకుహరంలో కనిపించేవాడివి. ఈ సత్యాన్ని నిత్యజీవితంలో గుర్తించి అనుభవించడమే పావిత్ర్యం. సర్వమూ తానేనన్న సత్యము మరిచి, వస్తువులవెంట పరుగెత్తే మానవుడు తన పరమాత్మకు దూరమై అపవిత్రుడౌతాడు. వక్ర గమనం పవిత్రత కాదు. సౌందర్యాన్ని నిరోధించడం సుశీలం కాదు. సౌందర్య సర్వస్వాన్ని నాలో కలుపుకోవడమే నిజమైన పవిత్రత. నేనింకో దానితో కలుసుకోవాలె. పోట్లాడాలె-అనే భావచ్ఛాయ ఐనాసరే నన్ను తీవ్ర వియోగ వ్యథపెట్టేటంత, సర్వంతో నా ఆధ్యాత్మ్యైక్యతను నేను అనుభవిస్తాను; నే నానందిస్తాను!.

"భాషింపు మతనితో వినగలడతడు,
ఆత్మలు ఏకమౌను పరస్పరంబు;
ఉచ్ఛ్వాస నిశ్వాసములకన్న మరియు
ఈ కాళ్ళుచేతులకన్న దగ్గరగ
భగవంతుడున్నాడు సామీప్యమందె!
ఈ సూర్యచంద్రులీ తారకాగణము
ఈ కొండ లీనదుల్ ఈక్షేత్రసమితి
ఓ ఆత్మ! ఆ విశ్వనాథు రూపములె!"

టెన్నిజన్

ఈ సుడిగాలిలో ఈ ప్రవాహముల
త్రుళ్లింతలిడు వీచికా నృత్యములను
నీకంఠ శబ్దమే వినుచుంటినోయి,
నీవె నిలుచున్నదా ఉదయసూర్యునిలో
అస్తమయారుణ సూర్యబింబమున
ఎంతచక్కని వేష మేసినావోయి,
దూరమందున నీవె, చెగ్గరనీవె!
సతము నీశబ్దము వినుచుంటిదేవ,
బ్రహ్మాండమందెల్ల నీకంఠరవళి
వినిపొంగుచున్నాడ పరవశత్వమున
నా ప్రాణములు పోవుగాక నానాథ
నినునేను వదలలేనోయి ఏమైన!

సర్వమూ మంచే— ఏది తగిందో, యుక్తమైందో, క్రమమైందో, అర్థమైందో అది భగవత్స్వరూపం. ఈ జగద్ద మనమంతా నిరంతర సామరస్యం తప్ప వేరేమీకాదు. అందు చేత ప్రపంచమొక మంచియొక్క సార్వకాలిక ప్రవాహమే. ప్రజల భూతకాల సామరస్యం (పూర్వాచారబద్ధత) వర్తమానంతో వ్యతిరేకించినప్పుడు, అప్రతిహతమైన ఈ ప్రావాహిక సామరస్యగతి (ఐక్యత లేక భగవంతుడు) ఒక ప్రచండ విద్యుత్సంరంభ ప్రదర్శనంతో (ఆమూలాల సంస్కారంతో) విజృంభిస్తుంది.

ఒకదాని స్థానంలోకి ఇంకొకటి దొరికితేనేగాని, మన మొకదాన్ని వదలిపెట్టము. ప్రేమా, మోహమూ ఒక దృష్టా

గ్రహించడం, ఇంకొకదృష్ట్యా త్యాగమే. ప్రేమ ఒక వస్తువు నుంచి ఇంకో దానిమీదికి ఎగురుతుంటుంది. నిరంతరం ప్రేమిత వస్తువులు మారుతుంటవి. పైకి పోయినకొద్దీ, అభివృద్ధి జరిగిన కొద్దీ ఒక్కొక్క వెనుకటి సంబంధాలు వదలుతుంటాము. ఇలా క్రమక్రమంగా గమించి గమించి చివరకు మానవుడు ప్రేమనే ప్రేమించే స్థితి వస్తుంది. ప్రేమితపదార్థం అప్పుడు ప్రతిదానియొక్క, అన్నిటియొక్క ఆత్మ అవుతుంది. ప్రేమికుడు తన పూర్ణాత్మకే ముడివేయబడుతాడు. తనకూ, తన ఆత్మకూ పెండ్లి జరుగుతుంది. ఈవివాహానంతరం(ఇంగ్లీషులో రిలిజియన్ అంటే రి అంటే మళ్లీ, లిజో అంటే కూడిక అని అర్థం.)నిజమైన ప్రేమికుడు యావద్విశ్వమూ, దానిలోని ప్రతిపదార్థమూ తన కౌగిలిలోనే ఉన్నట్లు గుర్తిస్తాడు. అలాంటివాడు ఇంకా దేన్ని కోరుతాడు? నీ కౌగిలిలోకి వచ్చిన పెండ్లికూతుర్ని (నీభార్యను) యింకా కోరుతావా? (కోరడం అనేది రాకపూర్వమేగదా!)

తన ఆత్మయే సర్వమని గుర్తించినప్పుడు; తను యేమీ కోరలేడు. వాంఛలు నశిస్తవి. దేనినైనా, తనదిలాగా మాత్రమే ఆనందిస్తాడు. తన కర్మనుచూచి మంచిదేనని తలుస్తాడు: ప్రతిదీ అతనికి అనిర్వాచనీయమైన ఆనందాన్ని చేకూరుస్తుంది. ప్రతిదీ--- అగోచరమైన అణువునుండి, బ్రహ్మాండమైన సూర్యుడిదాకా, (మంచు) నుండి మేఘాలదాకా, చీమనుండి నక్షత్రాలదాకా— అతన్ని సేవిస్తై. అతని మహాత్తునుగురించి జయగీతికలు పాడతై. అతనికి ఇతరమైంది ఏదీ లేదు.

ప్రపంచంతో సంబంధం అతిగా వద్దు.

ఇవిగో రెండు వస్తువులు ఇక్కడ ఉన్నవి. బటాణీగింజా, కన్యా. ఒకపుష్పాన్ని మనం పరీక్షిస్తే, దానిలో వివిధాణువులను కలిపే ఒకసమీకరణ శక్తివుంది. వేడిమి ఆకర్షణలాంటి శక్తులు కూడా వున్నవి. బటాణీ విత్తనంమాదు, దానిలో అంతే. కన్యలో—ఆమె శిరస్సులో, సర్వభావనాద్భుతాలు నిబిడీకృతమై ఉన్నవి. అందులో, కాలమూ, దేశమూ, సమస్త జగత్తూ ఇమిడిఉన్నవి. ప్రపంచమంతా, ఆ ఒక్కశిరోగోళంలో ఇమిడిఉన్నది. ఆ శిరస్సులో సర్వజగత్తు ఒక భావనారూపంగా ఉన్నది. జగత్తు శిరోంతర్గత భావనమాత్రమే. ఒకచేతిలోనుంచి ఒకచేతిలోకి బంతిని విసరివేసుకున్నట్లు ఒకశిరస్సులోనుంచి ఒక శిరస్సులోకి ఈ ప్రపంచభావన విసరివేయబడుతున్నది. అలాకాకపోతే యీ ప్రపంచం ఉండేదేకాదు. ఈ ప్రపంచ భావన అనే మోహనిద్ర, ఒకతరంనుంచి ఇంకొక తరానికి నిరంతరం ప్రవహిస్తున్నది. ప్రపంచమంటే, ఇదే. సర్వప్రపంచం నీ భావనే. నీ సృష్టే. ఈ బంతితో ఎక్కువ సంబంధంవద్దు. ఈప్రపంచం నీ శిరోకందుకమే. కాదు, నీవు క్రీడించే కాలిబంతే.

పరిత్యాగ మొక్కటే అమరత్వదాయకమైంది. సత్యమైన పరిత్యాగమంటే, యావదాందోళనా, భయమూ, బాధా, తొందరా, తొట్రుపాటూ, మనోదుఃఖం — వీటి నన్నిటినీ త్యజించడం, ప్రపంచంయొక్క గోళత్వం, సత్యాత్మ యొక్క సర్వత్వం, యీ రెంటినీ యెల్లప్పుడూ నీ మనోదృష్టిలో ఉంచుకోవడంద్వారా, యీపరిత్యాగం జరుగుతుంది

నీవు చేయవలసిన కర్తవ్యంలేదు. నీవు యెవరి అధికారానికి బద్ధుడివికాదు. యెవరికీ ఉత్తరవాదివికాదు. నీకు తీర్చడానికి బాకీలు లేవు. సంఘానికి, జాతులకూ, ప్రతిదానికీ విశిష్టంగా నీ వ్యక్తిత్వాన్ని స్థాపించుకో. అదే వేదాంతం, సంఘం, ఆచార సంప్రదాయాలూ, ధర్మాలూ, కట్టుబాట్లూ, విమర్శలూ, యివన్నీ నీ సత్యాత్మను అంటనైనా లేవు. జలశాస్త్రం చెప్పే దేమిటంటే, నీళ్ళయొక్క ఒకచిన్న ధారకూడా తన ఒత్తిడిశక్తి వలన యావత్సముద్రాన్ని అలా నిలపి ఉంచుతున్నది అని. ఓవ్యక్తిత్వ పరిపూర్ణమా! నీ కాళ్ళమీద నీవు ధైర్యంగా నిలుచో. విశ్వభారాన్ని కూడా మోయగలుతావు. అలాగా అని భావించుకో. భయబాహ్యుడవై, ఆందోళనాముక్తుడవై అహంకారవర్జితుడవికా! ఓంకారానికి యిదే అర్థాన్ని చెప్పు కుంటూ, ఉచ్చరించు.

ఓం. ఓం. ఓం.



## అగణ్య ప్రసంగాలు 6.

### విశ్రాంతి

జీవితంలోని అనంతములైన వాంఛతా, నీ మనోదేహ శకులను గురించిన వివిధ అవసరాలూ, నిన్ను యెల్లప్పుడూ, శ్రమపెట్టి, చికాకుపెట్టవచ్చు. ఈ బాహ్యాములైన పరిస్థితులు నిన్ను యిలాగా యెల్లప్పుడూ చింతాక్రాంతుడిగా చేసే అవకాశాన్ని పొందిఉంటే, నీగోతిని నీవే త్రవ్వుకుంటున్నావన్న మాట.

దీన్ని తప్పించుకునే మార్గం యేమిటి మరి? శ్రమించడం మానుకోమనీ, నిత్యకృత్యాలు ఆపమనీ రాముడు సలహా యివ్వడు. బాధాకరమైన, కష్టభరితమైన కర్మలు చేస్తున్నప్పటికీ నిన్ను యెల్లప్పుడూ విశ్రాంతిలోనే ఉంచే ఒక అలవాటును చేసుకోమనిమాత్రం సలహాయిస్తాడు రాముడు. ఈ సలహా వేదాంతపరిత్యాగమేకాని యింకేదీకాదు. నీవు యెల్లప్పుడూ పరిత్యాగ పర్వతాగ్ర శిఖరంలో నిలబడాలి. అలా నిలుచోవడంచేత, యేపనిచేసినా, నీవు శ్రమపడవు. యే కర్మ చేయవలసివచ్చినా సమానంగా, సిద్ధంగానే చేస్తావు.

యింకా వివరించి చెపుతాను. పనివేళల్లో, మధ్యమధ్య ఒక్కక్షణ కాలంమాత్రం, ఒకటేసత్యం, భగవంతుడు, ఆత్మ, ఉందనీ, యీ దేహంతో నీకు యేమాత్రం సంబంధంలేదనీ, మనస్పూర్తిగా అనుకో. నీవు సాక్షీభూతుడవు మాత్రమే. ఫలితాలతో నీకు యే సంబంధంలేదు. యిలా ఆలోచించు

కుంటూ, కళ్లుమూసుకోని, కండరాలు వివృతంచేసి, దేహాన్ని హాయిగా వదలిపెట్టు. చివరకు దేన్నిగురించి ఆలోచించే భారాన్నిగూడా పెట్టుకోకు. ఎంత ఆలోచనాభారాన్ని తగ్గించుకుంటే, అంతబలంవచ్చి, అంతసుఖం అనుభవిస్తావు.

దేహంలో బలాన్ని శక్తిని నరాలు కలిగిస్తై. భావనా శక్తినిగూడ నరాలు పోషించుతై. ఆహారం జీర్ణంగావడం,రక్తం ప్రవహించడమూ శ్వాసకార్యమూ – ఇవన్నీ చివరకు నరాల మీదనే ఆధారపడి ఉన్నయి. నీ భావన, దేహంలోని అన్ని భాగాలనూ ఆక్రమిస్తే, అంటే అన్నివిధాలైన ఊహలచేత నీవు బాధపడుతుంటే, నరాలకు చాలా భారం అవుతుంది. సదాభావనాశక్తి రూపమైన యీ నరాలపని ఒక విధంగా లాభమే అయినా, ఇది నిశ్చయంగా నష్టంకలిగిస్తుంది. విశ్రాంతి లేని భావనా కార్యంవల్ల, చికాకువల్ల, దేహావసరములైన చాలాపనులు దెబ్బతింటై. నీ బలాన్ని నిలబెట్టుకోవాలంటే, ఆరోగ్యాన్ని కాపాడుకోవాలంటే, జీవితభారాన్ని, నరాల గుర్రాలు సక్రమంగా మోయాలంటే, నీ అహంకార భావ భారాన్ని తగ్గించుకోవాలి. ఆందోళనాకరమైన భావాలను, బాధాకరమైన ఆలోచనలను, నీ జీవిత (మధువు)ను త్రాగ నీయ వద్దు. సంపూర్ణ ఆరోగ్యానికీ, వుత్సాహానికీ ఒకటే రహస్యం వుంది. నీ మనస్సును యెల్లప్పుడూ సంతోషంగా వుంచుకోవడం. తొందరపాటూ, చికాకూ, ఆందోళనా, భయం వీటిని దగ్గరకు రానీయకపోవడం.

విద్యయొక్క పరమప్రయోజనం, ప్రజలచే మంచి కార్యాలు చేయించడమే కాకుండా, వాటి ఆనందాన్ని అనుభవింప జేయడం కూడానూ. వూరికే శ్రమించడం కాకుండా, శ్రమను ప్రేమించడం నేర్పడం—

అతిముఖ్యమైన సలహా

ఆకాశం నాపాత్ర. మినుకుమనే కాంతి నా మధువు.

వస్త్రాలు ఆర్జించడం, ఒకరి ప్రేమను సంపాదించడం, ఒకర్ని సుఖపెట్టడం, అదో యిదో ప్రపంచప్రయోజనం సాధించడం— యిది నీ కర్తవ్యం అనుకోకు. ఈ ప్రయోజనాలను తృణీకరించి పారవెయ్యి. నిన్ను నీవు ప్రశాంతంగా, హాయిగా చుట్టూ పరిస్థితులనుండి స్వతంత్రంగా, లాభనష్టాలకు అతీతంగా ఉంచుకో. యిదే నీ వృత్తి, నీ జీవిత పరమార్థం. భగవంతుని చేత (మతధర్మాలవల్ల) నీ భుజస్కంధాలమీద వేయబడిన ముఖ్యకర్తవ్యం ఒకటే ఉంది. నిన్ను నీవు సంతోషంగా ఉంచుకోవడం. నీ సహమానవులు కోరేదికూడా, అంటే నీ సాంఘిక కర్తవ్యం— నీవు ప్రశాంతంగా, సుఖంగా ఉండడం. గృహపరిస్థితులవల్ల నీవు కోరబడేది కూడా నీవు ఉత్సాహవంతంగా ఉండడం. నీకు నీవు చేయవలసిన కర్తవ్యం కూడా నీవు అన్ని పరిస్థితుల్లో ఆనందంగా ఉండడం. నీకు నీవు సత్యంగా ఉండు! జగత్తులోని యే యితరదాన్ని లెక్క చెయ్యకు. యితరమైన వన్నీ నీ ముందర మోకరిల్లాలి. మోకరిల్లినా, మోకరిల్లక పోయినా నీకు లెక్కేమిటి? నీకునీవు సుఖంగానే ఉన్నప్పుడు దుఃఖపడడం, చింతించడం, మత సాంఘిక రాజకీయ సాంసారిక

దురాచారము, యీ దురాచారమే, యీ పాపమే అన్నింటికీ మూలకందము. ఒకవేళ పాపం చేయదలచినా- చేయగలిగింది యిది ఒక్కటే. ఇది అన్ని పాపాలకూ, పతనాలకూ పునాది. ఎప్పుడూ ప్రశాంతపూర్ణుడివిగా ఉంటే, నీ పరిసరాలు కూడా నీకు అనుగుణంగానే ఉంటై. యే పనిని గురించిగాని, తొందర పాటూ, దుఃఖపాటూ నీ కర్తవ్యం కాదు. ఆత్మతృప్తి, ఆత్మ విశ్రాంతి, ఆత్మానందం కలిగి ఉండడమే నీకు కర్తవ్యం. మన భుజాలమీద యే కర్తవ్యం లేదు. ఏ భారం లేదు. నీకు తప్ప నీవు యెవరికీ ఉత్తరవాదివి కావు. ఈ ఉత్సాహ ప్రశాంత సూత్రాన్ని అతిక్రమిస్తే, నీవు నీకే మహా పాపివి. ప్రొద్దున లేచి నప్పట్నుంచీ గదులన్నీ ఊడవడం, ఆఫీసుకు పోవడం, వంట వండడం, గుడ్డలు ఉతకడం, వ్రాయటం, చదవడం, యింకా అదనీ, యిదనీ, యేవేవో పనులు తమకు ఉన్నాయని మిగతా ప్రజల్ని అనుకోనీ, కాని,నీవుమాత్రం ఉదయం లేవగానే, నేను పరమానంద స్వరూపుడను అని ధ్యానించు. యిదే నీకర్తవ్యం. యిలా అంటే యితర యింటి పనులన్నీ మానెయ్యమనికాదు అర్థం. వాటన్నిటినీ యేదో ఆటల్లాగా, అంతముఖ్యమైనవి కాకుండా చేయాలి. నీ ఆధ్యాత్మిక ఆరోగ్యం యేదో ఒకటి చెయ్యమని చెపుతుంది కాబట్టి, యీ గృహకార్యాలు నిర్వర్తిం చాలి. యేదిచేస్తున్నా, నీ చేతిలోవున్న ఆపనిని ముఖ్యంగా చూడకు. ఆత్మ ఆనందాన్ని పొందడమే నీ నిజమైనపని. విద్యార్థులారా వినండి, రాబోయే పరీక్షాఫలితాల నాడు యింతో సిద్ధాపడుతుంటిరా, యిప్పుడు యేదో ధిగులుగా

ఉంటారు. అలా అయితే మీరు యెప్పుడూ సంతోషపడలేరు. యెప్పుడూ సంతోషం మీకు దూరంగానే ఉంటుంది. పోలిక కలిగిన వస్తువులు ఒకదానివద్దకు ఒకటి చేరుతై. మీలో భగవదానందాన్ని పొందండి. యిప్పుడే పొందండి. మీ పరీక్షా విజయానందం మీ వైపుకే రావాలి. యిది ధర్మం.

"నవ్వుము - నీతోడ జగమును నవ్వు
ఏడువు మీవొక్కడవె ఏడ్వవలయు:
ఈ ధర బహువృద్ధ ధారుణీతలికి
తగినంత తనదుఃఖమే తలగలదు
ఆనందమెవ్వరి చెంతనో తాను
ఋణము తేవలసియేయున్నది ధాత్రి.
పాడుము - గిరులు ప్రతిధ్వనుల్ సేయు,
రోదింపుమది గాలిలోపోయి కలియు:
ఆనందపడుచుండు మెందరో జనులు
గుంపులు గుంపులు నీచుట్టునుండ్రు
దుఃఖంపు మొక్కరు చెంత కేరారు:
వారు నీ ఆనందమే పంచుకొండ్రు,
నీశోక మెప్పుడు కోరుకోరోయి.
ఉల్లాసముగనుండు ముత్సాహపడుచు

నీయిల్లు మిత్రులతో నిండిపోవు.
చింతతో నుండుము మొగము
నీ అమృతానంద మధువుగ్రోలుటకు
అందరు శిద్ధమే వద్దనరెవరు
కాని నీజీవిత శోకవిషంబు
నీ వొక్కడవె త్రాగగావలయు
విం దను - హాలులు కిలకిలలాడు
ఉపవాసమను మందుకొక్కడురాడు.
విజయించి, నీ మహానందమ్ము నిమ్ము
అదినీవు బ్రదుక సహాయంబుసేయు.
మఱినీవు మరణింపుచున్నచో నెవరు
తోడుగావచ్చి సహాయమ్మునడరు.
ఆనంద మనునట్టి మందిరంబందు
వేలమందికి నిల్వచోటున్నదోయి,
కాని బాధాహూప గొందిలో నిలువ
ఒక్కనికేచోటు తెలుసుకోవోయి."

(ఎల్లా వ్హీలర్ వింకాక్సు.)

"యోగ్యమైనది ఒక్క ఆనందమేను
ఇప్పుడే ఆనంద పడదగుకాల
మిక్కడే అనందపడదగు స్థలము,

నీవు ఆనందంబుగా నుండుటేను
పరులను సంతోషపెట్టు మార్గంబు."

సారాంశము:—

రాముడు రెండు ముఖ్యవిషయాలు మీాకు చెప్పుతున్నాడు.

1. అహంకార వర్జన.
2. సత్యాత్మ ప్రతిష్ఠాపన.

మొదటిది:—వేదాంతం ప్రకారం, వర్జించడంఅంటే సంపూర్ణంగా వదిలివేయడం, విశ్రాంతి, పరిత్యాగం. అవకాశం చిక్కినవెంటనే, మీాదేహభారాన్ని మీారు మోయనే లేదో అన్నట్లు, దానికీ మీాకు సంబంధమేలేదేమో అన్నట్లు, ఒక కొండ మీా కెంతదూరమో, యిదీ అంతేనా అన్నట్లు, అసలు మీాది కానేకాదేమో అన్నట్లు, మీాదేహాన్ని కుర్చీమీాద పారేయండి. మీా భావనాబలంమీాద ఆధారపడకుండా, దేహాన్ని కాసేపు అలా పండుకోనీయండి శవంలాగా. దేహాన్ని గుఱించిగానీ, యే యితర వస్తువును గురించిగానీ, ఆందోళనకు నీ మనస్సులో తావుయివ్వకు. సమస్త వాంఛలూ, ఆశలూ, వూహాలు విసర్జించు. యిదీ వర్జించడంఅంటే. నీకున్న ఆస్తిని భూమిమీాదనే ఉండనీ, నీ గుండెలమీాద పెట్టుకోవాకు.

రెండవది: బ్రహ్మజ్ఞానం, భగవదిచ్ఛ, నీ యిచ్ఛగా చేసుకో. సంతోషంగానీ దుఃఖంగానీ, ఆయనయొక్క ప్రయోజనాన్ని నీదానిలాగానే సమర్థించు. దేహానికి, తత్పరిసరాలకు అతీతుడవుకా. మనస్సు, దాని వుద్దేశాలూ, జగత్తూ, దాని అభిప్రాయాలు వీటినికూడా అధిగమించు! సర్వవ్యాపితమైన దివ్యశక్తివనీ, సూర్యులకు సూర్యుడవనీ, యీ దృశ్య ప్రపంచాతీతుడవనీ, సృష్ట్యతీతుడవనీ, బ్రహ్మానంద సమైక్యతా మూర్తివనీ, సర్వతంత్ర స్వతంత్రుడవైన రాముడివనీ, నిన్ను నీవు గుర్తించుకో. సహజంగా వచ్చిన యేస్వరంతోనైనా సరే ఓంకారోచ్చరణ గానంచెయ్యి.

అన్ని కారణాలూ, చిక్కులూ, చికాకులూ అన్నీ నిన్ను వదలిపోతై. నీవు యెలా ఉండాలని అనుకుంటావో, అలాగే ఉంటై, ప్రపంచమూ, నీపరిసరాలున్నూ. ప్రపంచాన్ని నీగుండెలమీద బరువుగా కూచోనీయవద్దు. ప్రపంచంలోని సంఘమూ, అభిప్రాయాలూ కేవల నీ భావం లాగానే ఊహించుకోని, ప్రపంచమంతా నీశక్తియొక్క నీడగా భావించి రాత్రింబవళ్లూ సత్యాన్ని గురించి ధ్యానంచెయ్యి. నీవు పవిత్రతాశిఖరాన్ని యెందుకు అందుకోలేక పోతున్నావంటే, నీవు అతి సమీపస్థమైన సత్యాత్మను వదలి యితరుల అనిశ్చలమైన తొందరపాటు నిర్ణయాలకు బద్ధుడవౌతున్నావు గనుక. నీ అభిప్రాయాలతో జీవించు. ఇతరుల అభిప్రాయాల కోసం

కాదు, స్వతంత్రుడిగా ఉండు. భగవంతుణ్ణి, ఆత్మను సంతోష పెట్టను ప్రయత్నించు. అద్వితీయుడైన ఆయన్ను, నీ నిజమైన భర్తను, యజమానిని, నీ అధిపతిని, నీ లోపలి పరమేశ్వరుని సంతోషపెట్టను ప్రయత్నించు. అధిక సంఖ్యాకులైన ప్రజల్ని తృప్తిపరచలేవు. యీ వేయితలల గుంపును తృప్తిపరచ వలసిన అగత్యం అసల్లేదు నీకు. నీ శిల్పివి నీవే. యెవరూ శ్రోతలు లేరని భావించి నీకు నీవే గానం చేసుకో. ఏకాంత భావనతో నీ ఆత్మ సంతోషిస్తే ప్రజలుగూడా తప్పక తృప్తి పడతారు. యిదీ ధర్మం.

ఆలోచనల్లో మునిగినవాడు పతన, రుజా, రాజ్యంలో వసిస్తాడు. అతను తెలివిగలవాడులా, చదువుకున్న పండితుడులా కనపడ్డా- అతని తెలివీ, పాండిత్యమూ చెదలు తిన్న కొయ్య లోపలి డొల్లలాగా ఉంటై. వేసవిలో కోటు విడిచివేసినట్లు శ్రామికుడు పని కాగానే పనిముట్లు తీసి అవతల పెట్టినట్లు, ఆలోచన అవసరమే అయినా దానికి నిరంతరమూ కట్టుబడకూడదు.

"పనిచేస్తున్న సమయములో, నీ ఆలోచనఅంతా దానియందే నిమగ్నమై ఉండాలి. దానికి సంబంధించని యే విషయ విచారణద్వారా మనస్సుకు అభ్యంతరం రాకూడదు. బ్రహ్మాండమైన యంత్రము గొప్ప శక్తితో పనిచేస్తూన్నప్పుడు యంత్ర

భాగాల్లో ఒడుదుడుకులు లేనట్లుగా, ఆయంత్రంలా మనస్సును కేంద్రీకరించాలి.

పని పూర్తి అయి యింక యంత్రసహాయం అవసరం లేనప్పుడు అది పూర్తిగా ఆగిపోవాలి. యే మాత్రం చలనం ఉండకూడదు. షెడ్డులోకి వచ్చి ఆగిన యింజనుతో పిల్లల్ని ఆడుకోమన్నట్లుగా— పని పూర్తి కాగానే కర్త తన సత్యాత్మ నివసించే చైతన్యరాజ్యంలోకి వెళ్లిపోవాలి!!

ఓం.



# అరణ్య ప్రసంగాలు 7.

## గృహస్థ జీవనము

సరిగా కంటి అద్దాల వంటిది,

కంటి అద్దాలతో మనము ప్రతిదీ చూస్తాము. కానీ, అవి కండ్లకు బరువుగా లేవు. అవి దృష్టికి అవరోధంగా లేవు కదా; ఇంకా దృష్టికి దోహదంగా ఉన్నవి. అవి నేత్రాలకూ, ఇతర వస్తువులకు మధ్య తెరగా ఉండడానికి బదులు, ఇంకా వస్తువులను ప్రకాశింపచేయడం లేదా! భార్యాభర్తల మధ్య సంబంధం యిలాగే ఉండాలె. ఒకరికొకరు అవరోధం కావడానికి బదులు, ఒకరి ద్వారా ఒకరు అఖిల విశ్వాన్ని దర్శించాలె. వారి ఐక్యత ఆధ్యాత్మికమైతే, వైదాంతికజ్ఞానం మీద తప్ప, మరే యితర వరతులమీద ఆధారపడకున్నట్లయితే, ఆ దంపతులు బాహ్యాకృతులకు, దేహాభిమానాలకు, పరిసరాలకు, ఆచారమర్యాదలకు, మనోవికారాలకు, అలవాట్లకు అతీతులై, పరమాత్మను దర్శించగలిగినప్పుడు మాత్రమే ఒకరిలో ఒకరు సర్వవిశ్వాన్ని దర్శిస్తారు.

మనం మాటిమాటికి గాలి పీలుస్తున్నాం. వదులుతున్నాం. మనకు గాలి ఎంత సమీపంగా ఉంది? అయితే మనం దానిని అనుకోనే అనుకోం. మనకా విషయం గుర్తే లేదు. అదే మాదిరి గృహస్థజీవనం కూడా పూర్ణజ్ఞానంలో ఉండాలె. భారమేముంది! ఒకరి గుండె కొకరు భారమై ప్రేళ్లాడకూడదు. ఇద్దరికీ స్వేచ్ఛ! ఒకరి భావా లొకరికి ప్రతి

బంధకాలు కాగూడదు. నేటి గృహస్థప్రజల విషయంలో, భార్యాభావన మానవుడి ఆధ్యాత్మ్యకాభ్యున్నతికి పెద్ద ఆటంకమై పోయింది. అలాగే భర్త అనే తలంపు స్త్రీకి పెద్ద అవరోధంగా, భారంగా ఉన్నది.

భారతదేశంలో స్త్రీ పురుషాదులు కండ్లలో కాటుక పెట్టుకుంటారు. అది చూపును బలపరుస్తుంది. అది కండ్లల్లో ఉన్నా, దృష్టికి ఆటంకం గాదు. అది ఒకవేళ దృష్టికి ఆటంకంగా కనబడ్డదా, ఆ కాటుకలో చెడు ఉన్నదన్నమాటే! నీకు కడుపు భారంగా ఉన్నట్లు తోస్తే, దాంట్లో ఏదో దోషముందన్నట్లే, ఇది ప్రకృతి నియమం.

రాముని పూర్వాశ్రమపు భార్య, రాముణ్ణొక ప్రశ్న అడిగింది. "మీరు నన్ను జ్ఞాపకముంచుకుంటారా?" రాముడన్నాడు: "ఉహు- రాముడెప్పుడూ గురుంచుకోడు." నీకు భిన్నుడుగా ఉంటేనేగాని, గుర్తుంచుకోవడం జరగదు. నీ కండ్లు నీవు గుర్తుంచుకుంటావా? నీ ముక్కూ, నీ చేతులూ నీవు గురుంచుకుంటావా? ఎప్పుడూ గుర్తుంచుకోవు. వాటికీ నీకూ భేదం లేదు. ఒకరితో ఒకరు ఐక్యమైనప్పుడు ద్వైతభావం ఎక్కడ ఉంటుంది? అతనికి జ్ఞాపకం ఎక్కడఉంటుంది? ఈ విషయాలు విశదీకరింపవలసియున్నది.

మనకొక స్నేహితుడి దగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. దాన్ని మనం ఎంతో ప్రేమిస్తాము. ఆ జాబు మన స్నేహితుడిది కాబట్టి దాన్ని మనం ప్రేమిస్తాము. అదే విధంగా భార్యా

భర్తలు భగవత్సన్నిధినుండి వచ్చిన ఒక రకమైన ఉత్తరాలు కావాలె. భర్తశరీరం భగవంతుడినుండి వచ్చిన ఒక రకమైన ఉత్తరం లేక పటంగా ఉండాలె. ఆ విధంగా ఆమె తన భర్త శరీరాన్ని ప్రేమించవచ్చు, గౌరవించవచ్చు. ఇంతకు, శరీరం ఉత్తరంగా, ప్రతిపటంగా మాత్రమే ఉండాలె: అసలు వస్తువుగా చూడకూడదు. ఆ విధంగా ఆమె అతనిద్వారా భగవంతుణ్ణి దర్శిస్తుంది. దైవత్వంయొక్క చిహ్నంగా, భగవంతుని రూపపటంగా భర్త ఉండాలె. రాత్రిళ్లు శరీరాలుకలిస్తే పగలు స్త్రీ ఆధ్యాత్మికైక్యత చెందాలె. రాత్రిళ్లు శరీర సంయోగముతోపాటు ఆత్మైక్య సంయోగం భావించకున్నట్లయితే, తర్వాత పగలన్నా ఆమె ఆ లోపాన్ని పూరిచేసుకోవాలె. ప్రతి ఆలింగనంలో ఆమె దైవత్వాన్ని స్వీకరిస్తున్నట్లు భావించాలె. "ఓ పరంజ్యోతీ! నా దెగ్గరకు రా! నేను దివ్యతేజాన్ని కౌగలించుకుంటాను. మీరు దాన్ని ఆనందమనవచ్చు; మీరు దాన్ని పరిపూర్ణపవిత్రత లేక సకలవిశ్వైక్యత అని పిలవ్వచ్చు. ఓ దివ్యత్వమా! జ్ఞానమా! రా! నా దెగ్గరకు రా! నిన్ను నేను స్వీకరిస్తాను." ఆ విధంగా ప్రతిదీ దైవత్వానికి చిహ్నంగా మారాలె. రాత్రిళ్ళు యిలా భావించలేకపోతారా, పగలైనా అనుకోవచ్చు. మీఐక్యతను, మీ వివాహాన్ని నిరంతరం అలా భావించవచ్చు. ఆ దివ్యత్వాన్ని, అభగవత్తత్వాన్ని కౌగలించుకోడానికి సర్వవిశ్వము తన శరీరమే అని భావించడానికి సర్వైక్యత, సర్వేశ్వరైక్యత, సర్వానుసంధానం చెందడానికి, ఈ భావన మీ మనస్సులో అచంచలమై ఉండాలె. శరీరైక్యతా

భావాన్ని పోగొట్టుకోమని, ఒక శరీరం ఇంకొక శరీరానికి భారం చేసుకోవద్దని ఒక వైపు కోరుతూ, నిరంతరాత్మైక్యభావనలో ఉండమని వేదాంతం నిన్ను కోరుతున్నది. నాలో దివ్యత్వము, శక్తి, ఐక్యత, పరిపూర్ణ దివ్యప్రేమ, విశ్వసామరస్యమూ ఉన్నవని ఎప్పుడూ ధ్యానం చెయ్యి. తత్త్వమసి! తత్త్వమసి! అతడే నేను, నేనే అతడు అప్పుడు నీవు పెండ్లాడిన నీ స్వాత్మనే చూస్తావు. తృణకణాల్లో, వృక్షాల్లో, నదుల్లో, సర్వంలో ఉన్న నీ ఆత్మనే నీవు చూస్తావు. 'సోహం' అని తెలుసుకుంటావు.



# అరణ్య ప్రసంగాలు 8.

## తొంభైతొమ్మిది అనే వల

"99 అనే వలలో పడవాడు" అనే సామెత ఉంది. అంటే ఏమిటి? ఒక వూళ్ళో ఒకడున్నాడు. వాడూ వాడి భార్య, ఒక గుడిసెలో హాయిగా కాపురం చేస్తున్నారు. ఎంత సౌఖ్యంగా ఉన్నారనుకున్నారు!

రోజంతా కష్టించి, దినభత్యం సంపాదించేవాడు. అతనికి ఇంకో ప్రపంచపు గొడవే లేదు. అసూయాభావమే లేదు. అతడు మంచి నిష్కపటమైన పనివాడు. అతనింటి ప్రక్కనే, ఒక గొప్ప భాగ్యవంతుడుండేవాడు. ఈ భాగ్యవంతుడెప్పుడూ చింతాక్రాంతుడై యుండేవాడు. వానికి సౌఖ్యమన్నమాట లేదు. ఒకనాడొక వేదాంతియైన సన్యాసి, ఈ దరిద్రుడియిల్లూ, భాగ్యవంతుడియిల్లూ రెండూ చూచాడు. ఆ సన్యాసి భాగ్యవంతుడితో యిల్లా అన్నాడు. "నీదుఃఖానికి, విచారానికి కారణం నీ సంపదే" అతని సంపదే అతణ్ణి వశంచేసుకొన్నది. అతణ్ణి త్రొక్కిపట్టింది. ఆ ధనికుని చిత్తం; ఒక వస్తువునుండి ఇంకొక వస్తువుమీదికి పరిభ్రమిస్తున్నది. ఆ సన్యాసి, పొరుగున ఉన్న పేదవాణ్ణి చూపిస్తూ యిలా అన్నాడు, "అతణ్ణి చూడు. అతనికేమున్నా ఉందా! అయినా అతని ముఖంమీద ఆనందం తాండవమాడుతున్నది. అతని కండరాలు చూడు. ఎంత బలిష్ఠంగా ఉన్నవి. అతని భుజాలు ఎంత దృఢంగా వున్నవి. ఆవిధంగా హాయిగా, ఆడుకుంటూ, పాడుకుంటూ, యీలలతో, కూనరాగాలతో వెళ్ళుతాడు." ఈ ధనికుడు, యీ ఆనందమెప్పుడూ అనుభవించి ఎరుగడు. అతడు తన

సంపదను, ఇతరులు వాంఛించేవిధంగా వృద్ధిపొందించాడు. అప్పుడు ధనికుడు, సన్యాసి మాటల్లోని సత్యాన్ని పరీక్షింప దలచాడు. సన్యాసి చెప్పిన ప్రకారం, ధనికుడు ఆ పేదవాని యింట్లో 99 రూపాయలు కట్టగట్టి జారవిడిచాడు. మరునాడు పేదవాని గుడిసెలో నిప్పే రాజలేదు. ప్రతిరోజూ ఆ పేద యింట్లో బాగా నిప్పు రాజుతూ వుండేది. అతడు సంపాదించిన ఆ కాస్తలోనే కావలసినవి తెచ్చుకోని, సుఖంగా వండుకొనే వాండ్లు. ఆ రాత్రి పొయ్యిలో పిల్లి లేవలేదు. ఏమీ వండుకో లేదు. ఆ రాత్రల్లా కటికి ఉపవాసం చేశారు. మరునాడు ఉదయం, సన్యాసి ధనికుడితో, ఆ పేదవాని యింటికి వెళ్ళి, రాత్రల్లా యింట్లో నిప్పు వెలిగించని కారణం ఏమిటని అడిగాడు. ఆ దరిద్రుడు సన్యాసిముందర నిజంచెప్పవలసి వచ్చింది, అతడు చెప్పాడు. "అంతకుముందు రోజుకు కొన్ని పైసాలు సంపాదించేవాణ్ణి. వాటితో రోజుకు కావాలసిన పిండి, ధాన్యం వగయిరాలు కొనుక్కొనే వాళ్ళం. అయితే, నిప్పు రాజెయ్యని రోజే రు 99-0-0 లు పెట్టిన చిన్నపెట్టె ఒరికింది మా యింట్లో. రు 99-0-0 లు చూడగానే రు 100-0-0 లు భర్తీచేస్తే బాగుండునే అనే ఆలోచన వెంటనే తట్టింది. ఆఒక్క-రూపాయి పూర్తిచేయడానికి, మేము దినంమార్చి దినం ఉపవాసం ఉండి కూడబెట్టాలని తలచాం. ఒకవారం యిలా కష్టపడితే ఆ రూపాయి భర్తీచేయవచ్చనుకున్నాం, అందుచేత మాడవలసి వచ్చింది." ధనికుల దుఃఖానికి రహస్యమిదే. వాళ్ల కెంత సంపదవస్తే అంత దరిద్రులవుతుంటారు. 99 రూపాయలు వస్తే ఆ ఒకటి పూర్తి చేయాలనీ 99000 వస్తే రు 100,000 లు పూర్తిచెయ్యాలని వాండ్ల తృష్ణ.

అతని గొడ్డలి ఒకటి పదును పెట్టవలసి వుంది.

బెంజిమెన్ ఫ్రాంక్లిను, తన స్వీయచరిత్రలో తన బాల్యానుభవమొకటి చెపుతాడు. అతడు చిన్నతనంలో ఒకసారి 'ఫిలడెల్ఫియా' (Philadelphia) లో ఉన్న బడికి పోతున్నాడు. ఒకనాడు దారిలో ఒకపనిచేస్తున్న కమ్మరిని చూడ్డం తటస్థించింది. ఆ రోజుల్లో యంత్రవిద్య ఇప్పుడున్నంత గొప్ప అభివృద్ధిలో లేదు. ఆ కమ్మరి తన దుకాణంలో పనిచేసుకుంటున్నాడు. బెంజిమెన్ ఫ్రాంక్లిను, ఆ కమ్మరినిచూస్తూ దుకాణం దగ్గర నిలబడ్డాడు పిల్లలు సహజంగా వారికి కలిగేభావాలతో శరీరం మరచిపోతారు. అతనిచేతిలో పలకవుంది. బడికి పోతున్నాడుకదా, అయితేనేమి - బడివిషయమే మరిచిపోయాడు. ఆ కమ్మరిచేసేపనిచూస్తూ ఆనందిస్తున్నాడు. కమ్మరి పిల్లవాని అభిలాషను గుర్తించాడు. అతను తనపనిముట్లు, కత్తులుపదును పెడుతున్నాడు. ఆ కమ్మరిసహాయకార్మికుడు ఆ సమయంలో ఏదోపనిమీద వెళ్లాడు. తానుచేస్తున్నపనిలో అతిశ్రద్ధవహిస్తున్న ఆ పిల్లవాణ్ణి చూడగానే, కమ్మరి అతన్ని దగ్గరకుపిలిచాడు. బెంజిమన్ దెగ్గరకువచ్చాడు. కమ్మరి అన్నాడు, "ఎంత మంచి పిల్లవాడివి! ఎంతచక్కనిపిల్లవాడివి! ఎంత తెలివికలవాడివి!" బెంజిమెన్ ఉబ్బిపోయాడు. బెంజిమెన్ ముఖంమీద చిరునవ్వులు చూడగానే కమ్మరి అన్నాడు, "నాయనా! కొంం సహాచెం, యీ సానరాయి తిప్పడంలో సహాయం చేస్తావా?" జంగా బెంజమెన్ తక్షణమే ఆపనికి పూనుకున్నాడు. బాలురు చాల ఉత్సాహంగా ఉంటారు. ఏదోఒకపని ఉండాలెవాండ్లకు.

వాండ్లకు. కొంచెం, హాస్యంచెప్పి నవ్విస్తుంటే చాలు ప్రపంచం అవతలి చివరకు పొమ్మన్నా పోతారు. బెంజిమన్ సానతిప్పుతున్నప్పుడు, కమ్మరి ఊరక నవ్వించడం, పొగడడం చేస్తున్నాడు. పిల్లవాడు పనిచేస్తున్నాడు. ఈలోపల కమ్మరి చాలాకత్తులు, గొడ్డళ్లు పదునుపెట్టాడు. అప్పటికే ఆపిల్లవాడు అలసిపోయాడు. అతనికి తనస్కూలు, పాఠాలు ఒప్పజెప్పే గంట జ్ఞప్తికివచ్చినవి. దుకాణం వదలి పోదామనుకున్నాడు. కాని, కమ్మరి తనపొగడ్తతో, హాస్యంతో ఉబ్బిస్తూ యిలా అన్నాడు. "ఓమంచి అబ్బాయి! బళ్లోనీవెప్పుడు దెబ్బలుతినలేదని నాకు తెలుసు. నీవుచాలా మంచివాడవు. తెలివికలవాడవు, ఇతరపిల్లలు మూడుగంటల్లో చేసేదాన్నినీవు ఒకగంటలో చేయగలవు. నీవంత మంచివాడవుకాబట్టే, మీపంతులుగారు నీమీద ఎప్పుడూకోపపడడు." ఒకటితర్వాత ఒకటి కత్తులుసాన పెట్టబడినవి. ఇంకొకటి సగమయినతర్వాత బెంజిమెన్ పోవాలనుకున్నాడు. కానీ పోలేకపోయినాడు. పాఠాలు ఒప్పచెప్పేగంట పదింటికి. కానీ అతడు పన్నెండుగంటలకు వదలిపెట్టబడ్డాడు. బడికి వెళ్లాడు. పాప మాలస్యంగా వచ్చినందుకు దెబ్బలు తిన్నాడు, అలసిపోయాడు, చేతులు కందిపోయినవి. తత్ఫలితంగాఒక వారంవరకూ బాధపడవలసి వచ్చింది. తనపాఠాలు చదవలేకపోయినాడు. అప్పటినుంచి, ఏవరైనా ఎప్పుడైనా అతణ్ణి పొగిడినప్పుడెల్లా, "అతనిచేతిలో సానపట్టవలసిన గొడ్డలి ఉంది" అనేభావం మనస్సులోకి వచ్చేది. ఈ పనిజరిగినతర్వాత, బెంజిమెన్ఫ్రాంక్లిను ఎప్పుడూపొగడ్త అనేవలలోచిక్కలేదు.



# అరణ్య ప్రసంగాలు 9.

ఒక సన్యాసివద్ద కొన్ని రాగి నాణాలున్నవి. వాటిని కొంతమంది పిల్లవాండ్లకు యివ్వ సంసిద్ధంగా ఉన్నాడు. మాకు మాకని అనేకమంది బీదజనులు గుంపులు గూడారు. కానీ వాండ్లకు యివ్వలేదు. చివరకు, ఒక ఏనుగపైన కూర్చోని, రాజుగారు సన్యాసిముందరగా పోతున్నాడు. వెంటనే సన్యాసి రాజుగారు కూర్చున్న అంబారీలోకి ఆ రాగిడబ్బులు విసిరాడు. ఆకస్మికంగా సన్యాసిచేసినపనికి రాజు ఆశ్చర్యపడ్డాడు. "అందరికంటే నిరుపేదవుకనుక, ఈడబ్బు నీకే" అని సన్యాసి చెప్పాడు. నేనెలా అందరికంటే పేదవాణ్నని రాజు అడిగాడు. "నీసంపదల చేత, నీ నిరంతరతృష్ణచేత ఆరని ఆకలిచేత, ఇంకా రాజ్యాలు కావాలనే దాహంచేత, అందరికంటే నీవే నిరుపేద"వని సన్యాసి జవాబిచ్చాడు.

ఒకమనిషి పెట్టెలో రూపాయలు కుప్పలు పోసుకుంటున్నాడు. ఒక సన్యాసి ఆ దారిన పోతున్నాడు. ఈ ధనికుని యింటికే ఆ సన్యాసి ఆహ్వానింపబడ్డాడు. "ఎందుకు నీవిలా ఇనపపెట్టెలో ఉక్కు అరల్లో, డబ్బంతా కూరుస్తున్నావు ?" అని సన్యాసి అడిగాడు. ఆ భాగ్యవంతుడన్నాడు. "అయ్యా! మీకేమి ? ప్రజలే మిమ్మల్ని పోషిస్తారు. ఒకవేళ వాండ్లు పెట్టకపోయినా, దేహమంటే మీకు గడ్డిపోచతో సమానం. అయితే కొంత ధనం కూడబెట్టడం మాకు అవసరం. అవసరమైనప్పుడు మాకది ఉపయోగిస్తుంది." సన్యాసి ఏమీమాట్లాడలేదు. మరునాడు, భాగ్యవంతుడు సన్యాసిని చూడబోయాడు. సన్యాసి ఉండేది ఒక సగం కూలిపోయిన గుడిసె. భాగ్య

వంతుడు వచ్చేవరకల్లా సన్యాసి ఏమిచేస్తున్నాడు? కష్టపడి పెద్దగోయి తీశాడు. చెమటపోసేటట్లు, గుండ్రటి రాళ్ళన్నీ ఏరి, ఆ పెద్దగొయ్యినిండా కూరుస్తున్నాడు. ఆ ధనికుడు వచ్చి, "స్వామీ! స్వామీ! ఏమిటిక్కడ చేస్తున్నారు?" అని అడిగాడు. సన్యాసన్నాడు: "ఈ అందమైన రాతిముక్కలన్నీ పోగుచేస్తున్నాను. ఎంత గుండ్రంగా ఉన్నవో చూడూ?" భాగ్యవంతుడు నవ్వి అన్నాడు, "ఎందుకండీ అవ్వి ఏరుతున్నారు? ఇదిగో ఇక్కడే యిల్లాంటిరాళ్ళకొండ పెద్దది వుంది. వీటిని ఏరడంవల్ల ఏమిలాభం?" "నేను వీటిని అవసర సమయంకొరకు భద్రపరుస్తాను. ఒకవేళ, ఈ కొండలన్నీ భూముఖంనుండి మాయమై కొట్టుకపోవచ్చు. అందుకోసం, నేను వీటిని ఏరి కూడబెట్టి ఉంచుతాను. అప్పుడు నాకు యివి ఉపయోగపడవా?" అని సన్యాసి అన్నాడు. "అది ఎలా జరుగుతుంది? భూమిమీదనుండి, రాళ్లు ఎలాకొట్టుకపోతవి?" అని ధనికుడు అడిగాడు. సన్యాసి, ఆధనికుడుమీదికి ఒక్క గంతువేసి యిలా అన్నాడు, "నీవే నాకీపాఠం నేర్పావు. ఓ బుద్ధిహీనుడా! నీ అన్నం, నీకు భగవంతుడు ప్రసాదించని కాలిమెన్నడూరాదు. నీశక్తిని, నీ యమూల్యకాలాన్ని, వెండి బంగారం పోగుచేయడంలో పాడుచేయడంవల్ల నీకేమిలాభం? నానుండి ఒక గుణపాఠం నేర్చుకో. జీవితం, ఈ నిష్ప్రయోజనతా జనతకోసం కాదు; ఈ వృథా వ్యయంకోసంకాదు. ఇలాంటి నీచమైన, క్షుద్రమైన విషయాల్లో, విచారాల్లో జీవితాన్ని వృథా చేయవోకు.



# అరణ్య ప్రసంగాలు 10

ఒకానొకప్పుడు, మహమ్మదీయ పరిపాలనలో, ఒక ఖాజీ లేక ప్రతినిధి, ఒక చక్రవర్తి సన్నిధికి రావడం జరిగింది. ఆ చక్రవర్తి, ఖాజీని అతని మతవిషయ నటనలు చూచి ఎక్కువ గౌరవించేవాడు. ఒకసారి అతనిశక్తి ఎలాంటిదో పరీక్షిద్దామనుకున్నాడు. అతను స్వయంగా పండితుడుకాదు. కానీ, ఆ ఖాజీ పదవిని ఆశిస్తున్న యింకొకనిచేత, యీ క్రింది ప్రశ్నలు అడగజేయబడినవి. ఖాజీ చక్రవర్తిముందు నిల్చున్నాడు. చక్రవర్తి అడిగాడు, "భగవంతుడు ఏవైపు చూస్తుంటాడు? భగవంతుడు ఎక్కడ కూర్చుంటాడు? అతడేమి చేస్తాడు?" తనకు సంతృప్తికరంగా జవాబు చెబితే, ఉద్యోగ పదవి నీదేనని రాజు చెప్పాడు. రాజడిగిన ప్రశ్నలు చాలా కఠినమైనవని ఖాజీ తలచాడు. రాజును ఎలా ఆనందపెట్టాలనో, పొగడాలనో అతనికి తెలుసు. అందుచేత, ఆ ప్రశ్నలకు జవాబు చెప్పడానికి 8 రోజులు వ్యవధి కోరాడు,

ఆ ఎనిమిది రోజులూ, ఖాజీ ఆలోచించాడు. ఆలోచించాడు. ఏమీ పర్యవసానం తోచలేదు. రాజును తృప్తి పరిచేటట్లు ఏలా జవాబుచెప్పడం! చివరకు ఎనిమిదోరోజు వచ్చింది. రాజు అడిగిన ప్రశ్నలకు ఖాజీకి జవాబు తట్టలేదు. ఇంక కొంత వ్యవధికి, జబ్బుగాఉన్నట్లు నటించాడు. ఆ ఖాజీ సేవకుడు (పాజి) యజమానివద్దకు వచ్చాడు. ఏమిటి సంగతని అడిగాడు. "పోరా నాయనా! నన్ను బాధించవాకు! నేను

చావబోతున్నాను" అని ఖాజీ విసుక్కున్నాడు. సంగతేమిటో నేను తెలుసుకోకూడదా. మీరు బాధపడడంకంటే, నేనుచావడం మంచిది." అని సేవకుడు బ్రతిమిలాడాడు. అప్పుడు కష్ట మేమిటో పాజీకి వివరింపబడింది. ఈ సేవకుడు ఎంతమాత్రం గౌరవనీయమైన పదవిలో లేడు. సున్నపుగానుగ త్రిప్పేవాడు- కానీ, నిజానికితడు, ఒక మతగురువు (ఖాజీ) శిష్యుడు. విద్యా వంతుడు. ఆ ప్రశ్నలకు జవాబులు అతనికి తెలుసు. తాను పోయి జవాబు చెబుతానన్నాడు. అలా పోవడానికి ఆజ్ఞా పత్రాన్ని యివ్వవలసిందని, రాజుగారి ప్రశ్నలకు సక్రమమైన ప్రత్యుత్తరాలు యివ్వలేకపోతే, తన యజమానికి బదులు తాను చనిపోతానని అడిగాడు. కానీ ఖాజీ యిష్టపడలేదు. అయితే ఇంతలో ఒక రాయబారి రాజుగారు పిలుస్తున్నారని వచ్చాడు. ఖాజీ గడగడ వణకి భయపడి సేవకుణ్ణే పొమ్మని చెప్పాడు. తనకుఉన్న మామూలుగుడ్డలు ధరించాడు. అతడు వేదాన్తి! భారతదేశంలో రాజులు సన్యాసుల (స్వాములు) దగ్గరకు పోయి, జ్ఞానార్జనం చేస్తుంటారు. ఈ సేవకుడు (పాజీ) రాజును నిర్భయంగా సమీపించాడు. "అయ్యా! మీకేం కావాలె? మీరేమి అడగదలచారు?" అని అడి గాడు. "మీ యజమానికిచ్చిన ప్రశ్నలకు నీవు జవాబు చెప్ప గలవా?" అని రాజుఅడిగాడు. "నేనుచెప్పగలను. అయితే ఒకటి ఆ ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెప్పేవాడు గురువనీ, అడిగే వ్యక్తి శిష్యుడనీ మీకు తెలుసు. మీరు నిజమైన మహమ్మదీయులని పవిత్ర శాస్త్రధర్మాలను అనువర్తిస్తారని భావిస్తున్నాము.

ధర్మానుసారంగా, నాకు గౌరవపీఠం ఉండాలె। నాకంటే క్రిందిభాగంలో మీరు కూర్చోవాలె." అని పాజీ జవాబు చెప్పాడు. ఆ ప్రకారమే, రాజు, అతనికి సుందర వస్త్రాలంకారాలు యిచ్చి. తన సింహాసనంమీద కూర్చోబెట్టాడు. తాను మెట్లమీద క్రింద కూర్చున్నాడు. "అయితే ఒక విషయం - నీ ప్రత్యుత్తరాలు నాకు తృప్తికరంగా లేకపోతే, నిన్ను నేను చంపివేస్తాను." అని రాజు హెచ్చరించాడు. "అవును అది తెలిసేఉన్నది," అని పాజీ అన్నాడు.

ఇప్పుడు మొదట అడిగిన ప్రశ్నయిది. "భగవంతుడు ఎక్కడ కూర్చుంటాడు ?" అతడు దానికి మాటకు మాటగా చెబితే రాజు అర్థంచేసుకోలేక పోవచ్చు. అందుచేత పాజీ "ఒక ఆవును తెప్పించు" మన్నాడు. ఆవును తెచ్చారు. "ఆవు దెగ్గర ఏమన్నా పాలున్నవా ?" అని పాజీ అడిగాడు. "ఆ- ఉంటవి" అని రాజన్నాడు. "పాలెక్కడ ఉంటవి ?" అని పాజీ ప్రశ్న. "పొదుగులో" అన్నాడు రాజు. "అది తప్పు. పాలు, ఆవు శరీరమంతటా నిండివున్నవి. ఆవును తీసుకపోండి," అని పాజీ అన్నాడు. తర్వాత కొన్నిపాలు తీసుకవచ్చారు. "వెన్న ఎక్కడఉంది ? ఈ పాలల్లో వెన్న ఉందా ?" అని పాజీ అడిగాడు. "ఉన్నదన్నారు" "అయితే ఎక్కడవుంది ? నాకు చెప్పండి." అని పాజీ అడిగాడు. వాండ్లు చెప్పలేకపోయారు. అప్పుడతడన్నాడు, "ఇందులో వెన్న ఎక్కడవుందో చెప్పలేక పోయినా, నిజానికి, వెన్న పాలంతటా కలిసివుందని మీరు నమ్మవలసివుంది." అదేమాదిరి, భగవంతుడు సర్వవిశ్వ

వ్యాపియై వున్నాడు. పాలల్లో అంతటా వెన్నమాదిరి, ఆవులో అంతటా పాలమాదిరి సర్వత్రా ఈశ్వరుడు వున్నాడు. పాలు కావాలంటే ఆవును నీవు పితకాలికదా. అదేమాదిరి, దేవుడు కావాలంటే, నీ స్వహృదయాన్ని మధించాలె. రాజా! నీకు సరియైన సమాధానం వచ్చిందా?" అని పాజీ అడిగాడు. రాజు, "ఓ-అది సత్యమే" అన్నాడు. భగవంతుడెక్కడో ఏనిమిదో స్వర్గంలోనో తొమ్మిదో స్వర్గంలోనో వున్నాడనేవారి మాటలు కల్ల అని రాజుకనుగొన్నాడు.

తర్వాత రెండవ ప్రశ్న — "ఏ వైపు భగవంతుడు చూస్తుంటాడు- తూర్పా, పడమరా, ఉత్తరమా లేక దక్షిణమా?" ఇదికూడా చాలా కఠినమైన ప్రశ్నే. ఈప్రజలు భగవంతుణ్ణి ఒకవ్యక్తిగా చూస్తున్నారు. పాజీ అన్నాడు-"మంచిది ఒక దీపం తీసుకరాండి." ఒక మైనపువత్తితెచ్చి వెలిగించారు. ఆ దీపం తూర్పుగానీ, దక్షిణంగానీ, పడమరగానీ, ఉత్తరంగానీ ఏ వైపూ చూడకపోయినా, అది అన్ని వైపులా సమానంగా ప్రవర్తిస్తున్న విషయం చూపించాడు. రాజు సంతృప్తుడైనాడు. అదే మాదిరి నీ హృదయజ్యోతి భగవంతుడు.అతడు సర్వదిక్కులా ప్రసరిస్తున్నాడు.

తర్వాత ఇంకొక ప్రశ్న వచ్చింది. "భగవంతుడు ఏమి చేస్తాడు?" పాజీ 'మంచిది' అని, రాజా! ఖాజీని పిలిపించమన్నాడు. ఖాజీ వచ్చి, తన సేవకుడు రాజసింహాసనాసీనుడైయుండడం చూచి, ఆశ్చర్యచకితుడైనాడు. తర్వాత అతడు ఖాజీని పాజీ స్థానంలోను, రాజును ఖాజీస్థానంలోనూ, కూర్చో

మని చెప్పి, తాను సింహాసనం మీద కూర్చున్నాడు. "ఈ విధంగా భగవంతుడు వస్తుజాలాన్ని నిరంతరంమారుస్తుంటాడు. పాజీని రాజుగా, రాజును ఖాజీగా, ఖాజీని పాజీగా మారుస్తుంటాడు." ఇదే జగత్తులో నిరంతరంజరుగుతున్నది. ఒక కుటుంబం అభివృద్ధిలో ఉంటే అంతకు ముందుది పేరు లేకుండా పోతుంది. ఒక కాలానికి ఒక మనిషి ఎక్కువ గౌరవనీయస్థితిలో ఉంటాడు. ఇంకొకడు కొన్నాళ్లకు ఆ స్థానం ఆక్రమిస్తాడు. అదే మాదిరి రోజు తర్వాత రోజు, సంవత్సరం తర్వాత సంవత్సరం పరిభ్రమిస్తున్నవి. ఈ విధంగా ఈ పరివర్తన నిరంతరం అభంగురమై సాగిపోతున్నది. ఆ రోజునుంచీ ఆ పాజీ ఖాజీగా నిర్ణయింపబడ్డాడు.



# అరణ్య ప్రసంగాలు 11.

[ఈ క్రింది కథ కాంటర్‌బరీటేల్సులోని యాత్రికుల్లో ఒకడైన, ఒక సన్నని పొడగాటి యువకుడైన గుమస్తా, శ్రోతలను ఉత్సాహపరచడానికి చెప్పాడు.]

ఒకానొక దేశంలో, ఒకమంచి రాజకుమారుడున్నాడు. అతడు విద్యాధికుడు. సర్వలక్షణసంపన్నుడు. అప్పుడే కొత్తగా సింహాసనం ఎక్కాడు. సంవత్సరాలు సంవత్సరాలు గడిచిపోయినవి. ఇంకా అతను పెండ్లిచేసుకోలేదు. ఆయన పెండ్లిచేసుకోవాలని ప్రజలకు చాలా కుతూహలంగాఉన్నది. రాజకుంటుంబం అంతటితో ఆగిపోతుందని వాండ్ల ఆతురత. భార్యను ఎన్నుకోవలసిందని, ప్రజ లాయన్ని బలవంతం చేశారు. తుదకాయన అంగీకరించాడు. కానీ వారుమాత్రం, తన స్వయం వధూ నిర్ణయానికి ఆటంకం రాకూడదని కోరాడు. ఆదేశంలో ఎవరికీ స్వతంత్రంలేదు. ప్రేమ, వివాహము—యిలాంటి విష యాల్లోకూడా స్వతంత్రంలేదు. అక్కడి ప్రజలందరూ ఆచార బద్ధులు. ఆరాజకుమారుడు, తన యిష్టప్రకారం పెండ్లి చేసు కోవాలనుకున్నాడు. ప్రజలు, ఆయనకోరిక అంగీకరించకపోతే, జీవిత పర్యంతం రాజు అవివాహితుడుగా ఉంటాడేమోనని, ఆయన్ని స్వయంవరానికి ఒప్పుకోవడం యుక్తమని భావిం చారు. రాజు తన సభాసదులను ఉద్యోగులకు వివాహోత్స వానికి కావలసిన ఏర్పాట్లు చేయండని ఆజ్ఞాపించాడు. ప్రతిపనీ గొప్పరాజవైభవంతో నిర్ణయింపబడింది. నిర్ణేతదినంనాడు, మహావైభవంతో సేన సంసిద్ధపడింది. ప్రతిమనిషీ, గొప్ప

గొప్ప దుస్తులతో ముస్తాబైనాడు. రథాలు, గుర్రాలు వివిధ వాహనాలు అలంకరించారు. సైన్యమధ్యంలో, రాజు రథారూఢుడై పయనించాడు. ఒక ప్రత్యేకమార్గాన్ని అనుసరించకుండా, వాండ్లు రాజాజ్ఞప్రకారం పోతున్నారు. వాండ్లు దట్టమైన కీకారణ్యాలగుండా వెళ్ళారు. "ఏమిటీ? రాజుగారేమి చేయదలచారు? ఏదో సరోవరాన్నో, రాళ్ళనో, గుట్టనో పెండ్లిచేసుకోపోతున్నాడా?" అని ప్రజలు వాండ్లలో వాండ్లు అనుకున్నారు. ఆశ్చర్యపడ్డారు. అలాగే వెళ్ళారు. చివరకు ఆ అడవుల్లో ఒక చిన్న గుడిసె దగ్గరకు చేరారు. ఆ కుటీరానికి దగ్గరగా, ఒక నిర్మలమైన, సుందరమైన కొలను ఒకటి ఉంది. ఆ సరోవరతీరంలో, అనేక సుందరఫలవృక్షకదంబాలు ఉన్నవి. ఆ చెట్లల్లో ఒకకొమ్మకు ఒక గుడ్డఉయ్యాలఉంది. దానిలో ఒక ముసలి మనిషి పండుకొని ఉన్నాడు. "ఆ ముసలిమనిషిని పెండ్లాడబోతున్నాడా?" అని ప్రజలనుకున్నారు. కొంత సైన్యం ముందు వెళ్ళింది. రాజుగారిఏనుగ అక్కడికిరాగానే 'ఆగ' మని ఆజ్ఞాపించాడు. అప్పుడే, వాండ్లకొక అతిసుందరమైన, మనోహరమైన, మెఱుపులాంటి ఒక కన్యక కనబడింది. ఆకన్యక తనతండ్రి పండుకున్న ఊయల, నెమ్మదిగా ఊపుతున్నది.

రాజు, సింహాసనం ఎక్కకముందు, అనేకసార్లు యీ అరణ్యానికి వచ్చాడు. ఆ బాలికను కనిపెట్టాడు. ఎప్పుడు చూచినా, నిరంతర విద్యుక్తధర్మపరాయణగా కనపడింది. అతి శ్రద్ధతో తనతండ్రికి సపర్యలు చేసేది. నీళ్లు తెచ్చి

స్నానం చేయించేది. ఆహారం తినిపించేది. తోమేది. కాళ్లు పిసికేది. ఇలా సేవిస్తున్నప్పుడు, ఆమె ఎప్పుడూ ఆనందంగా, ఉత్సాహంగా, వికాసంగా, ఒక సంగీత పక్షిలాగా ఉండేది. ఆకన్యయొక్క సంతోషస్థితి, దానంతటదే రాజు హృదయంలో ముద్రితమయింది. ఏనాటికైనా పెండ్లాడితే, యీ కన్యనే పెండ్లాడాలని నిశ్చయించుకొన్నాడు. ఆకన్య, ఆపెద్ద సంరంభం వైపు తేరిచూచింది. తమ కుటీరపు గుమ్మంముందుగా, అనేక సార్లు గుర్రంఎక్కిపోయిన మనిషేనా యీ రాజని కొద్దిగా అనుమానించింది. ఈ అద్భుత దృశ్యమేమిటని తండ్రిని అడిగింది. ఒక పెండ్లికుమారుడు, ఒక రాజకుమార్తెను పెండ్లిచేసుకోడానికి, దూరదేశం పోతున్నాడని తండ్రి జవాబు చెప్పాడు. అప్పుడు రాజు ఏనుగనుండి క్రిందికిదిగి, ప్రాచ్యమర్యాదానుసారంగా, ఆ ముదుసలి పాదాలమీద వ్రాలాడు. ముదుసలి యిలా అన్నాడు. "కుమారా ! నీకేమికావాలె ?" రాజు ముఖం వికసించింది. "నన్ను మీ అల్లుడుగా చేసుకో ప్రార్థిస్తున్నాను." అని రాజు అడిగాడు. ఆ వృద్ధుడి హృదయం ఆనందంతో పొర్లిపోయింది. అతని పరవశత్వం మితిమీరిపోయింది. ఆ ముదుసలి యిలా అన్నాడు. "రాజా ! నీవు పొరపాటు పడ్డావు. ఒకపేద బిక్షుకుడు కూతురును పెండ్లిచేసుకోడానికి నీ కెలా యిష్టముంటుంది ? మేము చాలా బీదలము, నిరుపేదలము." తాను యీ మనోహర బాలికను ప్రేమించినంతగా యింకెవరినీ ప్రేమించలేదని రాజు పలికాడు. 'అలా అయితే, ఆమెనీదే' అని ముదుసలితండ్రి ప్రత్యుత్తరమిచ్చాడు.

ఈ వృద్ధుడు ఒక వైదాంతిక సన్యాసి. తన కుకుమార్తెకు జ్ఞానాన్ని కూడా ప్రదానంచేశాడు. తనకుమార్తెకు యివ్వడానికి ఏకట్నమూ లేదనీ, తాను యివ్వగలిగింది దీవనమాత్రమే యనీ ఆముదుసలి చెప్పాడు. రాజప్పుడు, పెండ్లికుమార్తెకు అనేక రకాల సుందర వస్త్రాలంకారాలుయిచ్చి, ఆమెను ధరించమని కోరాడు. ఆమె అలాగే చేసింది. అయితే, ఆ అమ్మాయి, రాజుదెగ్గరకు వట్టి చేతులతో పోగూడదను. ఆమె కొక కట్న ముంది. అదేమిటనుకున్నారు? సొమ్ములు దాచుకోవడానికి, రాజామెకు కొన్ని పెట్టెలు యిచ్చాడు. అందులో ఒకదాంట్లో తన తండ్రితో ఉన్నప్పుడు కట్టుకొనే, చినిగిన పాతగుడ్డలు పెట్టుకుంది. ఇప్పుడుముదుసలి ఒక్కడైనాడు. అతని అనుపులో ఒక సేవకుణ్ణి ఉంచారు. ఆ వృద్ధతపస్వి రాజును యింకేమీ అడగలేదు.

రాజు పెండ్లికూతురును తన రాజసౌధానికి తీసుక వెళ్ళాడు. మొట్టమొదట రాజాస్థానికులు, ఆమె హీనకులంలో పుట్టిందని అయిష్టం చూపారు. ఈ ప్రధానులు, గర్విష్ఠు లందరు, రాజును తమ కూతుళ్ళను మేనగోడళ్ళను పెండ్లాడ వలసిందని కోరారు. ఈ నిమ్నజాతి స్త్రీ వాండ్లకు నచ్చ లేదు. ఆమెను చూస్తే మిక్కిలి అసూయపడేవాండ్లు. ఈ తక్కువజాతి బాలికను, వాండ్లెలా సేవిస్తారు? కానీ, ఈ కొత్తరాణి, తన మధురస్వభావంచేత, సౌశీల్యంచేత, ప్రేమ తత్వంచేత, వాండ్లందరినీ సంతోషపెట్టింది. క్రమక్రమంగా వాండ్లందరూ ఆమెను గాఢంగా ప్రేమించడం మొదలు

పెట్టారు. ఆమె ఎప్పుడూ ప్రశాంతంగా వుండేది. ఏవిషయాన్ని గురించి కలతపొందేది కాదు. పరిస్థితులు ఎలావున్నా ఆమె ప్రతిచలించేది కాదు. . ఒక సంవత్సరం అయినతర్వాత, రాణికి ఒక కుమార్తె పుట్టింది. చాలా చక్కనిపిల్ల. రాజూ, రాణీ యెంత సంతోషంగా వున్నారనుకున్నారు! ఆ శిసువుకు మూడోఏడో నాలుగోఏడో వచ్చింది. ఒకనాడు రాజువచ్చి, 'రాజ్యంలో ఒక తిరుగుబాటు రాబోతున్నది'—అని రాణీతో చెప్పాడు. దానికి కారణం ఏమిటని రాణీ అడిగింది. "వుద్యోగస్థులు, మంత్రులు నిన్ను పెండ్లిచేసుకొనేటప్పుడే అసూయగా వున్నారు. ఇప్పుడు పుట్టినపిల్ల తన తల్లి మూలకంగా తక్కువ కులస్థురాలవడంచేత, ముందు సింహాసనానికి అధికారిణి అవుతుందనే భావం, వాండ్లను మరింత అసూయావేశితుల్ని చేసింది. వాండ్లు రక్తసిక్తం చేసైనా సరే, ప్రధాన మంత్రుల శిశువు నొకణ్ణి నాకు దత్తుచెయ్యాలని వాంఛిస్తున్నారు. ఈ శిశువు, ఆశిశువు పెరిగి పెద్దవాండ్లయిన తర్వాత వీండ్డిద్దరికి తగాదాలు వస్తవి. అలా జరగకుండా వుండాడానికి ఎంతో ఆలోచించాను. చివరకు, ఈ తగాదా నిర్మూలన మయ్యే మార్గం, యీ శిశువును చంపడమే—ఇంతకంటే మంచి మార్గం నాకు కనబడడంలేదు" అని చెప్పాడు. రాణిపేరు 'గ్రిజల్డా' (Griselda) ఆమె రాజుతో ఇలా ప్రత్యుత్తరమిచ్చింది. ఆమె జవాబులో ఎంత సౌశీల్యత, పతిభక్తి వుద్దీపిస్తున్నదో చూడండి. "మీకు తెలుసు—నేను వచ్చిననాటి నుండీ, మీతో కలసి, యీ సింహాసనం అనుభవించాలని

నా కెలాంటి కోరికా లేదు. నా వాంఛలు, నా కోరికలు నా సర్వస్వం మీపరం చేశాను. నా వ్యక్తిత్వము, నా శరీరము, నీలో కలిసిపోయినవి. నా శరీరం మీ సేవకేగాని, మీ కభ్యంతరంకోసం కాదు. ఈ శిశువు చనిపోవడం మీ అభిమతం అయితే, అలాగే చేయుండి. నా హృదంతరాల్లో ఎప్పుడైనా సరే, యీ శిశువు నాదని అనుకోలేదు." ఆ అర్ధరాత్రి శిశువు తీసుకపోబడింది. తర్వాత కొంతసేపటికి రాజువచ్చి, తలార్లకు శిశువును చంపడానికి వప్పచెప్పాను" అని చెప్పాడు. ఏమి జరగనట్లుగానే, రాణీ ప్రశాంతంగా, నిర్మలంగా ఉత్సాహంగా ఉంది. ఇదే వేదాంతం. ఎలాంటి బాహ్యపరిస్థితులకైనా, ఎప్పుడూ ప్రతిచలించకూడదు.

ఇంక ప్రతివాంఛకు సంతృప్తిగా వుంటుందని రాజు చెప్పాడు. ఇంకో సంవత్సరం అయింది. మళ్ళీ ఒక పిల్లవాడు పుట్టాడు. ఈ పిల్లవాడంటే అందరికీ ముద్దే. ఆ పిల్లవాడికి అయిదారేండ్లు వచ్చినవి. మళ్ళీ కలతలు పుట్టినవి. రాజు రాణితో చెప్పాడు. "మళ్ళీ పరిస్థితులు మారినవి. ఈ శిశువు బ్రతికివుంటే రాజ్యంలో పెద్ద యుద్ధంవస్తుంది. జాతీయ శాంతి స్థాపనకు, యీ శిశువును చంపవలసి వుంది." రాణి, మళ్ళీ చిరునవ్వుతో, ఇలా అన్నది. "ఈ దేశమంతా నా సత్యాత్మే. నాద నేది ఏమీ లేదు. నేను సూర్యుడులాగా వున్నాను. త్యాగమే నా స్వభావం. శూర్యునిమాదిరి, మను తీసుకో కూడదు. త్యాగం చెయ్యాలె. మనం దేనివల్ల, మోహబద్ధులం కానప్పుడు, మన ఆనందాన్ని అణచగల శక్తి దేనికివుంది?

నిరంతరం, సూర్యుడు త్యాగంచేస్తూ పోతుంటాడు. అయినా నిరంతరం ప్రకాశిస్తుంటాడు." ఆ శిశువునుకూడా తీసుక పోయారు.

ఇంకొన్ని సంవత్సరాలకు, మూడవ శిశువు జనించింది. మూడు నాలుగేండ్లు పెరిగినతర్వాత, ఆ శిశువునుగూడ వెను కటిలాగే తీసుకవెళ్ళారు.

అయితే, రాణి, తన భావోద్రేకాలు ఎలా జయింప గలిగింది? ఆమె రాచనగరికి వచ్చిన నాటినుండీ, ప్రతిదినమూ ఒక ప్రశాంత మందిరంలోకి పోతుండేది. అక్కడే ఆమె తన చింపిరిగుడ్డలు దాచుకొనేది. అదే ఆమె ప్రశాంతమైన గది. ఆ గదిలో, తన రాజదుస్తులన్నీ విడిచి పూర్వపు పాతగుడ్డలు గట్టుకొనేది. ఈ నిరాడంబర వేషంతో 'సోహం' పరబ్ర హ్మను నేను అని గుర్తించేది. అ భైక్షుకవేషంతో ఆమె తన దివ్యత్వాన్ని అనుభవించేది. "కిరీటం ధరించే శిరస్సుమీద ఎంతో శోకభారం వుంటుంది." అంటాడు షేక్స్పియర్. ఆ సరోవరతీరంలో ఆడుకుంటూ పాడుకుంటూఉన్న బాలికనే తానని ఆమె హృదంతరాల్లో మరిచి పోలేదు. ఇక్కడామె రాజనగరిలో కట్టుబడింది. ఆమె స్వతంత్రం, స్వేచ్ఛ అరికట్ట బడినవి. అయితేనేమి— ఆమె తన్ను శోకమయం చేసుకో లేదు. ఏ బంధాల్లో చిక్కుకోలేదు. ఆమె దేనిచేత మోహా బద్ధురాలు కాలేదు. ఆమె సత్యాత్మ నిరంతరం పరిసరపరిస్థితు లకు చాలా దూరంగా ఉన్నది. ఆమె నిరంతరం దివ్యత్వంలో మునిగి ఉండేది. సర్వమోహానురాగాలకు దూరమై, ఆమె

యీ విధంగా తన్ను తాను పవిత్రం చేసుకుంది. ఆమెకు ఏ బాధ్యతలు లేవు. ఆమె యే విధులకు, ఎవరికీ బద్ధం కాలేదు. ఈ విధంగా మీరు వ్యాకులంలో ఉన్నప్పుడు, విచారగ్రస్థులైనప్పుడు- రోగ మోహాలను, వాంఛలను, కోరికలను దూరం చేసుకోండి. మీరు స్వతంత్రులౌతారు. ఇదే విధంగా రాణి కూడా రాజసౌధంలో ఉన్నంతకాలం స్వస్థత వహించింది.

ఒకనాటి రాత్రి, రాజు రాణిని సమీపించి యిలా చెప్పాడు. "కొడుకులనూ, కూతుళ్లనూ పొడుగూతా యిలా చంపడం బాగుండలేదు. ఏ శిశువునైనా దత్తుతీసుకోడంగూడా నాకు సమ్మతంగా లేదు. ఆలోచించంగా, ఆలోచించంగా నాకొకటి తోచింది. ఇంకొక స్త్రీని పెండ్లిచేసుకుంటే బాగుండేటట్లు ఉన్నది. దేశంలో శాంతికూడా కలుగుతుంది." రాణి మనఃపూర్వకంగా ఒప్పుకున్నది. ఎందుకంటే - ఆమె ఎప్పుడూ రాజునుంచి ఆనందం పొందలేదు. ఆమె స్వాత్మనుంచే ఆనందం పొందుతున్నది కాని, ఇతర్లనుంచి ఆమె ఆనందం పొందడం లేదుకదా! ఆమెకు ఆనందప్రదాత అంతర్భగవానుడుగాని, ఈ భర్త, తండ్రి, సంతానం కాదు. ఆమె ఆనందానికి రాజు ఆశ్చర్యపడ్డాడు. ఏమి చేయడం ఆమెకు యిష్టమో అడిగాడు. 'నీ యిష్టమే నా యిష్ట'మని ఆమె ప్రత్యుత్తర మిచ్చింది. ఆమె ఉన్నట్లయితే కలతలు ఏర్పడతవి- అందుచేత ఆమె వెళ్లిపోవడం మంచిదని రాజు చెప్పాడు. వెంటనే ఆ సుందర వస్త్రాలంకారాలన్నీ విడిచి, తన చినిగిన పాతగుడ్డలు కట్టుకొని భైక్షుకవేషంతో ఆమె రాజప్రాసాదాన్ని విడిచివెళ్లింది. ఆమె ఉత్సా

హానికి, ఆనందానికి కొరతేమీ లేదు. తండ్రి దెగ్గరకు వెళ్లింది. మామూలు మాదిరి ఆనందంగా ఉంది. ఇచ్చట వృద్ధుడివద్ద వదలిన రాజసేవకుడు వెంటనే తిరిగి రాజుచెంతకు పంపబడ్డాడు.

ఒకనాడు రాజు ఆమెకు (గ్రిజెల్డా) సానుభూతి తెల్పుదామనే యుద్దేశ్యంతో కుటీర ప్రాంతానికి వచ్చాడు. కానీ, ఆమె నిరంతర మందహాసవదనారవిందంచూచేసరికి రాజుగారు తన ఉద్దేశ్యం మార్చుకోవలసి వచ్చింది. తర్వాత రాజు ఆమెను వచ్చి కొత్తపెండ్లికూతురును చూచిపోవలసిందని అడిగాడు. ఆమె మనఃపూర్వకంగా ఒప్పుకుంది. ఆమె రాజసౌధములో అద్భుతంగా అలంకరించింది. చక్కటి ఏర్పాట్లుచేసింది. అత్యంతప్రేమతో తగిన యేర్పాట్లు చేసింది. న్యాయాధికార్లు, వాండ్లభార్యలు ఆ సుందర సన్నివేశాలకు ఆశ్చర్యపోయారు. చేసిన యేర్పాట్ల ప్రకారం, పెండ్లికూతురు పెద్ద సైన్యంతో, బంగారు, వజ్రాలు మొదలయిన కట్నాలతో రాజు దెగ్గరకు రావాలె. రాజుగారి కోరికప్రకారం నూత్నవధువు మహావైభవంతో వచ్చింది. అతి వైభవంతో గ్రిజెల్డా, ఇంకా ఇతరస్త్రీలు ఆమెకు స్వాగతమిచ్చారు. కొత్త పెండ్లికూతురును చూడగానే గ్రిజెల్డా ఆమెను మాతృదేవతలాగా కౌగలించుకుంది. ముద్దుపెట్టుకొంది. అతిప్రేమచూపింది. కొత్తపెండ్లికూతురుసౌందర్యానికి, వచ్చిన స్త్రీలు ఆశ్చర్యచకితులైనారు. అయితే పూర్వపు రాణి నైతికసౌందర్యానికి ఇంకా ఆశ్చర్యనుగ్నులైనారు. కొత్త పెండ్లికూతురుతో, ఆమె ఇద్దరు చిన్నతమ్ములుగూడా ఉన్నారు. ఆ దేశాచారప్రకారం ప్రధానస్త్రీలు, రాజకుటుంబకాంతలు,

రాజబంధువులు, రాజసౌధంలో ప్రవేశించి గొప్ప విందారగిం చాలె. గ్రిజల్డా ఆ కార్యక్రమానికి ఆధిపత్యం వహించింది. తమ పూర్వపురాణి ముఖంలోని ప్రశాంతత, ఓర్పు, మనోజ్ఞ సౌశీల్యం చూడగానే ఒక్కసారి ప్రజల హృదయాలు కరిగి పోయినవి. వాండ్ల నేత్రాల్లో అశ్రువులు నిండిపోయినవి. విందు అయిన తర్వాత రాజసౌధం వదలి ఆమె తన తండ్రి ఉన్న కుటీ రానికి పోవడానికి సిద్ధంగా ఉంది. అయితే ప్రజలు విందులో మళ్ళీ రాణిని గూర్చి మరిచిపోయారు. అయితే చివర కామె శెలవు దీసుకుంటూ, మీా కెప్పుడైనా అవసరముంటే సంకో చింపక పిలవనంపండని రాజుగారితో చెప్పేసరికి, అక్కడఉన్న స్త్రీ సమూహాల హృదయాలు కరిగిపోయినై. భోరున ఏడి చారు. తమ కాఠిన్యానికి పశ్చాత్తాపపడ్డారు. "నీవు భిక్షుకుడి కూతురువు కావమ్మా; నీవు భగవంతుడి కుమార్తెవు." అని అన్నారు. దేశశాంతికోసం ఆమె కన్న సంతానాన్నికూడా చంప డానికి ఒప్పుకున్న విషయం ఆ స్త్రీలందరూ చెప్పుకున్నారు. క్రొత్తరాణికూడా ఏడవడం మొదలుపెట్టింది. క్రొత్తరాణి ఇలా అన్నది. "అమ్మా! నీకుమార్తె, నీ కుమారులు చంపబడ్డారు. అయ్యో! రక్తప్రవాహంలో తేలుకుంటూ నేను వచ్చాను." అప్పుడు అందరూ పశ్చాత్తాపపడడం ప్రారంభించారు; అందరూ అక్కడ ఉన్నారు. క్రొత్తపెండ్లికూతురును రాణి ఓదార్చిపోతు న్నది. అప్పుడు రాజు లేచి అన్నాడు- "ఓ ఉద్యోగస్తులారా! న్యాయాధిపతులారా! ఉత్తమస్త్రీలారా! గ్రిజెల్డా ఒక్కతే తప్ప, మీారందరూ దుఃఖిస్తున్నారు. వాపోతున్నారు. దుఃఖా

సందమిళితభావాలతో, నేనుకూడా దుఃఖిస్తున్నాను. ఓ ప్రజ లారా! నేను మిమ్మల్ని నిందించను. మీరు నా సంతానం. నా కండ్లు అశ్రువులతో నిండిపోయినవి. అయితే అవి దుఃఖాశ్రు వులు కావు. అవి ఆనందాశ్రువులు. సంతోషాశ్రువులు. మీ అశ్రువులుకూడా ఆనందాశ్రువులవుగాక!" అని, రాజు గ్రిజల్డా వైపు తిరిగి యిలా అన్నాడు. "సంతోషస్వాంతురాలవు కా! ఈ సర్వరాజ్యంలో నీ వొక్కతెవే ఆనందస్వరూపిణివి." ఈ కొత్త పెండ్లికూతురు, ప్రక్కదేశపు రాజకుమార్తె అనీన్నీ, అంటే- ఆ రాజుకు ఈమె, ఈమెతో వచ్చిన ఇద్దరు తమ్ముల్లూ దత్తసంతానమనీ, తెలియవచ్చింది. దారిలో తలారుల చేతుల్లో ఆ ప్రక్కదేశపురాజు యీశిశువుల్ని చూచి అందంగా ఉండడం చేత పెంచుకున్నాడు. ఈ ముగ్గురు శిశువులు ఈ రాజుకు, గ్రిజల్డాకు కలిగిన సంతానమే. చంపటానికి తలారులకు వప్ప చెప్పింది వీళ్లనే. ఆ తలార్లకు చంపటానికి చేతులురాక ప్రక్క రాజ్యానికి తీసుకపోయారు. ఈ విషయాలన్నీ ప్రజలకు విశదీక రించబడినవి. ఆ వికృతాకారులైన తలారులచేతుల్లో ఈ సుంద రులైన శిశువులను చూడగానే, ఆ ప్రక్కదేశపురాజు యీ పిల్లలు ఏ దేశపురాజు సంతానమోనని తాను పెంచుకొన్నాడు. సరే యింక రాజు, కుమార్తెను పెండ్లిచేసుకోకూడదు గదా! అందరి ఆనందం కోసం గ్రిజల్డా రాణిగా నిలువవలసి వచ్చింది. ఆమె సంతానమే సింహాసనానికి ఔరసులైనారు. చూచారా! భగవంతుడెప్పుడూ అతి కృతజ్ఞుడు. వడ్డీతో సహా ఆయన తన బాకీ తీరుస్తాడు.

ప్రతి గృహిణి, ప్రేమలో ఇట్టి ఉత్తమసన్యాసమే అనుష్ఠించుగాక! భారతవర్షంలో అలాంటి వ్యక్తుల్నే పతివ్రత అని, పత్నీవ్రతుడని పిలుస్తారు. అంటే భార్య భర్తలోనే జీవించాలె. భర్త భార్యలోనే జీవించాలె. భార్యభర్తలో భగవంతుని దర్శించాలె. ఆమె తనభర్తకు తన మనో శరీరార్పణం చెయ్యాలె. భర్త ఆమెలోని భగవంతుడికి ఆత్మార్పణం చెయ్యాలె. వ్యక్తిగతమైంది ఏమీ లేదు. ఇక్కడ స్వార్థం లేదు. భారతదేశంలో నదీతీరాల్లో, బహిరంగప్రదేశంలో వివాహకర్మ జరుగుతుంది. మందమారుతం వీస్తుంటుంది. పైన సూర్యభగవానుడు సాక్షి. ఇక్కడ భార్య భర్త చేతిని పట్టుకుంటుంది. భర్త భార్య చేతిని పట్టుకుంటాడు. అక్కడ భావన యీ రెండూ భగవదర్పణం చేయడం. గ్రిజల్డాకు ఏవిధంగా రాగమోహాలు లేవో, స్త్రీలు భగవంతుడికి, ఆత్మకు తమ్ము తాము అర్పించుకొని రాగమోహాతీతులు కావాలె.

పురుషులుకూడా ఈ పని చేస్తారుగాక! భర్త భార్యలో, భార్య భర్తలో ఐక్యమైనప్పుడే, గృహస్థజీవనం ఆనందప్రదం అవుతుంది. ఇలాంటి అభేద జీవనమే, జీవిత ప్రేమలను నిజంగా అనుభవయోగ్యం చేస్తుంది.



# అరణ్య ప్రసంగాలు 12.

## ప్రత్యుత్తరాలు.

### రాముడు భావ సమాధిమగ్నుడైనాడు !!

సత్యాత్మకు పుట్టుక లేదు. శరీరానికే పుట్టుక. పరబ్రహ్మ అవతారాతీతుడు. జగత్తు నా శరీరం. వాయువంతా నా శ్వాస. వృక్షాలు నా వెంట్రుకలు. నదులు నారక్తనాళాలు. పర్వతాలు నా ఎముకలు.

కొన్ని ప్రదేశాల్లో దీర్ఘమైన సందెవెలుగు ఉంటుంది. కొన్ని ప్రదేశాల్లో దిఙ్మండలంపైన సూర్యకాంతి ప్రజ్వలిస్తుంటుంది. నీ వెక్కడైనా తిరగవచ్చు. అది సంపూర్ణంగా నీఇచ్ఛ మీాదే ఆధారపడి వుంది. నీ యిష్టంవచ్చిన పద్ధతి కోరుకో. వాంఛలంటే శక్తి-అంటే వెలుగు, వేడి, విద్యుత్తు, శబ్దము మొదలైన వివిధ రూపాలలోని శక్తి. పదార్థము ( Matter) శక్తియొక్క ఒక స్వరూపమేనని ఋజువు చేయబడింది. లైబ్నిట్జ్ (Leibnitz) పరమాణువులు శక్తికి కేంద్రాలంటాడు. ఘనపదార్థంకూడా నా ఇచ్ఛాకృతే. మంచుగడ్డ నీరే. నీరు కూడా నీరే. స్వరూపాన్ని నేనే. స్వరూపంలో ఉన్నది నేనే. ఆ స్థితికి మేలుకో ! యోగవిద్య నిన్ను వెతుక్కుంటూ వస్తుంది. ప్రతిదీ నీవద్దకు వస్తుంది. ప్రజలు, వెన్నెముక (Spinal Column) మూలకంగా తప్పుత్రోవన పోతున్నారు. వాండ్లు రాజమార్గాన్ని వీడి, యిరుకుసందులగుండా పోతారు. 8 అంకెను ఒకదానిమీాద ఒకటి పేరిస్తే ఒకే

వరుసగా వున్న ఈ రంధ్రాలు రెండు గొట్టాలుగా కనబడతవి. గ్రంథాలు ఈ గొట్టాలను తెరవడంయొక్క ప్రాముఖ్యతను గురించి చెబుతవి. ఈ క్రియను పొందడానికి పన్నెండు సంవత్సరాలు కృషిచేసి చదివిన ఒక వ్యక్తికి, రాముడీ రహస్యాన్ని చెప్పాడు. ఇవ్వాళ్ళే ఆయన వచ్చాడు. ఈ కొద్దికాలంలోనే తాను సర్వాన్ని పొందానని, ఇదివరకటికంటే, పరమావధికి దగ్గరగా ఉన్నానని చెప్పాడు. సుషుమ్నను తెరవడంలాంటి విషయాలమీద ఆధారపడే మానవులు, తమ్మెతాము తప్పు త్రోవలో పెట్టుకుంటారు. ఆహారం కడుపులోకి పోతుంది. ప్రాణవాయువులో కలిసిపోతుంది. శరీరంద్వారా తనవిధి తను నెరవేరుస్తుంది. జఠరరసం ఉత్పన్నం చేస్తుంది. ఆహారనాళంగుండా పయనిస్తుంది. మనం ఈ మార్పులను గ్రహింపవలసిన అవసరంలేదు. ఆహారం తన జాగ్రత్త తానే తీసుకుంటుంది. అలాగే మానవుడు, ఆత్మజ్ఞానం పొందడానికి 'రాజయోగం' ఉపయోగకారికాదు. సరియైన మార్గంలో నీవు నడువు. ఆనందద్వారం తప్పక నీకోసం తెరవబడుతుంది. ప్రాణాయామం చెయ్యకండి! అనవసర విషయాల్లో కాలం వృథాచెయ్యవాకు' ప్రాణనియమం చిత్తసంయమనం కోసం కాదు. ఈ పద్ధతులమీద ఆధారపడి ఏ మానవుడూ చిత్తైకాగ్రత పొందలేడు. నియమిత శ్వాసచిత్తాన్ని నిరోధించలేదు! మిథ్యావాదం. ప్రతి శాస్త్రజ్ఞుడు, ప్రాణనిరోధమంటే చిత్తనిరోధమని యితర్లను బలవంతంగా ఒప్పించడానికి వాంఛిస్తాడు. చిత్తాన్ని నిరోధించు; ప్రాణం నిరోధింపబడుతుంది.

రాముడు మరొక మార్గాన్ని అనుసరించాడు. (చిత్త) సంస్కరణాన్ని వదలిపెట్టి, సామాన్యపథంలో ఏకాగ్రతను పొందలేకపోయినాడు. అతడు మొదట మనస్సును వశంచేసుకొన్నాడు. ప్రాణం వశమైంది. ఒకసారి అతడు స్నానానికి వెళ్ళి పారవశ్యతచేత చెరువులో మునిగాడు. వెంటవచ్చిన స్నేహితులుకూడా స్నానంచేశారు. నీళ్ళలో మునిగారు. కానీ, బైటికి వచ్చారు. రాముడికోసం ఎదురుచూచారు. కాని, రాముడు కనబడలేదు. అతడు నీళ్ళల్లో మునిగి పోయాడో, లేక మునలి నోటబడ్డాడో అనుకున్నారు. భయపడ్డారు. రాముడు బైటికి వచ్చాడు. ఇచ్ఛవల్ల, శ్వాసానిరోధం కలుగుతుందనే విషయం తెలుసుకొని, వాళ్ళంతా ఆశ్చర్యపడ్డారు. సత్యాత్మసార నిష్ఠుడవై జ్ఞానానుభూతికి ప్రయత్నించు. బ్రహ్మైక్యంపొందు. ప్రాణం, నిదానానదాసుడు. నీవు విశ్వప్రాణాన్నే నిరోధిస్తావు. దివ్యాత్మా మేలుకో! విశ్వనాథా, బ్రహ్మాండాధినాథా! మేలుకో! ప్రధానకార్యం పరబ్రహ్మను తెలుసుకోవడమే. సూర్యులకు సూర్యుణ్ణి! పరంజ్యోతిని! అదే నేను! నీవు, పురుషుడివి, స్త్రీవి, బిచ్చగాడు లేక మహారాజువు, అభాగ్యుడివి ఎందుకైనావు? నీవు నిన్ను అలాగా భావించావు. అలాగే నీవైనావు. 'యద్భావం తద్భవతి' నిన్ను నీవు భగవంతుడిగా భావించు, నీవు భగవంతుడవౌతావు. ఒకయిల్లు కట్టాలంటే చాలాకాలం పడుతుంది. పడగొట్టానికి నిమిషంచాలు. నీ చెరసాలను కట్టుకోడానికి నీవు చాలాకాలం తీసుకొన్నావు. దాన్ని బ్రద్దలుచెయ్యి! దేవదేవుడివి నీవు! సత్యాత్మస్థితికి నీవులే!

పరంజ్యోతిలో పడిపో! చూడు — సకల ప్రపంచాలు నీముందు నిల్చొంటాయి! ఉదయభానుడు, బ్రహ్మాండలానికి క్రిందగా నున్నప్పుడు, అంటే ఉషఃకాలం భారతదేశంలో మంచిసమయం. అప్పుడు భావాలు ఉన్నతాలవుతవి. ఒక్కసారి నీవప్పుడు మహోన్నత పర్వతాలకు ఎగ్రబాకగలవు. మొట్టమొదట పెనిసిలును పైకి ఎగరగొట్టడానికి ఒకదెబ్బగొట్టుతాము. ఎగరంగానే ఇంకొక గట్టిదెబ్బకొడతాము. దానివల్ల అది పైకి ఎగిరిపోతుంది. అదేమాదిరి చిత్తాన్ని వాతావరణంలోకి (పైకి) పోనియ్యి. తర్వాత మహోన్నత స్వర్గంలోని, భగవత్సన్నిధికి, ఎగిరిపోవడం దానికి సులభం. పక్షుల కిలకిలారావాలు, మందమారుతాలు, సెలయేళ్ళ మర్మరధ్వనులు, వీటివల్లకలిగిన సంచలనాన్ని ఆకాశం అంటనియ్యి. అనుభూతవాఙ్మయంలో, ఓంకారగానంచెయ్యి. ద్వైతభావన (భేద) ఏమాత్రం లేకుండా, అద్దంచూచినట్లు ఉదయభానుణ్ణి చూడు. అత్యధికమైంది నాఆత్మే. ఆపరమాత్మను నేనే. భారతీయస్త్రీలు బొటనవ్రేళ్ళ మీద చిన్నఅద్దాలు ఉంచుకుంటారు. వాటిల్లోకి చూస్తారు. అద్దం వాండ్లకు కనబడడంలేదు. అయితే వెలుపల అద్దంలో తమముఖాలే చూస్తారు. అయితే గుర్తించండి — వాండ్ల స్వముఖాలే, బైటకూడాచూస్తున్నది. అదేమాదిరి వేదాంతి, సూర్యుడు తన ఆత్మేనని తెలుసుకుంటాడు. నేనే సూర్యులకు సూర్యుణ్ణి! ఆ సూర్యుడు నాఛాయామాత్రమే! నేనే ఓంకారార్థం! భాషా, పెదిమలు, భావం, క్రియ, అలా ఏకంగావాలె.

"బిడ్డా, నాతో రా" నీ మాటల్లో శక్తి లేదు. ఇంకొక పిల్లవాడు, అక్కడ ఉండడు. అతన్ని చూడడానికే నీవు నిరీక్షిస్తుంటావు. అతను వస్తాడు. నీవంటావు— "ఓహో! రా! నాయనా! రా!" ప్రతినరంద్వారా, ప్రతిరోమంద్వారా, మాట్లాడుతూ, పరుగెత్తి, పట్టుకొని, కౌగలించుకుంటావు. ఇదే అనుభూతి, లేక భావభాష. నీ శరీరంలోని నరనరంతో ఓంకారగానంచెయ్యి. స్వల్పశక్తితోనే ప్రారంభించు. ధ్వని మొదట కంఠంగుండా వస్తుంది. తర్వాత గుండె, క్రిందికిపోయి పోయి, వెన్నెముక మూలంనుండి బయలుదేరుతుంది. తర్వాత విద్యుచ్చలనం, శుషుమ్నా వికాసం జరుగుతుంది. నీ ప్రాణం (Breathing) క్రమబద్ధమవుతుంది. సర్వరోగాణువులు వదలి పోతై. సూర్యుడితో చంద్రుడికి ఎలాంటి సంబంధముందో, తనతో సూర్యుడికలాంటి సంబంధం, వేదాంతి దర్శిస్తాడు. చంద్రుడు తను స్వయంగా ప్రకాశిస్తున్నట్లు కనబడతాడు. కాని, ఆకాంతిఅంతా సూర్యప్రదానమే. అలాగే, సూర్యుడు స్వయం ప్రకాశమానుడై ఉన్నట్లు కనబడతాడు. ఐతే ఆ ప్రతిభ నానుంచే వస్తున్నది.

కలల్లో, నీవు అనేక వస్తువులు చూస్తావు. ఒక విద్యుద్దీపాన్ని చూస్తావు. వెలుతురులేకుండా, నీవేమీ చూడలేవు. కలల్లో, వస్తువులు చూడ్డానికి వెలుతురు లేదుకదా. అయితే స్వప్నంలో విద్యుద్దోళాన్ని లేక మణిని చూపిస్తున్న ఆవెలుతురేమిటి? అది నీ ఆత్మకాంతి! నీ కలల్లోని సూర్యప్రతిభ, నీ తేజస్సే! నా ప్రతిభచేతనే, సూర్యప్రతిభ చూడబడు

తున్నది! **వేదాంతి** అనుభూతి అలాఉంటుంది. స్థూలప్రపంచం లోని సూర్యుడు, తేజస్సు లేక జ్ఞానంయొక్క చిహ్నం. సూర్యునివైపుచూచి నేను జ్ఞాన తేజాన్ని అని భావిస్తాను. సూర్యుడు, శక్తియొక్క చిహ్నం. గ్రహాలను తిరిగేటట్లు చేస్తాడు. సర్వజగత్తుకు ప్రాణదానం చేస్తాడు.

ఇక్కడ ఇంకో **మార్గ**ముంది ఓంకారాన్ని తెలుసుకోడానికి.

'అ' — జీవమునకు ప్రత్యామ్నాయంగా ఉంటుంది.

'ఉ' — 'తేజస్సు' లేక జ్ఞానానికి చిహ్నంగా ఉంటుంది.

'మ' — ఆనందానికి అర్థం.

బంగారు అక్షరాలతో వ్రాయబడిన సూర్యుడిలోని సాంకేతికలిపిలో ఓంకారచిహ్నం ఉన్నది. లిఖితపదంమాదిరి. ఓంకారమూ, సూర్యుడూ, నా స్థూలచిహ్నం; నాస్వరూపమే.

సూర్యుడు సౌందర్య చిహ్నం. సర్వ గ్రహాలను ఆకర్షిస్తాడు. మిరిమిట్లు కొల్పుతుంటాడు! ఎంత అద్భుత సౌందర్యం. ఆనందాన్ని ప్రతిఫలిస్తుంటాడు. తెలుసుకో, నేను సత్యాన్నని-మహాప్రతిభనని తెలుసుకో! సర్వగుణాలు నావే! సర్వగుణాలు నేనే! నేనే!

జీవము, జ్ఞానము, ఆనందం, సూర్యుడు నాయొక్క చిన్న స్థూలప్రతిబింబమే! ఓంకారాన్ని నేను పూజించను. ఓంకారమే నన్ను అర్చిస్తుంది! ఎవరి ఎదుట గ్రహాలు, సర్వ మానవులు,

దేవతలు, సకల చరాచర ప్రపంచం పరిభ్రమిస్తున్నవో, ఆ సూర్యుణ్ణి నేను. నిర్వికారుణ్ణి. నిత్యుణ్ణి! తన సర్వాంగ సౌంద ర్యాన్ని నాకు చూపడానికి సర్వవిశ్వమూ నా ముందు పరి భ్రమిస్తుంటుంది. సూర్యుడు నాకోసమే నా ముందు ప్రకా శిస్తున్నాడు.

క్రీస్తుహృదయం,
షేక్స్పియర్ మేధస్సు,
ప్లేటో మనస్సూ,

సర్వమూ నా ప్రభావం చేత జీవిస్తున్నవి. నా సూర్యకాంతిని త్రాగుతున్నవి. సూర్యదర్శనం కాగానే, మానవులు తమ కండ రాలు ఆయన వల్లనే సంచలిస్తున్నవని తలుస్తారు. వెలిగి పోతున్న నా సందర్శనంచేతనే ఇదంతా జరుగుతున్నది సుమా!

నాలో ఉండు! సూర్యులకు సూర్యుణ్ణి; పరంజ్యోతిని నేను! నేననే సముద్రంనుండే సర్వ తరంగాలు లేస్తున్నవి. నేను చక్రవర్తులకు చక్రవర్తిని! రాజులందరూ నేనే! పూలన్నీ నేనే! సూర్యకిరణాల్లో నేను నవ్వుతాను. మహాయోధుల కండరాలు నేను కదిలేటట్లు చేస్తాను. సర్వత్రా నా ఆజ్ఞ నిర్వర్తితమవు తున్నది! నా సామ్రాజ్యం, నా వైభవం, ప్రతి జీవినీ పోషిస్తు న్నది! భూమండలాన్ని పరిభ్రమింప జేస్తున్నది. దుర్భావాలు, ప్రాపంచికవాంఛలు నాసమక్షంలో కనబడ్డానికి అధికారం లేదు.

నా పవిత్రసన్నిధిలో క్షుద్ర వాంఛలు ప్రవేశించడానికి వీల్లేదు. కామక్రోధాదులు అజ్ఞానజనితాలు! అణువు మొదలు

అనంతబ్రహ్మాండం వరకూ సర్వంలో నేను వ్యాపించియున్నాను. నేనే సాక్షిని. జగన్నాటకసూత్రధారిని. క్రీస్తులో ఉన్నది నేనే! నీచాతినీచుల్లో ఉన్నది నేనే! నేనే సర్వం! నీవుకోరేదల్లా నేనే! ఉరుముల్లో, ఉప్పొంగే సముద్రాల్లో నేను తాండవిస్తాను. ఫ్రాంక్లిన్, కాల్విన్, న్యూటన్ మొదలైనవాళ్ల యొక్క మతప్రవక్తల యొక్క హృదయాలు నేనే! ఉద్యానవనాలకూ, సుందర ప్రకృతిసీమలకూ నేనే ఆధారమైనమనోహరప్రాదాన్ని! ఈ ఉద్వేగంతో, ఈ అర్థమంతా ఓంకారములో చూడు— ఈ పద్ధతి సులభమైంది. ఓంకారాన్ని జపించు. దాన్ని ఉజ్జీవించు. దేవతల్లాగా దాన్ని ఆచరించు. నీచ వాంఛలకు తల ఒగ్గడానికి కారణం, ఆత్మగౌరవం లేకపోవడమేనని కనబడుతున్నది. నీ అద్భుతప్రతిభలో, నీ దివ్యపదవిలో నమ్ము. ప్రాపంచికవాంఛల చేత వికలత పొందినట్లైతే, నీవు ఓంకారగానం చేయడం లేదన్నమాట.

సుషుమ్న వికసనాన్ని గురించి, సహస్రార పద్మాన్ని గురించి, నీ కాలాన్ని వృథా వ్యయం చేయవాకు. సర్వం నీకు లభిస్తుంది. నీవు అద్భుత ఫలితాలు పొందుతావు. భయానికి, విచారానికి, ఆతురతకు అతీతుడవుతావు. నీకు పూర్ణజ్ఞానం కలుగుతుంది. ప్రపంచం దానంతట అదే నీ వద్దకు వస్తుంది. చరాచర ప్రపంచం నిన్ను భక్తితో కొలుస్తుంది. చిక్కు దోవల్లో పడి కలవరపడవాకు. చివరకు నీవు పశ్చాత్తాపపడవలసి వస్తుంది.

ఓం! ఓం! ఓం!

★

# సవరణలు



| పేజి | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| పీఠిక 2 | 21 | పిండదులూ | పిండదులు |
| ,, 3 | 16 | పేరింటు | పేరంటు |
| 4 | 22 | (.) ఫుల్‌స్టాప్ | (,) కామా |
| 9 | 8 | ,, | ,, |
| 9 | 18 | ! | , |
| 44 | 20 | వేగయిదుగో | వేగమే యిదుగో |
| 45 | 19 | సత్వమా | సత్యమా |
| 46 | 13 | అట | అతి |
| 50 | 2 | స్వల్పాపకారానికి | స్వల్పోపకారానికి |
| 53 | 9 | చల్లని | నల్లని |
| 56 | 13 | యాను | యాదువు |
| 56 | 20 | ఘూప్రకాశ | భ్రూప్రకాశ |
| 60 | 17 | ఉద్ధరితుడ | ఉద్ధితుడ |
| 64 | 9 | . | , |
| 69 | 1 | సర్వాత్మగా ! | సర్వాత్మగా, |
| 71 | 7 | విభ్రాతులను | విభ్రాంతులను |
| 72 | 5 | మహాత్మా | మమాత్మా |
| 72 | 6 | . | , |
| 76 | 20 | కంపముల | కంటకముల |
| 84 | 21 | సత్య | సత్యం |
| 91 | 11 | విషయాలకు ఆదర్శమున్న మానవుడు | విషయాలకు |
| | 13 | చిన్నచిన్న | ఆదర్శమున్న మానవుడు చిన్నచిన్న |

| | | | |
|---|---|---|---|
| 91 | 16 | త్రాణాన్ని | ప్రాణాన్ని |
| 95 | 15 | . | , |
| 99 | 14 | చూస్తారు, | చూస్తారు. |
| 100 | 16 | ప్రకటించటానికి. | ప్రకటించటానికి, |
| 109 | 7 | మార్చుకొనిరి | మార్చుకోండి. |
| 111 | 1 | భోగవాసులను | భోగవాసనలను |
| 115 | 22 | తోందర | తొందర |
| 117 | 9 | నిర్విక్రమమైన | నిర్వ్యక్రమమైన |
| 123 | 13 | స్వభావం | స్వభావం. |
| 126 | 23 | కొనిపో | కొనిపోతుంది |
| 129 | 21 | గృహాంతరాళాలలో | గుహాంతరాళాలలో |
| 130 | 16 | ఒంకమంటి | బంకమంటి |
| 139 | 11 | లన్ని | లన్నియు |
| 144 | 10 | దహిత | రహిత |
| 146 | 5 | బిగిస్తాడు | బిగిస్తారు ? |
| 151 | 19 | అధికారం | అధికార |
| 156 | 8 వ పంక్తిలోని "కర్తృత్వ అహంకార మరణం" అనే పంక్తిని పద్యపాదంలోంచి తీసి క్రిందివిషయానికి హెడ్డింగుగా చదవాలి. | | |
| 162 | 1 | వారిలోకుండా | వారిలోగుండా |
| 162 | 12 | కెర్మిష్ఠి ! | కర్మిష్ఠీ ! |
| 170 | 4 | అదే వేదాంతం, | అదే వేదాంతం. |
| 171 | 1 | వాంఛతా | వాంఛలూ |
| 187 | 21 | సహచె | చెముసేపు |
| ,, | 22 | జంగా | అవగానే |

